

విరోధి సం. భాద్రపదము

భారతి

సంపుటము 26 సంచిక 9

# కిసగౌతమి

శ్రీ కె. అన్నమరాజశర్మ

ఈ రహోభిత్తార్థిని యెవ్వ రీమె !
పెదవి తడియార, లేగాను గదలి యాడ,
ఇంటికిం టికి నేగి యర్థించుచుండె
"వేరె డావాలు" నా పల్కె చెవుల బడెడు.

చాన మృతపుత్రు నొకని బుజాన బూని
కడపగట్టిన యిల్లెల్ల గలయ దిరిగె,
ద్వారములనుండి తెరవ లుదారమతిని
"రమ్ము, కిసగౌతమీ! యిటు రమ్ము రమ్ము.

తుందుభమ్ములకా యింత తొట్రుపాటు!"
అనగ నాతురచిత్తయై యడుగు నిట్లు—
"పుట్టు చావులు మీయింట బొరయవేని
ప్రభుని యాజ్ఞానుసారంబు బడయుదాన."

విస్మయప్రదవాక్కుల విన్న జనము
"పిచ్చిదాన ! పో పొమ్మ"ని వెడలనడచి
వాకిళుల మూయ, నారేయి నేకతముగ
గాలువల దాటి, యడవుల గడచి కడచి.

విసివి వేసారి, మృతసుతు వేగ గొనుచు
బుద్ధు పాదాబ్జముల మ్రోల మోకరిల్లి,
"జననమృత్యువిహీనసంసరణ మొందు
కాననైతిని ప్రభో దయాళి ! కాననైతి."

అనగ, గౌతము డాదరాయత్తు డగుచు
"బహుళశోకార్తిసంసృతివనమునుండి
అమృతఫలముల కేలీల యూన గొనెదు
కష్ట సుఖములు లోకాన కవలు సుమ్మి."

---

# తనివిదొన్నె

శ్రీ దిగుమర్తి సీతారామస్వామి

తనివి చెందిన మా జీవితములయందు
పోటుపాటు లెరుంగ దామోదకలన
స్థవిర హేమంత పాలితస్థాణువీథి
నేని ఆనందమూర్ధ్వవాహినిగ దోచు.

తడికతల్పును జీకటివడకు గుడిసె
కుంచుకొని లోన చలికి కంపించుమేను
గాలుపులు పెట్టు కటికియాకటిని గెల్వ
త్రావినది వాగునీ; రమృతముగ త్రేన్పు.

ఫలము లవి నందనైకలభ్యములె గావు
వలపు లవి యచ్చరల వీటికలవె గావు
పసపుబిట్టల పాటల పసకు సాగయు
నామనిఁ జవ్వనుల హృదయాల నొదవు.

తృప్తి పాలించు గడ్డపై తీయనైన
పాలు క్రోల్చగ దొన్నెలే చాలు-పసిడి
గిన్నెలు రవల గాజుల కేలిమెరుగు
లందు విషపూరితము లతృప్తాంగణములు.

అలయని యూరుబిచ్చుకల
యల్లరిపాటల దెప్పరిల్లు తె
క్కలు తెగినట్టి కోర్కెలు; జ
గాజిగిమంచున నించు మూగసం
జలు జలతారువెన్నెల వ
సందు; సరోవరలక్ష్మి తూటిపూ
వుల కయి నేతకే మురిసి
పోయెడు నీ చలికారువేళలన్.

---

# నన్నయ్యగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి

ప్రధాన కథ 3

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

భారతములోని ప్రధానకథ కౌరవపాండవుల వైరము. దీని యంకురము, దీని వృద్ధి బాల్యక్రీడలు, కుమారాస్త్రవిద్యాప్రదర్శనము- రెండుగా ప్రదర్శింపబడినవి. మూడవది లాక్షాగృహదహనము. అది యంతయు నొక దైవదుర్విలసితము- కథ జరుగుటయే కాని దానియం దంత విశేషము లేదు. ఈ వైరవృత్తమునకు నిజమైన పుష్పోద్గమము ద్యూతము. ఆ ద్యూతము భారతకథ కాయువుపట్టు. దుర్యోధనుని వైరభావమునకు కర్ణశకును లిద్ద రాలంబములు. వా రిద్దరు లేకుండ భారతము లేదు. ద్రౌపది లేనిచో వారి వైర మింత తీవ్రరూపము దాల్చెడిది కాదు. ద్రౌపదీవస్త్రాపహరణమే కౌరవపాండవ వైరభావమునకు శిఖరము వంటిది. విరోధము లుండవచ్చును. ఒకరి కొక రపకారములు చేసికొనవచ్చును. ఈ విరోధము స్త్రీమానభంగహేతుక మైనప్పుడు దాని నెట్టదనము పట్టరానిదిగా నుండును. ఈ సర్వవైరవృత్తమునకు ద్రౌపది మూలకందముగా గన్పించుచున్నది. ఆమెను బలాత్కారముగ దుశ్శాసనుడు చీర లొల్చుటచేత, నామెను తన తొడమీద గూర్చుండుమని దుర్యోధనుడు సన్న చేయుటచేత భీముడు ప్రతిజ్ఞలు చేసెను. అందుచేత ద్రౌపదియే యీ మహావైరవ్యూహమునకు నడిబొడ్డుగా గన్పించుచున్నది. ప్రత్యేకముగా ద్యూత మంతయు, ఆ ద్యూతముయొక్క పరిణామమంతయు, దుష్టమైన పర్యవసానమంతయు, మరల నాడిన పునర్ద్యూతమంతయు, నరణ్యాజ్ఞాతవాసములుగూడ సర్వమును ద్రౌపదీహేతుకములు. ద్రౌపదిలేనిచో నీభారతకథ యిట్లుండెడిది కాదు. ద్రౌపది లేనిచో ద్యూతమాడెడివారు - పాండవు లోడిపోయెడివారు - తరువాత నేమయ్యెడిదో భగవంతునకు తెలియవలయును. ఒకవేళ ధృతరాష్ట్రుడు వారి రాజ్యము వారల కిచ్చెడివాడేమో! పాండవులు జీవితాంతము సామాన్య రాజకుమారులవలె బ్రతికెడివారేమో! ద్రౌపది కీ ప్రాధాన్యము కథయం దున్నదని తెలిసికొని వ్రాయుట కథారహస్యపరిజ్ఞానము.

విదురుడు పోయి పాండవులను ద్యూతమునకు పిలిచికొనివచ్చెను. పాండవులును ద్రౌపదియు వచ్చి వృద్ధులకు నమస్కారము చేసిరి. "అంత ద్రుపదరాజనందనయు గాంధారికి మ్రొక్కిన నక్కోమలిం జూచి గాంధారి కోడండ్రెల్లను విస్మితులై యిట్లనిరి.

"అఖిలలావణ్యపుంజంబు నబ్జభవుడు
మెలతగా దీనియందు నిర్మించెనొక్క
కాని నా డిట్టి కాంతి యేకాంతలందు
లేల లేదని సామర్ష హృదయ లయిరి."

ఈ ఘట్టము భారతకథకు ప్రాణభూతముగ ద్యూతాదియందు నిక్షిప్తమైనది. కౌరవపాండవులకు తగినంత విరోధమున్నది. ఆ విరోధమున కిది యవధిభూతమైనది. గాంధారికోడండ్రెల్లరు ద్రౌపదిని చూచి యోర్వలేనితనమును పొందిరి. ఆమెయొక్క లావణ్యమునకు చుప్పనాతితనము పడిరి. లావణ్యమనగా సౌందర్యము గాదు. శరీరకాంతి. ఆవిడశరీరకాంతికి వారు మాత్సర్యపడిరి. ఈ శరీరకాంతి కొంత సహజమైనను నెక్కువభాగము పోషణచేతను, భోగము లనుభవించుటచేతను వచ్చెడిది. ఆ మేలావణ్యము పాండవుల సంపత్సమృద్ధిని చెప్పుచున్నది. ఆమెయందు పాండవులకు గల ప్రేమను చెప్పుచున్నది. ఆమెభోగపరాయ

ణత్వమును చెప్పుచున్నది. అట్టి భోగము మనకు లేదే యని గాంధారికోడండ్రు మాత్సర్యపడిరి. మాత్సర్య పడుటయే కాదు. కోపించిరి. అమర్షశబ్దమునకు కోపమును, మాత్సర్యమును రెండును నర్థములే. మన మే యర్థమును చెప్పుకొన్నను చెప్పుకొనవచ్చును. రెండర్థములను చెప్పుకొనవలయు ననియే నన్నయ్యగారి యూహ. నన్నయ్యగారు శబ్దము లిట్లే వాడును.

మరునాడు తెల్లవారినంతనే ద్యూతారంభము. ఈరీతిగా జరుగబోవు మహాకైతవప్రక్రియారంభము నందు తత్ప్రక్రియాశిఖరభూతమైన ద్రౌపది నిట్లు వర్ణించి ద్యూతావసానమంతయు నామెకు జరిగిన యవమానము, ఆమె ప్రతిభ, ఆమెధర్మబుద్ధి, సర్వముగా పర్యవసించిన కథను వ్రాయుట యిది మహాశిల్పము.

ఈకథాపర్యవసానము—

తరళ—

"తరుణి ద్రౌపది యిట్లు పాండవధార్తరాష్ట్రులకైన భీ
కరపరస్పరకోపవేగము క్రన్నబాచి విపత్తిసా
గరనిమగ్నుల నుద్ధరించె బ్రకాశకీర్తుల ధీరులన్
పురుషసింహములన్ నిజేశుల పూని తద్దయు బ్రీతితోన్."

ఈ రెండుపద్యములు నన్నయ్యగారు ద్యూతాద్యవసానముల నిక్షేపించి ద్యూతము దేని హేతువున విపరీతమైన పరిణామమును పొందెనో, యాపరిణామము దేనివలన తాత్కాలికోపశాంతి పొందెనో యా ద్రౌపదీదేవిని మొదల నట్లు చెప్పి చివర నిట్లు చెప్పుట యిది మహాశిల్పము. భవభూతికాళిదాసులకు తాదృశులకుదప్ప తక్కినవారికి తెలిసినది కాదు. చేసినది కాదు. ఇది యొక మహాద్భుతము.

ఇందులో మరియొక చమత్కారము. ద్రుపదరాజనందన గాంధారికి మ్రొక్కినపుడు గాంధారికోడండ్రెల్లరు చూచిరి. ఇది పాండవులు ధృతరాష్ట్రాదులకు మ్రొక్కిన స్థలము గాదు. స్త్రీజను లుండెడు నంతఃపురము. అందుచేత ద్రౌపది పెద్దయత్తగారి దర్శనము చేయుటకు భర్తలను వదలిపెట్టి తా నంతఃపురమునకు వెళ్లినదని స్ఫూర్తి కలుగుచున్నది. లేనిచో గాంధారి వందమందికోడండ్రు పురుషు లున్న చోటికి రారు.

మరియు 'వారు సామర్షహృదయులైరి' యని చెప్పుటచేత నేమి యర్థ మగుచున్నది? కట్టి ద్రౌపది యొక్క లావణ్యవర్ణనము కథ కనవసరము. ఇది శృంగారరసప్రబంధము గాదు. ఆ వందమంది కౌరవుల భార్యలు నాటిరాత్రి తమ భర్తలతో ద్రౌపదిని గూర్చిన యసూయావాక్యములు చెప్పిరే యుండురు—ఈ మొదలైన దంతయు నూహించుకొనవలయును. తమ భార్యలు చెప్పినదానినిబట్టి కౌరవులలో ప్రతివాడును ద్రౌపదిని చూడవలయు ననియే కోరును. ఆమెకు పరాభవము జరుగుచున్నప్పుడు తమ భార్యల కది సంతోషహేతు వని తూష్ణీంభావమే వహించును. మరునా డట్లే జరిగినది. ఒక్క వికర్ణుడు తప్ప వందమందిలో నెవ్వడును లేచి యిది న్యాయము కా దనడే. ఇందుకు దుర్యోధనునియందు వారికి గల ప్రణయభయములే కాదు, తమ భార్యలు పొందిన మాత్సర్యముకూడ హేతువే. ఇదియంతయు లోకము నందుండు స్వభావము. నన్నయ్యగారు దీని నేమియు చెప్పడు. ఆ పద్య మట్లు వ్రాసి వదలిపెట్టెను. తక్కిన దంతయు పాఠకుని నూహించు కొమ్మని వదలిపెట్టును.

"ఇట్లు పాండవకౌరవు లతిప్రణయమ్మున నద్దివసంబు సలిపి రంత ప్రభాతంబ"—కౌరవపాండవు లనిన సమాసమునందు శ్రావ్యత యెక్కువ యుండును. కాని 'పాండవకౌరవు'లని యున్నది. తరువాత 'నతిప్రణయగౌరవమ్మున'యని యున్నది. ప్రణయ మధికమనుటకు వెనుకనున్న యతిశబ్దము చాలును. గౌరవముక్కరలేదు. కాని రెండును వాడబడెను. ఇది క్రమాలంకారము చెప్పుకొనుటకు ద్వంద్వసమాసము గాదు. అయినను క్రమాలంకారస్ఫూర్తి భాసించును. పాండవులు కౌరవులయందు ప్రణయముతో నున్నారని, కౌరవులు పాండవులయందు గౌరవము చూపించిరని చెప్పికొనవచ్చును.

పాండవులు వచ్చిరి. పెద్దలకు నమస్కరించిరి. ద్రౌపదిని చూచి కౌరవభార్య లసూయబొందిరి. ఈ మాత్రమే పైన చెప్పి క్రిందివచనములో "ఇట్లు పాండవకౌరవు లతిప్రణయగౌరవమ్మున నద్దివసంబు సలిపి" రనుటలో 'ఇట్లు' అన్న శబ్దమున కర్థము లేదు. పైన చెప్పిన మాటలలో వారొకరియం దొకరు చూపించిన ప్రణయగౌరవము లేదుగనుక. మరి యెందు కిట్లు వ్రాయుట? దీనిచేత పాఠకుడే యూహించవలయును.

కౌరవపాండవుల కొకరియం దొకరికి ప్రణయగౌరవములు లేవు. లేనివి వారు నటింతురు. ద్యూతము జరిగి దుష్టఫలము పుట్టువరకు వా రొకరి నొకరు చేసికొను మర్యాదల కవధి లేదు. ఇదియంతయు నబద్ధమైన మర్యాద. హృదయములోనిది కాదు. అందుకని 'యిట్లు' అన్నమాట 'ఇత్థ' 'ఏతి' శబ్దముల యర్థము లేని దైనది.

నన్నయగారు 'ఇట్లు' 'అంత' 'అందు' మొదలైన శబ్దములు చాల విచిత్రముగా వాడును. ఈ శబ్దములు కథలోని రహస్యములు, కథాగమనవైఖరి మొదలైన చిత్రచిత్రములైన యర్థముల నిచ్చుచుండును. 'అంత' యన్న శబ్దమునకు నలోపాఖ్యానములో వ్రాసితిని.

కథాకలితార్థయుక్తి యన్న మాట యీ ఘట్టములో విస్పష్టముగా తెలియును. ఇందు ద్యూతము, ద్రౌపదిని సభకు తోడ్తెచ్చుట, వస్త్రాపహరణము, ధృతరాష్ట్రుడు మరల పాండవుల రాజ్యము పాండవుల కిచ్చివేయుట- ఈసంగతులు జరిగెను. ద్యూతము జరిగిన ప్రదేశము ధృతరాష్ట్రుడు క్రొత్తగా నిర్మించిన సభాభవనము. ఆ సభాభవన మెటువంటిది? దాని నిర్మాణవైఖరి యెట్టిది? ఈకథ చెప్పకొనిపోవుచుండగా నీసంగతి తేలవలయును. ఇందు జరిగినట్లు చెప్పబడిన కథయంతయు నొకదినమున జరిగెనా కొన్నిదినములు జరిగిన నీసంగతి తెలియవలయును. ద్రౌపదికి వరము లిచ్చిన దెప్పుడు? మరల ధృతరాష్ట్రుడు ధర్మరాజునకు నింద్రప్రస్థరాజ్య మిచ్చిన సమయ మెట్టిది? ఓడిపోయినతర్వాత మరల తమకు రాజ్యము వచ్చువరకు ధర్మరాజాదు లేమి చేయుచున్నారు? ఇట్టి యనేకప్రశ్నములు పుట్టును. వీని యన్నింటికి నన్నయ్యగారి రచనలో సమాధానము లున్నవి.

"ఆ ధృతరాష్ట్రి చేసిన య
నర్ఘ్యమణిప్రకరానుబద్ధశో
భాద్యుతి నొప్పుచున్న సభ
దుర్యోధను డర్థి జూపగా."

ధర్మరాజు మెచ్చెను. దుర్యోధను డర్థి జూపించెను. అర్థి=కోరికతో. మరి కొంతసేపటికి ధర్మరాజును శకుని జూదములో నోడించును. ధర్మరాజుసంపద యంతయు తనకే వచ్చును. ఆ ధర్మరాజునకు తన సభ చూపించుటలో దుర్యోధనున కంత కోరిక యెందులకు? ధర్మరాజు మెచ్చుకొనవలయుననియేకదా? ఆ ధర్మరాజు మెచ్చుకొనిన నేమి, మెచ్చుకొనకపోయిన నేమి? ఇది యంతయు నటన యందమా? నటన కాదు. ఆ ధర్మరాజన్నచో నెంతయో గౌరవము. అతని పట్టుదల యంతయు రాజ్యము పాండవుల కీయకూడదనిమాత్రమే. కోప మున్నచో భీమునిమీద నున్నది. తక్కినవారిమీద లేనేలేదు. తక్కినవారన్నచో గౌరవమే లేదు. ధర్మరాజన్నచో నతనికి మిక్కిలి గౌరవము. పరాక్రమవిషయమునందు గాదు. ధర్మరా జశత్రుడని పాండవులు హస్తినకు వచ్చిన క్రొత్తలోనే నిర్ణయించెను.

"ఉపాంశువధ జేసి మగధ్యము మదోద్ధతుం జంపి ని
స్సపత్నముగ ధర్మనందను నశత్రు బంధించి"

మదోద్ధతుడు భీముడు వానిని చంపవలయును. ధర్మరా జశత్రుడు; అతనిని బంధింపవలయును. పరాక్రమవిషయమున ధర్మజు డశక్తుడైనను అతని పాండిత్యధర్మపరిజ్ఞానాదిముఖ్యవిషయములు లోకారాధ్యములు. వారిది సమిష్టికుటుంబము. అతడు తన కంటె పెద్దవాడు. మయసభయొక్క సౌందర్యము తెలిసినవాడు. అతడు మెచ్చినగాని తన సభ యుత్తమమైనది గాదు. అందుచేత నతడు మెచ్చవలయు నన్న కోరికతో దుర్యోధనుడు తన సభ యంతయు నతనికి చూపించెను. ధర్మరాజు మెచ్చుకొనెను. దుర్యోధనుడు సంతోషించెను. ధర్మజునకు మాత్సర్యము లేదు. అతని మెప్పుదల నిష్కల్మషముగా నున్నది. ఈకారణముచేతగూడ ధర్మరాజన్నచో దుర్యోధనునకు మిక్కిలి గౌరవము.

దుర్యోధనుడు ధర్మరాజుతో నెప్పుడు మాట్లాడడు. నన్నయ్యగారు వ్రాసిన భాగములో దుర్యోధనుడు ధర్మరాజుతో ద్యూతసమయమునందుతప్ప మరి యెప్పుడును మాటాడలేదు. ఈ ద్యూతసమయమున రెండుసారులే మాటాడెను. మొదటిసారి జూదమాడుద

మని, రెండవసారి తనబదులు తన మామయైన శకుని యాడు నని. ఈ రెండు పద్యములు చూడుడు.

"అనఘ సుహృద్ద్యూతము బిం
కొవరింతము ప్రొద్దుపోకయును నగు."
"అనఘ మామాము నాకై కడంగి
జూద మాడెడి నీతోడ."

మరి యెచ్చటను దుర్యోధనుడు ధర్మరాజుతో మాటాడలేదు. ఈ మాటాడిన రెండుపార్లు ధర్మజుని 'అనఘా' అని సంబోధించెను. మొదటి పద్యములో సంబోధన మీఁదో పద్యరచన యట్లే యుండునని యను కొన్నను రెండవపద్యములోని మొదటి సంబోధనము నన్నయ్యగారు బుద్ధిపూర్వముగా నొక ప్రయోజన మర్థించియే యిట్లు వ్రాసె నని తెలియగలదు. ఇది దుర్యోధనుడు ధర్మరాజునకు చేయు గౌరవము. వారి కుటుంబములోని మర్యాద. దుర్యోధనునకు పాండవుల యం దెంత మాత్సర్య మున్నను సముదాచారము నుల్లం ఘించడు. పైన నతనికి ధర్మరాజునందు మిక్కలి గౌరవము.

ఇట్లు రెండు సంబోధనలచేత నొక విచిత్రమైన నాగరకతయు, సముదాచారమును, కుటుంబమర్యా దయు, దుర్యోధనుని శీలములోని యొక యంశమును రహస్యముగా గుప్తపరచి లో నారసి తెలియదగిన శిల్ప మును నన్నయ్యగారు ప్రదర్శించిరి.

నన్నయ్యగారి యీదృశశిల్పరహస్యములు పెక్కు లున్నవి. తరువాత మరికొన్ని వ్రాసెదను.

ఇంక సభాస్వరూప మెట్లు నిరూపింపబడినదో చూతము. "ఆ యపూర్వసభామణికుట్టిమంబున నందరు సుఖాసీనులై"—ఈ మణికుట్టిమ మెచ్చట నున్నది?

ధర్మరాజు సర్వము నోడిపోయినతర్వాత విదు రుడు ధృతరాష్ట్రునకు రహస్యముగ కొన్ని మాటలు చెప్పెను. ఆ సభలో నీ రహస్యము చెప్పుట కెట్లు వీలు పడెను?

తరువాత ద్రౌపది "సభకుం జనుదెంచి కురు వృద్ధ సమీపంబున నున్నంత" ఈ కురువృద్ధుడు ధృత రాష్ట్రుడా? భీష్ముడా? బాహ్లీకుడా? భీష్ముడై యుండవలయును. తరువాత దుశ్శాసను డామెను లాగ బోవునపుడు "కడు భయంబు నొంది గాంధారి యొద్దకు నరిగె". ఈ గాంధారి యెచ్చట నున్నది?

"నేను రజస్వలను. ముట్టకుండుము. ఏకవస్త్రను నై యున్నదాన మరి గురుబంధుజనాధిష్ఠితంబైన సభకు నెట్లు రానేర్తు ననిన" పైన సభకు వచ్చెనని యున్నది. ఇచ్చట సభ కెట్లు వత్తు నని యున్నది.

ఈ పైవాక్యములను బట్టి యా సభానిర్మాణ మెట్టిదో యోజించుకొనవలయును.

సామాన్యముగా భారతదేశ రాజసభ లెట్లుం డును? ఆ సభానిర్మాణ వైఖరి యెట్టిది? అది తెలిసిన గాని యీ యర్థము గోచరించదు. ధర్మరాజుయొక్క మయసభ వేరు. ధృతరాష్ట్రుడు నిర్మించిన యీ సభా నిర్మాణము వేరు. మయసభలో ద్వారము లున్నవి. గదు లున్నవి. సామాన్య రాజసభవంటిది గాదా మయ సభ. ధృతరాష్ట్రనిర్మితమైన యీసభ యనర్ఘ మణు లతో చేయబడినదైనను నిర్మాణవైఖరి సామాన్యరాజ సభ వంటిది.

ఈ పూర్వరాజసభలయొక్క నిర్మాణపద్ధతి రెండువిధములు. ఒకటి పొడవుగా సావడివలె నిర్మింప బడును. తుదల పెద్ద స్తంభములు, ఆ స్తంభముల యుపరి భాగములు గోళాకృతిగ కలుపుటలు (*Arch*).

రెండవరకము ఈ స్తంభములను గోళాకృతిగ కలుపుటలతో చతురస్రముగ నిర్మించి యొకవైపున వదలివేయుట. ఈ రెండువిధములలో దేనికిని గదులు, తలుపులు నుండవు. కట్టి మెరాబాగా నుండును. మొదటి దానికి చంద్రగిరికోటలోని మహలు దృష్టాంతము. రెండవదానికి మధురలోని తిరుమలనాయకుని యంతః పురము దృష్టాంతము. ఈ తిరుమలనాయకుని యంతః పురము కట్టినసభ. అంతఃపురమని వ్రాయుట ఇంగ్లీషు మాటకు తెలుగుచేసితివి.

ఇట్టి యొక సభను మనస్సులో నూహించు కొన్నచో పైచెప్పిన పరిస్థితులు విశదమగును. రెండు స్తంభములకు నడుముగా నొకొక్క భాగముగా నుండును. సభ చతురస్రముగా నుండినచో నడిమి

విశాలమైన దేశమున ప్రధానులైన సభ్యులందరు కూర్చుందురు.

అచ్చట నీయపూర్వసభామణికుట్టిమము గలదు. కంబముకంబమునడుమ నున్న విభక్త దేశములలో నున్న తాసనములు వేయబడి వానిమీద పెద్దలు రాణులు కూర్చుందురు. అందుచేత నొక రెండు స్తంభముల నడిమిప్రదేశమున నొక యున్న తాసనమున ధృతరాష్ట్రుడుగాని, మరియెవ్వరుగాని కూర్చున్నచో సభ యంతయు వారికి కన్పించదు. సభలోనున్న సర్వప్రదేశములకు వారు కన్పించరు. ఇందుచేతనే విదురుడు ధృతరాష్ట్రునితో రహస్యముగ మాట్లాడుటకు వీలైనది. ద్రౌపది సభకు వచ్చెను. వచ్చెనని యెందరకు తెలియును? వచ్చి యామె కురువృద్ధుని సమీపమందున్నను గాంధారియొద్దనున్నను నెవ్వరికిని కన్పించదు. విశాలముగానున్న నడిమిప్రదేశమునకు వచ్చినప్పుడే ద్రౌపది యందరకు గన్పించును. అప్పటికి రానేరననుటయే గురుబంధుజనాధిష్ఠితంబైన సభకు నెట్లు రానేర్తుననుట.

మరి యీ ద్యూత మెన్నాళ్లు జరిగినది? ఒక్కనాడే జరిగినదా? అన్నది వేరొక ప్రశ్న.

ఆనాటి ప్రభాతంబ ధర్మరాజునకు దుర్యోధనుడు సభ చూపించెను. అంత పెద్ద సభ చూచుటకు, అందలి శిల్పమంతయు పరీక్షించుటకు రెండుమూడు గంటలు తక్కువపట్టను. వారు భోజనముచేసి యచ్చటకు వచ్చిరా? కొంతసేపైనతర్వాత పోయి భోజనము చేసిరా? అనా డంద రుపవాస ముండిరా? ఈ ప్రశ్నలు తేలవు.

ధర్మరాజు తన సర్వసంపదయు నోటువడుటకైన నొకదినము నిస్సందేహముగ పట్టును. ద్రౌపది కొరకు కబురంపించుటకు, నామె ప్రశ్నలకు, నామె వచ్చుటకు, నామె వస్త్రములు సర్వతోపమానమగు వరకు విప్పుటకు నెంతకాలమైన పట్టును. ఇది యొకనాడు జరిగిన వ్యవహారము గాదు. రెండు మూన్నాళ్లు జరిగియుండవలయును.

విదురుడు ధృతరాష్ట్రునితో రహస్యముగా చెప్పిన మాటలు నిస్సందేహముగ నొక దివసావసానమును సూచించును. తక్కిన కథ రెండవనాడు జరిగియుండవలయును.

ద్రౌపదీవస్త్రాపహరణము జరిగిపోయినది. భీముని ప్రతిజ్ఞ లైపోయినవి. "భీమసేను నతిరౌద్రాకారంబు సూచి భీష్మవిదురద్రోణాదు లిది కోపంబున కవసరంబు కాదని యాతనిం బ్రశాంతచిత్తుం జేసిరి. అంత—

"ధృతరాష్ట్రునగ్నిహోత్రా
యతనంబున నఱచెనశులనగ్నులు శాంతి
ద్యులు లయ్యె గౌరవస్త్రీ
తతిహృదయము లధికశోకతప్తము లయ్యెన్."

"క్రూరాత్ములై దుష్పద
కీరములను ధార్తరాష్ట్రవీరుల శత్యా
గారముల నెగసె నెంతయు
ఘోరంబుగ గాకఘూకఘూత్కారంబుల్."

"అట్టి మహోత్పాతంబులు
పుట్టిన గృప విదురకలశభూశాంతనవుల్
నెట్టన ధృతరాష్ట్రునకు
బుట్టె నరిష్టమని చెప్పుదమలోనన్."

"అంత నంతయు నెఱింగి గాంధారి విదురుం దోడ్కొని ధృతరాష్ట్రుకడకుం బోయి పాండవపరాజయంబును ద్రౌపదిపరిభవంబును దుర్నిమిత్తోత్పత్తియుం జెప్పిన విని ధృతరాష్ట్రుండు దుర్యోధనుం బిలిచి యిట్లనియె."

ఈ పైని వర్ణింపబడిన పద్యములయందలి సంగతులు జరుగుటకు వారము దినములకు తక్కువ పట్టదు. ఇందులో నొక చమత్కార మున్నది. అగ్నిహోత్రగృహములయందు నక్కలరచెను. కౌరవుల పడకటిండ్లలో కాకులు గ్రుడ్లగూబలు కూసెను. ఆ నక్కలు పడకటిండ్లయం దేల కరవలేదు? అగ్నిహోత్రగృహములు రాజసౌధములకు దూరముండు. ఊరున కది యొక కొస. రాజసౌధములే గ్రామమునకు చివర నుండును. అగ్నిహోత్రగృహములు వాని వెనుక నుండును. అగ్నిహోత్రగృహముల నంటుకొని పొలాలు, నడవులు వ్యాపించియుండును. అందుచే నక్కలు

అగ్నిహోత్రగృహములకు రాగలవు. పడకటింట్ల వరకు రాలేవు.

“కౌరవ స్త్రీ తతి హృదయము లధిక శోక తప్తము లయ్యెన్” కౌరవుల భార్యల హృదయములు గగ్గో లయ్యెను. వీ రందరు ద్రౌపదిలావణ్యము చూచి సామర్షలైనవారు. ద్రౌపది కింత యవమానము జరుగునని వా రనుకొనలేదు. ఈ యవమానము కొంప లంటించున ట్లున్నది. ఈ దుర్ద్యూత మనుకొనని మేర దాటి పోయినది. వారు ద్రౌపదిని చూచి యెంత యసూయ పడినను నిండు సభలో ద్రౌపది యిట్లు పరాభవింప బడుటనుగూర్చి వా రూహించి యుండరు. ఇంత జరిగిన తర్వాత నెవరి మనసులును నిలుకడ బొంది యుండవు. వారి హృదయము లధికశోకతప్తము లయ్యెను. “అయ్యో! మన మింత యనుకొనలేదే! ఊరకే మన భర్తలతో ద్రౌపదిని గూర్చి మన యసూయ వెల్లడించితిమి. ఇప్పు డింతపని జరిగినది. ఈ ద్రౌపదీ దేవి యవమానమునకు మనమే హేతువులము.” అని వారు దుఃఖమును పొందిరి. “శోక” శబ్దములోని స్వారస్య మిది.

ఇట్లనంతములైన మహార్థములు నన్నయ్యగా రొక్క శబ్దములో చెప్పి వదలి పెట్టును.

‘అంత నంతయు నెరింగి గాంధారి’ అనగా కోడళ్లు వచ్చి మొర పెట్టికొనిరి. అగ్నిహోత్రాయతనములయందున్న రక్షకభటులు వచ్చి చెప్పిరి. ఈ వార్తలు వేరితో చెప్పుదురు? దుర్యోధను డన్నచో భయము. వానితో చెప్పరు. ధృతరాష్ట్రు డీ కుత్సిత క్రియ కంతయు మౌనము వహించెను. అతడు గూడ దీని కంగీకరించినట్లే. ఆయనతోడను చెప్పరు. మిగిలినది గాంధారి. పట్టమహిషి. స్త్రీ. సులభముగా నభిగమ్యురాలు. పాండవ పరాజయము, ద్రౌపదిపరిభవము, దుర్నిమిత్తోత్పత్తి వీనియందలి కారణకార్యత్వము మాత్రమే యామె ధృతరాష్ట్రునకు చెప్పెను. ఆ చెప్పుటకు తా నొక్కతెయే పోయినచో భర్త యాదరించదేమో యని విదురుని తోడుతీసికొని వెళ్లెను. వెళ్లి చెప్పగా ధృతరాష్ట్రు డొప్పుకొనెను. కొడుకును పిలిచి యిది న్యాయము కాదని చెప్పెను. “వారివలన నీ దురాగ్రహం బుడుగుమని కొడుకును భంగించి” తరువాత ద్రౌపదిని పిలిపించెను.

కొడుకును భంగించి యనుటలో నున్నది కవితాశక్తి యంతయు. ధృతరాష్ట్రుడు కోడలిని పిలిచి యామె నోదార్చి పాండవుల రాజ్యము పాండవుల కిచ్చివేయవలయునని యూహించెను. ఈ సంగతి కొడుకుతో చెప్పలేదు. చెప్పినచో నత డొప్పుడే వలదను నేమో? ఆ కొడుకును చీవాట్లు పెట్టిన వైఖరి వేరు. ద్రౌపది పరమపతివ్రత, తపస్విని, అయోనిజ. ఆవిడ ప్రకృతి మానవభామిని కాదు. ‘నీ మూలమున పాండవులు మిక్కిలి దుఃఖపడుచున్నారు.’ ఇ యనిన మాటలు. దుర్యోధనునిలోనున్న మంచితనమును, జాలిని ప్రేరేపించు మాటలు. పాండవుల కింత చేసితిమి కదా! రాజ్యము మనదే కదా! యింక తండ్రి చేసినచో పాండవులు దాసులుగా నుండకుండ చేయును. పేరునకే గాని వారిచే నిప్పుడును దాస్యము చేయించుకొనలేను అని దుర్యోధను డూరకుండెను. ధృతరాష్ట్రునకు తాను చేయబోవు పనికి కొడు కడ్డము రాకుండ వాని తీవ్రోద్వేగమును మళ్లించుటయే యీ భంగించుట కర్థము. ధృతరాష్ట్రు డంత నీతిమంతుడు. కొడుకుపగ తీరినది. ఇంక బంధువులను సంతోషపెట్టవలయు నని యతని యూహ.

ఇన్నాళ్లు పాండవు లెచ్చట నున్నారు? ఏమి చేయుచున్నారు? వారి స్థితి యెట్లున్నది? ఈ సంగతి యేమియు తెలియదు. ఇంక నీ ఘట్టములో ననేకములైన చమత్కారము లున్నవి. వాని నింకొక వ్యాసములో వ్రాసెదను.

---

# వ్యుత్పత్తివాదము

శ్రీ శివశంకరస్వామి

పూర్వము అవ్యుత్పత్తివాదులు ఇరు తెగల వారుండిరి. అందు మొదటి తెగవారు ఇట్లనిరి: "పాచకుడు వంట చేయక నిద్రించుచున్నను అతనిని పాచకు డందురు. పాచక శబ్దమునకు ప్రకృతి ప్రత్యయ లభ్య మైన అర్థ లక్షణమున అతివ్యాప్తిదోషము పట్టినది. కావున కృ త్ప్రత్యయాంత పాచకాది శబ్దములు కూడ ఉణాది ప్రత్యయాంత శబ్దములవలె రూఢములు". వృద్ధ కాతంత్ర గణము వారు ఈ సంప్రదాయములో చేరి యుండ వచ్చును. "వృక్షాదివ దమీ రూఢాః కృతినా న కృతాః కృతః" అని కాతంత్ర వృత్తికారుడగు దుర్గసింహుడు సంప్రదాయధారాకల్పన చేసి శర్వవర్మ సంబంధమున వ్రాసె ననిపించును. కావున వీరి సిద్ధాంతము అవ్యుత్పత్తివాద చరమావధి.

దీనికి ప్రత్యుక్తి వ్యుత్పత్తివాదులలో శాకటాయన మతావలంబు లిట్లు చెప్పుదురు: "నిద్రలో నున్న వ్యక్తియందు పాకయోగ్యత యుండుటచే అతనిని పాచకు డనవచ్చును. కావున పాచకశబ్దమునకు వ్యుత్పత్తిలభ్య మైన అర్థ లక్షణమున అతివ్యాప్తి దోషము నేమాత్రము కల్పింప గూడదు." నవీన కాతంత్ర గణమువా రీవాదము ననుసరించినారు. అందుచే త్రిలోచనుని పంజియం దిట్లున్నది: "సత్యం యదా క్రియా మసౌ కృతవాన్ తదా కర్తేతి, అధునా ఽపి తదర్థస్య ప్రతివిజ్ఞాన మిత్యదోషః. తథా కరిష్య న్నపి క్రియాయాః కర్తైవ తథోపచారాత్. అథవా భూత భవిష్య త్క్రియాసు యోగ్యతా మధికృత్య తథోచ్యతే, యథా—లోకేఽపచ న్నపి సూపకారః పచనయోగ్యతయా పాచక ఇత్యుచ్యతే" (చ ౨౨౦) దీనిపై వ్యాఖ్యలో సుషేణవిద్యాభూషణుడు, "కృతో యోగ్యతాయాం శక్తి రితి పక్ష మవలం బ్యాహ— అథ వేతి" అన్నాడు.

ద్వితీయ సంప్రదాయములో రెండు తెగల వారున్నారు. అం దొకరు బహు ప్రాచీనులు, రెండవ వారు నాతిప్రాచీనులు. అతి ప్రాచీనులలో గార్గ్య ముని యౌగిక మని, రూఢ మని శబ్దమునకు రెండు విభాగములు కల్పన చేసినాడు. తన్మతమున యోగరూఢ, యౌగికరూఢ శబ్దములు రూఢములు కాని సాంకేతికములు గాని యగును. అందు ఉణాది వ్యవస్థయు, ఊహ ప్రక్రియయు అశాస్త్రీయము లగుటయే హేతువు. కాని నాతి ప్రాచీనుల సంప్రదాయమున నిరుక్తము, వ్యాకరణము అను వేదాంగద్వయమునకు విరోధమును పరిహరించు నభిప్రాయముతో ఉణాది నిష్పన్న శబ్దములకు గాని ఊహ్యశబ్దములకు గాని అశాస్త్రీయత్వమును వారు గార్గ్యునివలె సంపూర్ణముగా నంగీకరింప లేదు. అందుచేతనే వ్యాఘ్రభూతి విరచిత శ్లోక వార్తికమున "నైగమరూఢిభవం హి సుసాధు"అని వినబడుచున్నది.

"నామ చ ధాతుజ మాహ నిరుక్తే
వ్యాకరణే శకటస్య చ తోకమ్
య న్న పదార్థ విశేష సముత్థం
ప్రత్యయతః ప్రకృతే శ్చ త దూహ్యమ్"—

దీనిపై వ్యాఖ్యలో పతంజలి యిట్లన్నాడు: "నైగమా శ్చ రూఢిభవా శ్చౌణాదికాః సుసాధవః కథం స్యుః? నామ చ ధాతుజ మాహ నిరుక్తే. నామ ఖల్వపి ధాతుజ మే వాహు ర్నైరుక్తాః, వ్యాకరణే శకటస్య చ తోకమ్.* వైయాకరణానాం చ శాకటాయన ఆహ-

*తోక శబ్దమునకు సాధారణార్థము పుత్రుడు లేక అపత్యము. ఇచ్చట యువాపత్యము గాని గోత్రాపత్యము గాని గ్రాహ్యము. శకటుని పుత్రుడు శాకటి; శాకటాయనుడు కాడు.

ధాతుజం నా మేతి. అథ యస్య విశేషపదార్థో న సముత్థితః కథం తత్ర భవితవ్యమ్? యన్న విశేష పదార్థ సముత్థం ప్రత్యయతః ప్రకృతే శ్చ త దూహ్యమ్. ప్రకృతిం దృష్ట్వా ప్రత్యయ ఊహితవ్యః, ప్రత్యయం చ దృష్ట్వా ప్రకృతి రూహితవ్యా"(మ. భా. 3-3-౧) వ్యాఘ్రభూతి మతమున నిశ్చయముగా ఊహను చేయ వచ్చును. ఊహింప వచ్చును కదా యని గావీ, గోణీ, గోతా, గోపోతలికా ప్రభృతి అపశబ్దములను ఊహ చేయ వచ్చునా? ఇట్టి ప్రశ్నల నాశంకించి పతంజలి యిట్లు పలికినాడు:—

"సంజ్ఞాసు ధాతురూపాణి ప్రత్యయా శ్చ తతః పరే. కార్యా ద్విద్యా దనూబన్ధ మేతచ్ఛాస్త్ర ముణాదిషు....సంజ్ఞాసు, అర్థాత్ సాధు శ్వే నాభిమతాసు సంజ్ఞాసు. "యే శబ్దాః సాధుత్వేన ప్రసిద్ధాః తేషు సంజ్ఞా శబ్దేషు ప్రకృతి ప్రత్యయ కల్పనయా సూహః కర్తవ్యో నాన్యత్ర. తత్ర ధాతు రూపాణి కల్పయి తవ్యాని; ప్రత్యయా శ్చ తతః పరే కల్పయితవ్యా ఇతి శేషః. కార్యా ద్గుణాభావాదికాత్ విద్యాత్ జానీయా దనూబంధం కకారాదికమ్. ఏత దనంత రోక్తం శాస్త్ర ముణాదిషు. శాస్త్రోపనిబంధనత్వాత్ శాస్త్రవిషయత్వాత్ వా శాస్త్ర మిత్యుక్తమ్" అని శ్లోక నిష్కర్షము.

వ్యుత్పత్తి, అవ్యుత్పత్తి వాదముల వారి నడుమ ఇంత వాద ప్రతివాదము లేల యని కొందర నవచ్చును. పురాకల్పమున శబ్దపారాయణమున 'బ్రహ్మేదం శబ్ద నిర్మాణమ్...' ఇత్యాది న్యాయానుసారముగా ప్రతి పద పాఠ క్రమమున సమస్తనామములకు ధాతుయో నిత్వ ముపదిష్టమయ్యెనని తోచును. కాలక్రమమున ధారణాశక్తి తగ్గుటచే సామాన్య విశేష లక్షణాన్విత సూత్రాత్మక వ్యాకరణ ముదయము కాగా, ప్రాచీను లతో పోల్చికొని తత్కాలికు లిట్లనుచుండిరి.

"ఋషయో వ్యపదేశస్య నాన్తం యాన్తి పృథక్ త్వశః లక్షణేన తు సిద్ధానా మన్తం యాన్తి విపశ్చితః"

సూత్రాత్మక నవీనగ్రంథమున కృదధికారమున ప్రాచీన శబ్ద పారాయణములో ననేక శబ్దములు చాలనీ న్యాయమున గృహీతము లయ్యెను బహు శబ్దములు సూత్రారూఢములు కాకపోవుటచే సూత్రకారులు విధి లేక వానిని విడిగా విడిచిరి; అట్టి శబ్దముల కన్నిటికిని వ్యుత్పత్తి చూపుటకై విడివిడిగా అపవాద సూత్రములను రచించినచో గ్రంథము పెరిగిపోవు నని, వానిని రూఢ సాంకేతికములని కాని, అవ్యుత్పన్న ప్రాతిపదికము లని కాని నిర్దేశించిరి. శాకటాయనునికి వలె ప్రాచీన మతావలంబుల కిది సహ్యము కాలేదు. "సర్వాణ్యా ఖ్యాతజాని నామాని" అని వారు ప్రతివాదపూర్వక ముగా వక్కాణించిరి. నవీన సంప్రదాయమువారు గార్గ్యునివలె ఈ విషయమును తొలుత నంగీకరింప లేదు. క్రమముగా వీరిలోగూడ నిరుక్త వ్యాకరణము లను ఏకీభూతము చేయు నుద్దేశమువలన ఉణాది సిద్ధి ద్వారా శబ్ద సమూహ సాధుత్వ మభ్యుపగత మయ్యెను.

వ్యుత్పత్తివాదము సత్ప్రకృతిసమ్మతమనియు అవ్యుత్పత్తివాదము సూత్రకారుల బుద్ధిమాత్రోత్ప్రేక్షిత మనియు గ్రహింపవచ్చును.

## వ్యుత్పత్తి పక్షము :
## పాణిన్యాదుల మతామతములు

యాస్కుని తరువాతి వైయాకరణులలో గార్గ్య శాకటాయనుల మతామతములను ఎవ రనుసరించిరో, ఎవరు పరిత్యజించిరో తెలుపుట అప్రాసంగికము కానే రదు. ఇప్పుడు నిలిచియున్న వ్యాకరణ గ్రంథములలో పాణిని అష్టాధ్యాయియే ప్రాచీనతమ మగుటచే తొలుత దానిని పరిశీలింప నగును.

"అర్థవ దధాతు రప్రత్యయః ప్రాతిపదికమ్" అని పాణిని అన్నాడు. దీనిపై వ్యాఖ్యా ప్రసంగములో జ్ఞానేంద్ర సరస్వతి, "అవ్యుత్పత్తి పక్షస్య చేద మేవ జ్ఞాపక మితి ప్రాంచః" అని తత్త్వబోధినిలో వ్రాసి నాడు. మ.మ-శివదత్త శర్మ యిట్లు లిఖించినాడు: "అర్థవ...దితిసూత్రం కృతవతః 'అతః కృ కమి కంస...'(౮-3-౪౬) ఇతి సూత్రే కమేః పృథక్ కంస గ్రహణం చ కుర్వతః పాణినే స్తు అవ్యుత్పత్తి పక్ష ఏ వాభిమతః" (నిరుక్త. ౫౬ పృ.) ఇందలి శేషాంశము నకు తాత్పర్య మిది. శాకటాయనుని "వృతవృ

దిహని కమి కషిభ్యః సః" (౩౬-౨) అను ఔణాదిక సూత్రానుసారముగా కమి ధాతువునుండి కంస శబ్దము నిష్పన్న మయినను, అష్టాధ్యాయిలో "అతః కృ కమి కంస..." (౮-౩-౪౬) సూత్రమున కమి ధాతువుమీద పృథ గ్గ్రహణమున మరల కంస శబ్దము గృహీత మగుటచే, పాణిని కంస శబ్దమునకు ధాతు మూలకత్వమును స్వీకరింపక, దానిని రూఢమని కాని, అవ్యుత్పన్న మని కాని యెంచి ప్రయోగించినా డని తోచును. ఇంతియే కాదు. సూత్రానుసారముగా ప్రాప్త మగు గుణ వృద్ధి కార్యముల నుల్లంఘించి, కంస పరశు శబ్దములనుండి కంసీయ, పరశవ్య రూపములు సాధువు లగుటచే "ప్రత్యయస్య లుక్ శ్లు లుపః" (౧-౧-౬౧) అను సూత్రముపై కాత్యాయనుడు "కంసీయ పరశవ్యయో ర్యశిష్ట నిర్దేశాత్ సిద్ధం" అని వార్తికము చేసినాడు. దీని వ్యాఖ్యావసరమున పతంజలి, "కమేః సః కంసః, పరాక్ శృణా తీతి పరశు రితి. నైష దోషః. ఉణాదయోఽవ్యుత్పన్నాని ప్రాతిపదికాని" అన్నాడు. ఇచ్చట కైయటాచార్యుడు, "అతః కృ కమి కంస కుంభేతి కంస శబ్దస్య భేదే నోపాదానాత్ క్వచి ద్గుణాదయో వ్యుత్పత్తి కార్యం న లభన్త ఇత్యర్థః" అని చెప్పినాడు. ఉణాది ప్రత్యయాంత శబ్దముల రూఢత్వమును గూర్చి కాత్యాయనుని వార్తికము లెన్నో కలవు. "ఉణాదయోఽ వ్యుత్పన్నాని ప్రాతిపదికాని" (౩-౪-౭౭); "తత్రోణాది ప్రతిషేధః" (౭-౧-౨); "ఉణాది ప్రతిషేధ శ్చ" (౮-౨-౭౮) ఇత్యాదులు. "అత్ర పాణిని రవ్యుత్పన్నః" ఇత్యాదిగా పతంజలి పలికినాడు. ఈ స్థితిలో పాణిని అవ్యుత్పన్న పక్షము వా డని ఉపపన్న మగుచున్నది. అందుచేతనే నాగేశ భట్టు ౩-౩-౧ సూత్రముపై శబ్దేందు శేఖరమున, "నైరుక్త వ్యాకరణే శాకటాయన శ్చ సర్వం నామ ధాతుజ మాహేతి. తే వ్యుత్పన్నత్వ వాదినః. ఏవం చ పాణినిః న తత్ వ్యుత్పన్నత్వవా దీతి స్పష్టమేవోక్తమ్" అని చెప్పినాడు.

కాని పాణిని సంపూర్ణముగా అవ్యుత్పన్నవాది యనుట సంగతము కాదు. దీనికి కారణము కూడ కలదు. నానావిధ కృత్ సూత్రములు రచించి, కృత్ప్రత్యయాంత శబ్దములకు ధాతుజత్వ సాధుత్వములను పాణిని చూపినాడు.

ఇటు పాణిని ఔణాదిక శబ్దములను గ్రహించి, గార్గ్యునివలె శాకటాయనుని సంపూర్ణముగా త్యజింపలేదు. అష్టాధ్యాయిలోని "ఉణాదయో బహులమ్" (౩-౩-౧); "భూతేఽపి దృశ్యన్తే" (౩-౩-౨); "భీమాదయోఽపాదానే" (౩-౪-౭౪); "భవిష్యతి గమ్యాదయః" (౩-౩-౩); "తాభ్యా మన్యత్రోణాదయః" (౩-౪-౭౫) ఇత్యాదులు. శాకటాయనుని ఔణాదిక సూత్రములు ఎడనెడ పాణినీయ కృత్సూత్రములయందు తత్త్వతః అనుసృతము లయినవి. హస్త, గర్త, దన్త ప్రభృతి శబ్దములనుగూర్చి శాకటాయనుని "హసిమృగ్రిణ్వామిదమిలూపూధుర్విభ్య స్తన్" (ఉణా. ౩౬౬) సూత్రమును, "తితుత్ర తథ సిసు సరక సేషు" (౭-౨-౯) అనుపాణిని సూత్రమును పోల్చి చూచినచో యథార్థము బోధపడును. అనేక ఔణాదిక ప్రత్యయములుకూడ అష్టాధ్యాయిలోని కృత్సూత్రములలో ప్రవేశించినవి. గండయన్త, మండయన్త, స్పృహయాయ్య, గృహయాయ్య, గదయిత్ను, స్తనయిత్ను, అనామయిత్ను* ప్రభృతి శబ్దము లిందులకు ప్రమాణము. శాకటాయనుని "త్రా భూ వహి వసి భాసి సాధి గడి మడి......" "ప్రు దక్షి స్పృహి గృహిభ్య ఆయ్యః" "స్తని హృషి ముషి గది మదిభ్యో ణేరిత్నుచ్" ప్రభృతి ఔణాదిక సూత్రములనుండియే అష్టాధ్యాయిలోని "అయామన్తాల్వాయ్యేత్న్విష్ణుషు" (౬-౪-౫౫) ప్రభృతి సూత్రములందు పాణిని ఝచ్ (అన్త), ఆయ్య, ఇత్ను ప్రభృతి ప్రత్యయములను గ్రహించినాడు. ఇది యంతయు జూచినచో ఆయన వ్యుత్పత్తి పక్షము కేవలము స్థగితము కానేరదు. కాని నాగేశభట్టు ౩-౩-౧ సూత్రముపై "...భూతే ఇతి (౩-౨-౮౪) సూత్రస్థం భాష్యం వ్యుత్పత్తి వాది వ్యాకరణాంతరే ...

---

*అనామయిత్ను శబ్దము ఋగ్వేదములో కలదు— "హస్తాభ్యాం దశ శాఖాభ్యాం జిహ్వా వాచః పురోగవీ అనామయిత్నుభ్యాంత్వా తాభ్యాంత్వోపస్పృశామసి" (౮-౭-౨౫-౭; ఋక ౧౦-౧౩౭-౭) అని ఆమ్నాతము.

రీత్య. అవ్యుత్పన్నవాది పాణినిమతే తు న తదితి బోధ్యమ్" (౫౦౭—౯ పు) అని చెప్పినాడు. అయినను, ఔణాదిక శబ్దముల వ్యుత్పన్నత్వమును గ్రహించి, శాకటాయనుని పాణిని సంపూర్ణముగా పరిత్యజింపలేదని తోచును. కారణములు—

(౧) అష్టాధ్యాయిలోని 'ఉణాదయో బహులమ్' అను సూత్రముపై పాణినిపాశ్చాత్యుడు వ్యాఘ్రభూతి ఇట్లు వార్తికము చేసినాడు:

"బాహులకం ప్రకృతేస్తను దృష్టేః
ప్రాయ సముచ్చయనా దపి తేషామ్
కార్య సశేష విధేశ్చ త దుక్తం
నైగమరూఢి భవం హి సుసాధు
నామ చ ధాతుజ మాహ నిరుక్తే
వ్యాకరణే శకటస్య చ తోకమ్
యన్న పదార్థ విశేష సముత్థం
ప్రత్యయతః ప్రకృతే శ్చ త దూహ్యమ్."

ఊహన ప్రక్రియను జూపుటకై పతంజలి యిట్లన్నాడు:

"సంజ్ఞాసు ధాతు రూపాణి ప్రత్యయా శ్చ తతః పరే
కార్యాద్ విద్యాదనూబంధ మేతచ్ఛాస్త్ర ముణాదిషు."
(మహా భా. ౩-౩-౧)

వ్యుత్పత్తి పక్షము పాణినికి కేవల మభిమతము కాకపోయినచో, గార్గ్యునకు వలె ఉణాది ప్రకరణ-అశాస్త్రీయత్వమే అభిమత మయినచో, ఈ సూత్రము గాని, సంప్రదాయవేత్తల సకల-అవాంతర కథలు గాని యెందులకో ?

(౨) అష్టాధ్యాయిలోని "భూతేఽపిదృశ్యన్తే" (౩-౩-౨) అను సూత్రము ఉణాది సంక్రాంతము. కాశికలో జయాదిత్యుడు "భూతే కాల ఉణాదయః ప్రత్యయా దృశ్యన్తే" అన్నాడు. కొందరు కొందరు ఉణాది శాస్త్ర మభ్యుపగతము కాలే దనియు, పాణిని 'భూతే కాలే హ్యుణాదయః ప్రత్యయా దృశ్యన్తే న చోచ్యన్తే' అని చెప్పుటయే కారణ మనియు పలుకుచున్నారు. మంచిది. ఉణాది ప్రకరణ మశాస్త్రీయ మయినచో తత్ప్రత్యయములను జూపుటవలన నేమి ప్రయోజనము? గాపీ, గోపీ, గోతా ప్రభృతిఅపశబ్దముల వ్యుత్పత్తి పరీక్షకై యెవరును యత్నింపలేదు.

(౩) అష్టాధ్యాయిలో "భవిష్యతి గమ్యాదయః" (౩-౩-౩) అను సూత్రమునకు భవిష్యత్కాలమున గమ్యాది శబ్దములు సాధువు లని తాత్పర్యము. ఇదియు ఉణాది ప్రత్యయ విషయక సూత్రము. కలాపములోని 'భవిష్యతి గమ్యాదయః' (కృత్. ౩౧౩) సూత్ర వ్యాఖ్యలో దుర్గసింహుడు "గమీ త్యేవమాదయః శబ్దా ఔణాదికా భవిష్యతి కాలే సాధవో భవన్తి. గమాదిభ్యో భవిష్యత్కాల వృత్తిభ్య ఇన్ స్యా దిత్యర్థః" అని చెప్పినాడు.

(౪) "భీమాదయోఽపాదానే" (౩-౪-౭౪), "తాభ్యామన్యత్రోణాదయః" (౩-౪-౭౫) అను పాణినీయ సూత్రములు ఔణాదిక శబ్ద సాధనకై ఉపదిష్టములు. కాశికలో "భీమాదయః శబ్దాః అపాదానే నిపాత్యన్తే. ఉణాది ప్రత్యయాన్తా ఏతే......'శ్యా ధూ సూభ్యో మక్' (ఉణ్. ౧౫౦), 'భియః షుక్ చ' (౧౪౩) ఇత్యేవమాదయః. తాభ్యామన్యత్రోణాదయ ఇతి పర్యుదాసే ప్రాప్తే నిపాతన మారభ్యతే" అని జయాదిత్యుడు వ్రాసినాడు. ఇవి యన్నియు జూడ పాణిని వ్యుత్పత్తిపక్షతయు ఒక్కమారుగా నిరస్తము కా దనిపించును.

ఉణాది ప్రత్యయాంత శబ్దములను గ్రహించి పాణిని శాకటాయనునకు విరుద్ధముగా నుండనియెడల, భాష్యవార్తికమున "ఉణాదయోఽవ్యుత్పన్నాని ప్రాతిపదికాని" అను పరిభాష మాటిమాటికిని ఏల చెప్పిరో అనుసంధానము చేయవలెను. "ఆయనేయీనీయియః ఫఢఖఛఘాం ప్రత్యయాదీనామ్" (౭-౧-౨) అను సూత్రానుసారముగా ఢ ప్రత్యయ స్థానమునందు ఏయ, ఖ ప్రత్యయస్థానమున ఇన ఆదేశము వచ్చును. కావున "స్త్రీభ్యో ఢక్" (౪-౧-౧౨౦) అను సూత్రానుసారముగా వైనతేయాది శబ్దములు "కులాత్ ఖః" (౪-౧-౧౩౯) అనుసారముగా కులీన శబ్దమును సాధింపవచ్చును. కాని 'శమేః ఖః' (౧౦౭) శంఖః, 'మణో ఢః' మంఢః ప్రభృతి ఔణాదిక పదములను జూచి కాత్యాయనుడు, "తత్రోణాది ప్రతిషేధః"

అన్నాడు. నానావిధ-ఔణాదిక శబ్దముల సాధుత్వమును స్వీకరించిన పిమ్మట మరల నిషేధ మెందులకు? ఇట్టి ప్రశ్నల నాశంకించియే ఆయన మరల 'ప్రాతిపదిక విజ్ఞానా చ్చ పాణినేః సిద్ధమ్' అన్నాడు. అనగా పాణిని యే భావముతో నేయే ప్రాతిపదికకు ప్రకృతి ప్రత్యయ విభాగ శూన్యత గ్రహించెనో తదనుసారముగా నది సిద్ధ మయ్యెను. కావున నీ సకల శబ్దములను గూర్చి 'ఉణాద్యంత త దాదీని అవ్యుత్పన్నాని ప్రకృతి ప్రత్యయ విభాగ శూన్యాని' అని చెప్పవలయును. దీనివలన "ఉణాద్యంత తదాదిత్వేన శాకటాయనాభిప్రేతాని వస్తుతస్తు పాణినిమతే ప్రకృతి ప్రత్యయ విభాగ శూన్యాని" అని సూచిత మగుచున్నది. అనగా "ఉణాద్యంతాని ప్రకృతి ప్రత్యయ విభాగ ప్రయోజ్య పాణిని సూత్ర ప్రవృ త్త్యనర్హాణి" కాబట్టి కౌమార గణమువలె పాణిని గూడ "ఔణాదికా హి ద్వివిధా వ్యుత్పన్నా అవ్యుత్పన్నా శ్చ" (అ. ౧౨౫) అనవలసి యుండును. పాణిని మతమున భస్మ, గమి, భీమ, కృషి, వాయు ప్రభృతి ఔణాదిక శబ్దములు వ్యుత్పన్నములు; శంఖ, షండ, శండ, శంక, శంట, పాయు, మాయు, జాయు ప్రభృతి ఔణాదిక శబ్దములు అవ్యుత్పన్నములు. కావున స్వకృత గ్రంథసూత్రానురోధముచే పాణిని అవ్యుత్పన్నవాది యగుట సత్యము; కాని శాకటాయనీయ వ్యాకరణ మందలి ఉణాది ప్రక్రియ అశాస్త్రీయ మని ఘోషించు నుద్దేశ మాయనకు లేదు. ఇందులకే పేరుసూరి తన ఔణాదిక పదార్ణవ ప్రథమ పాదమున నిట్లు చెప్పినాడు:

"అ ప్యశిష్టాః సూత్ర కృతా
సంజ్ఞాః సాధయితుం క్షమాః,
సంజ్ఞాయాం వర్తమానే చ
కాలేఽర్థే స్యు రుణాదయః.

క్వచి ద్వ్యాఖ్యాతేఽపి దృశ్యన్తే
గ వ్యాది స్తు భవిష్యతి,
దాశ గోఘ్నౌ సంప్రదానే
కారకే వినిపాతితౌ.

భీమాదయో ప్యపాదానే
త దన్యార్థా ఉణాదయః,
అసంజ్ఞాయా మపి భవ
న్త్యేతే బాహులకాత్ క్వచిత్."

శాకటాయన మహర్షి అసాధారణ శాబ్దికు డనుటకు సందేహము లేదు. ప్రాచీన కాలమున పాణిని సంప్రదాయమందలి ఆచార్యులే "అనుశాకటాయనం వైయాకరణాః" (కాశికా ౧-౪-౮౬) అన్నారు. అయినను, పాణిని ఔణాదిక శబ్ద సాధుత్వమును స్వీకరించుట శాకటాయనునియెడల ఆదరమువలన కాదు. నిరుక్త వ్యాకరణములను వేదాంగముల వైరుద్ధ్యమును పరిహరించుటయే ఆయన ముఖ్యోద్దేశము.

శర్వవర్మ అవ్యుత్పత్తి పక్ష వాది యని కాతంత్ర వృత్తి కారుడు స్పష్టముగా చెప్పినాడు; పాచకాది కృత్ప్రత్యయాంత శబ్దములు కూడ అశ్వ గో వృక్షాదులవలె రూఢములు కాని సాంకేతికములని శార్వవర్మిక కాతంత్రమున కృ త్సూత్రములు చెప్ప లే దన్నాడు. సకలావస్థలలో ప్రకృతి ప్రత్యయ లభ్యార్థముతోపాటు సముదాయార్థ-విశిష్ట భావ హేతువు పాచకాది శబ్దముల వ్యుత్పత్తి గత-అర్థ లక్షణమున అతివ్యాప్తి పొందుటచే వానికి ధాతుజత్వము కల్పించుటకు వలను పడదు. కావున పాచకాది కృ త్ప్రత్యయాంత శబ్దములు కూడ ఉణాది ప్రత్యయాంత వృక్షాది శబ్దముల వలెనే రూఢములు. ఇది వస్తుతః శర్వవర్మాచార్యుని సిద్ధాంత మగునో కాదో చింతనీయము. దుర్గసింహు డే మన్నను, ఆయన అంతతః గార్గ్యుని వలె అవ్యుత్పన్న వాదియు ననవచ్చును. గార్గ్య ముని కృ త్ప్రత్యయాంత శబ్దములకు ధాతుజత్వమును కాని, వ్యుత్పన్నతను గాని అంగీకరింపక పోలేదు. కాతంత్రమున అనేక కృ త్సూత్రముల ప్రయోగము ఉపలబ్ధ మగుచున్నది. "ధాతో స్తద్వశబ్దః స్యాత్" (నామ౬౭); "ధాతో ర్వా తుమన్తా దిచ్ఛతి నైక కర్తృకాత్" (అ.౩౭); "తుమర్థా చ్చ భావవాచినః" (చ.౨౩౪); "కర్తృ కర్మణోః కృతి నిత్యమ్" (చ.౨౪౩); "న నిష్ఠాదిషు"

(చ. ౨౪౪) ఇత్యాదులు కానవచ్చును. కావున కృత్ప్రత్యయాంత పాచకాది శబ్దముల రూఢత్వావధారణ శర్వవర్మ యుద్దేశము కాదు. కాని శీఘ్రకాలములో శాతవాహనునకు కొంత వ్యాకరణము బోధింప నభిప్రాయముతో ఆయన కృత్ప్రకరణ త్యాగము చేయుట విచిత్రము కాదు. అధ్యాపన సమయమున శబ్దముల అభిధాన లక్షణమును జూపి, శిష్యుని ధీవికాసమునకై కృత్సంబంధోపదేశ ప్రదానముతో ఆయన విరమింప లేదు. కాని యిప్పుడు కలాప శేషమున దుర్గవృత్తి సమేతముగా పంచపాదాత్మక— ఉణాదిప్రకరణము కానవచ్చుచున్నది. తాంజోర ప్రవాదానుసారముగా వృత్తికారుడు దుర్గసింహుడే ఈ సూత్రము లన్నిటికిని కర్త. పంచమపాదారంభమున—

"శబ్దాత్మికా యా త్రిజగద్ బిభర్తి
స్ఫురద్వ్యచిత్రార్థ సుధాం ప్రవర్తీ
యా బుద్ధి రీడ్యా హృదయే సదైవ
ముఖే చ సా మే వశ మస్తు నిత్యమ్"

అని ఆయన చెప్పి, షష్ఠపాదాంతమునం దిట్లు లిఖించినాడు:

"శబ్దానా మానంత్యాత్
వ్యుత్పత్తిః దృశ్యతే యేషామ్,
తేషాం విజ్ఞైః కార్యా
మృగ్యా ధాతో స్తతః ప్రత్యయాంతాత్." *

ఇదియే కాక ప్రకరణారంభమున ప్రణామ శ్లోకములోని 'ఉణాదయో౽భిధాస్యన్తే' అను దుర్గోక్తి వలన గూడ ప్రవాదము పుట్టి యుండవచ్చును. కాని ఇంద్ర గోమి వ్యాకరణమే యీ సూత్రముల కన్నిటికిని ఆకర మని కొందర న్నారు. ఏ మయినను, శాకటాయనాది ప్రణీత ఔణాదిక సూత్రముల యోగవిభాగము ద్వారా కలాప-ఉణాది సూత్రములు రచింపబడినవి. దుర్గసింహుని దృష్టినిగ్రహించి, ఉపాధ్యాయ సర్వస్వమున సర్వధర ఉపాధ్యాయుడు ఈ సూత్రముల కన్నిటికిని వ్యాఖ్య రచించినాడు. రమానాథ చక్రవర్తి సారనిర్ణయమున ఉపాధ్యాయ సర్వస్వము ననుసరించినాడు.

చాంద్ర సంప్రదాయమున శాకటాయనమత ప్రాబల్యము కానబడును. స్వయముగా చంద్రగోమి చాంద్రవ్యాకరణమునకు పరిశిష్టరూప మగు ఔణాదిక సూత్రపాఠము రచించినాడట. అందు మూడు పాదములు కలవు. అది ప్రాచీన బౌద్ధ వ్యాకరణములలో నొకటి.

జైనుల వ్యాకరణమున విశేష మేమియు లేదు. జైనేంద్ర వ్యాకరణమున దేవనంది పాణిని మునిని, అభినవ శాకటాయనుడు దేవనందిని, హేమచంద్రుడు మలయగిరి అభినవశాకటాయనుని అనుసరించినారు. కాబట్టి వీరి గ్రంథము లన్నియు వస్తుతః పాణినిని అనుసరించినవే. అభినవ శాకటాయనుని శబ్దానుశాసనమున నామముల ధాతుజత్వమును గూర్చి మహర్షి శాకటాయన మతవాదము కానరాదు. అందుచేతనే డాక్టర్ శ్రీపాద కృష్ణ యిట్లు చెప్పినాడు: "*One expects to find in the Unadi sutras at least traces of the ancient Sakatayana and his works, but he is sure to be disappointed in his expectations.*" (*s. s. o. p.* 71).

పురా కల్పమున ఆది వ్యాకరణ సమూహమున ఔణాదిక ప్రక్రియా ప్రమాణ హేతువున శాకటాయనునే భోజదేవుడు అనుసరించినాడు. "అభిదధాత్యర్థం ధాతుః" (ప్రక్రియా, ఉణాది ఖండ, ౧.౬౪) అని ధాతు శబ్ద వ్యుత్పత్తి. ఇందుచేతనే కాబోలు, భోజుడు నామ మాత్రమునకు ధాతుజత్వము స్వీకరించి

* కాతంత్ర-ఉణాది ప్రకరణమున (వంగీయ సంస్కరణమున) పంచ పాదములు మాత్ర మున్నవి. అందు ఆరవపాదము కాని, అన్ని సూత్రములు కాని కనబడవు. ఈ రెండు శ్లోకములు మదరాసు ప్రతిలోనివి. డాక్టర్ టి. ఆర్. చింతామణి ప్రకటించిన 'కాతంత్రోణాది సూత్రాణి, దుర్గసింహ విరచిత వృత్తియుతాని' అను గ్రంథమున ౩౩, ౪౨ పుటలలో ఉక్త శ్లోక ద్వయాంశలు కానవచ్చుచున్నవి.

నాడు. "ఉణాదశా ధూతేఽపి" (౨-౪-౧); "సర్వ ధాతుభ్యో మనిన్" (౨-౪-౨); "భవిష్యతి గమ్యా దయః" (౨-౪-౩) ప్రభృతి ఔణాదిక సూత్రములు తదీయ వ్యాకరణమున గానవచ్చును. ప్రక్రియా సర్వస్వములోని ఉణాది ఖండ మందలి 'వర్ణా నీతి' తరువాత నారాయణ భట్టు—

"ఉక్తేషు ప్రత్యయే ష్వేవ
ప్రకృత్యాధిక్య గోచరాః
భోజోక్తయః పురా ప్రోక్తా
అవశిష్టా నథ బ్రువే"

అను శ్లోకము చెప్పి, ఔణాదిక సూత్రముల కొన్నిటికో వ్యాఖ్య చేసినాడు; "ఇతి భోజోక్తాః" అని సూత్రముల చివర లిఖించినాడు. ఈ సూత్రముల నన్నిటిని భోజుడు స్వయముగా రచించెనో, కాక ప్రాచీన గ్రంథమునుండి గ్రహించెనో నిశ్చయముగా జెప్పుటకు వీలు లేదు.

క్రమదీశ్వరుడు శాకటాయనునే విశేషముగా ననుసరించెను. సంక్షిప్త సార మందలి 'కృచ్ఛేషో ణాది పాదః', 'కృచ్ఛేషో వ్యయ పాదః'—ఈ రెండును దీనికి నిదర్శనములు. ఊహానాది ప్రక్రియాను సారముగా క్రమదీశ్వరుడు అనేక సంజ్ఞలకు వ్యుత్పత్తి చూపినాడు. ఉణాది పాద శేష సూత్రవృత్తిలో, "ఇతి దిఙ్మాత్ర మన్య త్రాపి ప్రకృతి ప్రత్యయాగమ గుణ వృద్ధి హ్రాస్వాదయో యథాసంభవం పరికల్పనీయాః.

తిఙన్తా దితరే శబ్దాః
కృద్భిః సర్వే ప్రసాధితాః
సమాస తద్ధితాభ్యాం చ
వికారా నపి సాధయేత్.
యస్మిన్ దేశే ప్రసిద్ధా యే
ప్రయోక్తవ్యా హి తత్ర తే
అప్రసిద్ధాశ్చ యే శబ్దా
బోధ్యా గ్రంథాంతరా త్తు తే."

(౨౨౨ సూత్ర వృత్తి) అని వ్రాసినాడు. వృత్తి కారుడు క్రమదీశ్వరుడే. జూమర నందివలన ఈ గ్రంథము పరిశోధితము, పరివర్ధితము మాత్ర మయినది.

సారస్వత వ్యాకరణమున వ్యుత్పత్తి పక్షము నెడ విశేషాదరము గోచరింపదు. ఇందలి ఉణాది ప్రక్రియలో అథోణాదయో నిరూప్యన్తే. స దోణా దయః..." అని యున్నది. ప్రకరణ శేషమున నిట్లు కానవచ్చును.

"సంజ్ఞాసు ధాతురూపాణి ప్రత్యయాశ్చ తతః పరే
కార్యాత్ విద్యా దనూబంధ మేతచ్ఛాస్త్ర ముణాదిషు
ఉణాదయోఽపరిమితా యేషు సంఖ్యా న గమ్యతే
ప్రయోగ మనుసృత్యామీ ప్రయోక్తవ్యా స్తత స్తతః."

సిద్ధాంత చంద్రికా కారుడు "స దోణాదయః" అను సూత్రముపై వ్యాఖ్యలో, "సర్వస్మిన్ కాల ఉణాదయః. ఉణాదయోఽపరిమితాః ప్రయోగ మను సృత్య ప్రయోక్తవ్యాః"అని వ్రాసినాడు. దీని టిప్పణిలో "తాని శాకటాయనాది ప్రణీత వ్యాకరణాంత రాత్ సంగృహీతానిసన్తి" (౩౫౩). చక్రధర శర్మ కుమారుడు నవ కిశోర శాస్త్రి పీతద్గ్రంథాంతమున ఉణాది కోశమును చేర్చినాడు.

"చణప్ వాభిజ్ఞ్యే పూర్వ కాలే" (౧౧౯౩) అను సూత్ర వృత్తి భాగములో బోపదేవ గోస్వామి యిట్లన్నాడు:

"కృత్తద్ధిత సమాసానా మభిధానం నియామకమ్
లక్షణం త్వనభిజ్ఞానాం తదభిజ్ఞాన సూచకమ్."

(౧౩౯౯)

కాని దీనికి పూర్వమే ఆయన కృత్సూత్రము లనేకము రచించినాడు. ముగ్ధ బోధము చివర ఉణాది సూత్రపంచపాదములు కానవచ్చును. ఉణాది కోశ కర్త రామశర్మయే వీని నన్నిటిని రచించె నేమో; బోప దేవుడు రచింప లే దేమో. ముగ్ధ బోధములోని "నామ్నశ్చ తిక్" (౧౦౦౪) అను సూత్రమున పాణిని స్మృత మగు "ఉణాదయో బహులమ్" (౩-౩-౧) అను సూత్ర తాత్పర్యము ప్రవిష్ట మయి యుండును. దానినుండి ఆచార్య ప్రవృత్తిని గ్రహించి

రామ శర్మ ఈ ఉణాది సూత్రముల నన్నిటిని రచించి యుండును. ఈ స్థితిలో బోప దేవుడు గార్గ్య నను సరించినవా డనుటకంటె పాణిని ననుసరించె ననుట యుక్తము.

పాణిని వలెనే పద్మ నాభ దత్తుడు కూడ అవ్యుత్పన్న వాది యనవలెను. కాని కొద్దిగా భేదము కలదు. అష్టాధ్యాయిలో ఉణాది విషయక సూత్రములు కొలదిగా గలవు. పద్మనాభుని సుపద్మమున నానాకృత్సూత్రములే కాక, ౧౪౦ ఔణాదిక సూత్రములు కూడ కలవు. "ఉణాదయో బహులమ్" అను నది ఉభయ గ్రంథములలోను ప్రథమ సూత్రము. (అష్టా. ౩-౩-౧; సుపద్మ. ౪-౨-౧). దీని వృత్తి భాగములో పద్మనాభుడు, "ఉణాదయః ప్రత్యయా ధాతో ర్బహులం స్యుః. య దాహుః—ఉణాదయో ఽవ్యుత్పన్నాని ప్రాతిపదికాని" అన్నాడు.

శ్రీ జీవ గోస్వామి పాణిని ననుసరించినాడు. ఆయన హరినామామృత వ్యాకరణములోని కృత్ప్రకరణ మధ్యమున "గమి గామ్యాదయస్తు భవిష్యతి సాధవః" ఇత్యాది ఉణాది విషయక సూత్రము కానబడును.

పురుషోత్తమ విద్యావాగీశుడు కూడ పాణిని ననుసరించినవాడు. ఆయన ప్రయోగ రత్నమాలలో కృద్విన్యాసమున "ఉణాదయ స్స్యుః బహులమ్", "భీమాదయోఽపాదానే స్యుః"—ఇత్యాది ఉణాది సంబంధియ సూత్రము లున్నవి (౩౪౨).

యాస్కుని తరువాత పాణిని మొదలు పురుషోత్తమ విద్యావాగీశునివరకును శాబ్దికులు తమతమ సూత్రానురోధమున గార్గ్య పక్షము నవలంబించినను అల్పముగానో, విస్తరముగానో ఔణాదిక శాస్త్ర సాధుత్వము నంగీకరించుచు శాకటాయమని మర్యాదను పాటించినారు. కావుననే ప్రాచీనులవలెనే నేటికిని "అనుశాకటాయనం వైయాకరణాః" అనవచ్చును.



# అఖండవడి - పదునొకొండు శబ్దవము

○

శ్రీ రావూరి దొరసామిశర్మ

పూర్వస్వరము లోపించి తత్పూర్వహల్లుతో బర స్వరము గదియుట యచ్సంధి యగును. (ఉ. రాజ + అనీక — రాజానీక; చూచుచు + ఉండు — చూచుచుండు) ఇట్టి సంధ్యక్షరములు యతిస్థాన పతితము లయ్యేనేని సంధి విడదీసి పరస్వరమునకే యతి మైత్రి ఘటింపవలయునని పెక్కు లాక్షణికుల మతము. దీనినే స్వరప్రధానవడి యన్నా డప్పకవి.

ఉదా॥ అతుల గుణ ధామ భాను వంశాబ్ధి సోమ. (వంశ + అబ్ధి)

ఆ సభ కేకవస్త్ర యగు + నట్టి సనం గొనివచ్చె నొంచు. (అగు + అట్టి)

పై స్థలములందు సంహితను వివక్షింపక యఖండ శబ్దములుగా భావించి హల్మైత్రి గూర్పరాదని యప్పకవ్యాదుల తాత్పర్యమై భాసిల్లెను. కాని నారాయణ వేదండాదిశబ్దములు గొన్ని వ్యుత్పత్తిచే సంహిత గలవైనను వాడుకలో నఖండములుగా భావింపబడుటచే, నట్టి వానికి గొన్నింటి కుభయ యతి (స్వరవ్యంజనములలో నే దొక్కదానికేని యతి) ఘటించుట కనుజ్ఞ యిచ్చినారు లాక్షణికులు. ఇట్టి వానినే యఖండయతు లనవలయు.

అప్పకవి యుభయయతులక్రింద బండ్రెండు తెఱగులు ప్రవచించెను. అయ్యవి యుప్మ దస్మచ్ఛబ్ద, పరరూప, ప్రాది, సంస్కృతనిత్యసమాస, దేశ్యనిత్య సమాస, నిత్య, రాగమసంధి, విభాగ, నామాఖండ, పంచమీవిభక్తి, కాకుస్వర, ప్లుతయుగ విశ్రామములు. ఇందు గొన్ని ప్రాచీనులగు ననంతాదులు సైతము వక్కాణించి యున్నారు. అప్పకవి యఖండవడిని జెప్పలేదు. అఖండవడిని సమ్మతించినచో సంధిగతాఖిల శబ్దముల కుభయయతిఘటన కనుజ్ఞ యిచ్చినట్లే యగు. అట్లేని యీ యుభయయతి ప్రకరణ మనవసర మగు. ఇట్టి యతివ్యాప్తి నరికట్టుటకే చిన్నకోట పెద్దనాదులు ప్రాది దేశీయాదేశ ప్రభు నిత్యసమాసాది యతులు గొన్ని నిరూపించిరి.

అఖండయతిని అనంతుడు గాని, చిన్నకోట పెద్దన గాని చెప్పలేదు. అప్పకవియో యఖండవడి యగ్రాహ్యమని యనుశాసించినాడు. భీమకవియే ప్రప్రథమమున నఖండవడిని జేర్కొన్నవాడుగా గాన వచ్చెడి-

ఉ॥ మానుగ విశ్రమాక్షర స
మంచితమై స్వర మాదినం దదీ
యానుగుణాక్షరంబ కాని
దైనను జెప్పగ నొప్పు నీ క్రియన్
భానుసమప్రభాసి వృష *
భాధిపు డన్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండవడి
పొల్పగు నాది కవి ప్రణీతమై. (భీమన)

ఆ తరువాత చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహమున,

గీ. "ఒక్క వర్ణంబు స్వర మూద నొకట స్వరము
గలయకుండంగ గూర్తు రఖండయతులు
రామపదపద్మలోల వ-రాళి యవగ
భంజితాసుర సముదాయ యాంజనేయ."

అని యఖండయతికి లక్ష్యలక్షణములు రచించె.

---

* భీమన యీ యఖండయతిపద్యమును నప్పకవి నిత్యసమాస యతుల క్రింద గైకొని యుపసర్గసంధి యతి యని సరిపుచ్చినాడు. అతని మతమున నఖండ యతి నిషిద్ధము గదా?

ముద్దరాజు రామన కవిజనసంజీవనిలోను, కూచిమంచి తిమ్మన సర్వలక్షణ సార సంగ్రహము నను, కస్తూరి రంగకవి ఛందమునందును అఖండయతి చెప్పబడి యున్నది. ఇవి యిట్లుండనిండు. అప్పకవి విషయము పరికింతము.

అప్పకవి దేశ్య నిత్యసమాస యతుల క్రింద విమర్శించిన రీతిని దిలకింపుడు. (తృతీయాశ్వాసము ౨౦౨ పద్యము మొదలు ౨౧౨ వఱకు)

"నన్నయముఖ్య సత్కవి జ
 నంబుల కావ్యములందు లేఖకుల్
గొన్నియు బాఠకాధములు
 గొన్నియు బోకడ బెట్టి తక్కనై
యున్నెడ గాంచి జానపదు
 లోపక దిద్దిన తప్పు త్రోవ లె
ల్లన్నిజ మంచు గైకొనిన
 లక్షణవేత్తలు సమ్మతింతురే.

వ. అది యెట్లనిన సులక్షణసారంబునందు లింగము గుంట తిమ్మన వ్రాసిన యప్రశస్తంబులను లక్ష్యంబులకు వాశ్చర్యంబు నొంది బహుపుస్తకంబులు నిరీక్షించి వాని నెల్లను బ్రక్షిప్తంబులుగా నెఱింగిన వాడనై లక్షణవంతంబులను పురాతనకవిప్రోక్తంబులు వివరించెద.

(౧) ఆది పర్వమునందు—
 నీ వగచిన యూ యర్థము, నూనె మ
 నంబున దలంతు సుందరి యెపుడున్.

(౨) ఉద్యోగ పర్వము—
 సజ్జన నుత మార్గమునను జరియింపంగా,
 నమల మతీ కన్న కొడుకుల ట్లరయ జనుల్.

(3) అనుశాసనికము—
 అతిథి నిను గోరెనేనియు,
 నతిగింకిరి పడక యోల మాస పడక...

(౪) రామాయణము—
 అన్న వు తండ్రి యట్ల విను
 మంతియ కాదటమీద రాజ వే
 మన్న గొఅంత లేదు మణి
 హారము లాదిగ జెక్కు కానుకల్...

(౫) రామాయణము—
 ఓ కపివీరులార సుగుణోదధి నీ
 రఘురాము సర్వ లో
 కైకశరణ్యునిం గొలువ నిప్పుడు
 వచ్చితి నొందు గాదు...

(౬) దేవకీ నందన శతకము—
 చతురంభోధి పరీత భూవలయ
 రాజన్యాలి కోటీర రం
 జిత మాణిక్య విరాజి
 తచ్చరణ రాజీవుండు...

(౭) అరణ్య పర్వము—
 ఉరమున రెండు గన్నులు......
 అశేష సత్వ సం
 హరు డగుచున్న వాని దివి
 జారి గబంధుని గాంచి రచ్చుటన్."

పై పద్యములు లింగముగుంట తిమ్మన యుదాహరించినవి గాని యూత డొసగిన యఖండవడితోడి పాఠము లప్పకవీయమున సవరింపబడినవని తెలియ వలయు. పై పద్యములలో నెల్ల నఖండవడి ఘటిల్లెడి పాఠములు కలవు.

నేడు ప్రచారములో నున్న సులక్షణసారము తప్పులతడక. అందు నాల్గవ పద్యముమాత్ర మఖండవడికి లక్ష్యముగా నిలబడియున్నది. నిక్కమగు సులక్షణసార మెందు గల దనుచున్నారు. అయ్యది ప్రకటన భాగ్య మందలేదు. దానిని నే నెఱుంగను. కాన నా సులక్షణసారమున వీని కేపాఠాంతరము లున్నవో మన మెఱుగము. ముద్దరాజు రామన, కస్తూరి రంగకవి మున్నగువారు పై పద్యములం గొన్నిటి నఖండయతి పాఠములతో నుదహరించి యున్నారు. పై పద్యములకు నే నూచిన యఖండవడి పాఠము దిక్రింద వరుసగా నిచ్చుచున్నాను.

(౧) నూనె మనంబున దలంచు + చుందుదు నెపుడున్.

(౨) మార్గమున జరింపంగా నమ, లమతీ నీ
కొడుకునట్లు + లరయంగ నగున్.

(౩) మతి గింకిరి పడక యోల + మానపడక

(౪) అన్నవు తండ్రియట్ల విను మంతియు కా దట
మీద రాజ వ్యేమన్న గొఅంత లేదుమణి
మండనముఖ్యములైన కానుకల్.

(౫) సర్వలోకైకశరణ్యునిం గొలవగా
నిట వచ్చితి నొండు గాదు

(౬) చతురంభోధి పరీత భూవలయ
రా + జానీక కోటీర

(౭) అశేష సత్త్వ ఘు, స్మరు డగుచున్న వాని
దివి + జారి గబంధునిగాంచి రచ్చటన్.

(అఖండవడిగల భాగము మాత్రము గీత యిడబడినది)

ప్రసిద్ధముగా సహజముగా నఖండవడులతోడి యీ పాఠములను స్వమత విరుద్ధము లగుటచే రూపుమాపి సవరించిన యప్పకవి కట్టకడపట నీ క్రింది పద్య ముదహరించి తద్విషయ మిట్లు వ్రాసినాడు—
ఉద్యోగపర్వమునందు—

చ॥ అని మది నిశ్చయించి తగ
నందఱ బిల్వగ బంచి వారితో
ననిచిన మాట లాడి విన
యంబున బ్రార్థన సేసి మీరు మా
కొనరిన సైన్యముల్ పదునొ +
కొంటికి బ్రాభవ మాచరింప జొ
చ్చిన సకలంబు నొప్ప
నభిషేకము గైకొను డుత్సవంబునన్.

వ. దీని మూడవ పాదంబునందు "పదునొకొంటికి"నని యున్నచోట సంధి గూర్చి స్వరప్రధానవడిగాను సోమయాజులు ప్రయోగించినారు. ఇది తెలియక కొందఱు మూఢులు దేశ్య నిత్యసమాసవడి యని యనుకొందురు—ఇది యప్పకవిగారి విమర్శోక్తి.

ఇందు 'మాకు + ఒనరిన—మాకొనరిన' అను సంధిగత శబ్దము నఖండముగా భావించి యేకశబ్దముగు 'ఒకొంటికి' అనుదానిలోని క వర్ణమునకు యతి సంఘటింపబడి యున్నది.

ఒకొండు—ఒకండు అను శబ్దమునకు రూపాంతరము. ఔపవిభక్తిక ప్రత్యయ యోగమున 'ఒకొంటికి' అయినది. ఇందు సంధి లేదు. ఇందలి 'కొ'వర్ణమునకును 'మాకొనరిన'యను సంధిగత శబ్దములోని 'కొ'వర్ణమునకును అఖండవడి చెప్పికోవలయు. ఇది యిట్లుండ దీనికి పాఠాంతరము కల్పింపలేక కాబోలు నప్పకవి 'ఒక + ఒండు—ఒకొండు' అని సంధి చేర్పఱచుకొని స్వరప్రధానవడి యని నిర్దేశించినాడు. 'ఒకొండు—' ఏక పద మనుకొని 'మాకొనరిన' అను దానితో మైత్రి యఖండవడిక్రింద నిరూపించిన లింగమగుంట తిమ్మన, ముద్దరాజు రామనాదులను దేవానాం ప్రియుల గణములో చేర్చినా డతడు.

అప్పకవీయ విమర్శనలో శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు ఈవిషయమును విమర్శించుచు—

"ఒక + ఒంటికి అని అప్పకవిగారి తాత్పర్యమని తోచుచున్నది. పద ద్వయ విభాగమునకు ప్రసక్తి కనిపించదు. ఆయన ముఖ్యాభిప్రాయ మొకటి; పైకి వ్రాసిన దొకటి. అఖండవడి యుండదని ముఖ్యాభిప్రాయము. అందుకు నఖండవళు లున్న చోట ౫-౬ చోట్ల దిద్ది పాఠములు వేరే కల్పించినారు. ఇక్కడ దిద్దడమునకు శక్యము కాలేదు.........

స్త్రీపర్వంలో
'పాండవులవలన గీడొ
క్కండును లే దధిప నీదు కొడుకులు ధరణీ'
అని ఉన్నది. దీని కేమంటారు? అఖండవడి అంగీకరించవద్దా? గాని యిది నిజముగా వర్గయతి"

అని యప్పకవిమతమును ఖండించిరి. వెండియు, కూచిమంచి వేంకటరాయడు తన సుకవిమనోరంజనములో నప్పకవి యీ వాదమును ఖండించినా డని తెలిపినారు వారు.

పదు నొకొండు శబ్దమునుగూర్చిన యప్పకవి మత మసాధు వనియే యెల్లరు దలంచుచున్నారు. కాని యీక్రింది తెనాలి రామకృష్ణ రచిత పాండు

రంగమాహాత్మ్యమ పద్యముం బరికింప నప్పకవి యభిప్రాయము సమంజస మని తోచుచున్నది. చూడుడు.

గీ॥ వాసుదేవాది నవశక్తి వైభవంబు
రుక్మిణీ సత్యభామల రూపరేఖ
యిదియె వహియించు నన నల్వ యిడిన పదునొ
కొంటి లెక్కన గనుబొమ్మలువిద కమరు.

(౩-౧౯౮)

ఇందు చతుర్థ పాదమున యతి విచారింప దగినది. ఒకొండు శబ్దములో ఒక + ఒండు అను విభాగము చేసి పరస్వరమునకు యతిమైత్రి ఘటింపబడి యున్నది. ఇది స్వరప్రధానవడియే కదా? 'ఒక + ఒంటి...... బొమ్మలు + ఉవిద' అని పాదాదియందు యతిస్థానమందు బదచ్ఛేదము. పై తిక్కనగారి పద్యమున లాక్షణికులు విమర్శకులు వచించు నఖండవడి యుందు జెల్లదు. ఒకొండు శబ్దమున బద ద్వయ విభాగ ప్రసక్తి నిక్కముగా గల దని తెలియుచున్నది. అప్పకవి యాభాషణము తథ్య మన్న మాట. తెనాలికవి మన యప్పకవికి బూర్వుడు; కాని యప్పకవి తెనాలి ప్రయోగమును బరికింపలే దని తలంచెద. వెండియు గూచిమంచి వేంకటరాయలకు గాని, గిడుగువారికి గాని యీ ప్రయోగము గోచరము గాలేదు. పై తెనాలి కవి పద్యపాఠమునకు బాఠాంతర మేమేని యుండునా? నాకడ ప్రతిలో* ని ట్లున్నది. ఎవరేని 'పదియు నొంటి లెక్కన' అని సవరింప సాహసింతు రేమో! కూచిమంచి వేంకటరాయల గ్రంథము నే నెఱుంగను. అది ముద్రితమో యముద్రితమో తెలియ రాదు.

కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసార సంగ్రహమున అఖండవడిని జేర్కొన్నాడు. అందు భాస్కర రామాయణ భైరవ శ్రీరంగమాహాత్మ్య మను శ్రీశోణాచలపురాణములలోని పద్యము లఖండవడికి లక్ష్యములుగా నిడబడినవి. వాని నుదాహరించి తరువాత, "ఇట్టి ప్రయోగములు కలవు గాని అఖండయతికి త్రికవుల ప్రయోగములు లేవు గనుక ఇది సుప్రయోగము కాదు" అని యొక వచన మనుబంధింపబడి యున్నది.

(చూ. సర్వలక్షణ - ౨ ఆ)

ఈ తిమ్మకవిమతమున భారతమున నఖండవడులు లేవు; అప్పకవిమార్గానుయాయి యితడు కాబోలు! కాని యితని రసికజనమనోభిరామమున నీ క్రింది పద్యము తృతీయపాదమున నఖండవడి గలదు.

గీ॥ తనకు దొమ్మిది పాతిఱ్ఱ లధనము గల ద
టంచు జక్కుల ఱేడు గర్వించు గాని
లెక్క యిడరాని రొక్కంబు + లీడు లేని
కొలుచు గల వెన్న న వ్వీటి కోమటులకు.

(ప్ర - ౪౪)

దీనికి బాఠాంతర ముండునా? ఇది మన కిప్పుడు చర్చింప దావు గాదు. ప్రస్తుతమునకు వర్తము.

ఒకొండు శబ్దము సంధి గత మనుటకు సూర్యరాయ నిఘంటువునను నీ క్రింది యాధారము కానవచ్చుచున్నది— చూడుడు: ఒండు శబ్దము!

ఒండో (సూ-నిఘంటు)— ఈ శబ్దము 'ఒక్క' శబ్దమునకు బర మయినపుడు 'ఒక్కొండు' అయి క్రమముగా 'ఒకొండు — ఒక్కండు — ఒకండు— ఒక్కడు—ఒకడు' ఇత్యాది రూపముల నొంది 'ఒకటి' అను నర్థమున అమహదర్థక ప్రథమైకవచన రూపముగా వ్యవహరింపబడుచుండెను—ఇత్యాది.

దీనింబట్టి ఒక + ఒండు అను భేదము కల దనుట తెల్లము గదా! ఇందు మఱి యొక యంశము గమనింపవలయు. ఒకొండు సంధి గత శబ్ద మని వ్యుత్పత్తిం బట్టి నిర్ణయించినారము గాన, స్వరప్రధానవడికి పై తిక్కన తెనాలి ప్రయోగములు లక్ష్యము లగుచున్నవి.

ఈ క్రింది పద్యములలో ఒక్కొండు శబ్ద మస్యమాక్షరము హల్లునకే యతి మైత్రి ఘటితమై యున్నది.

క॥ పాండవులనలని కీడొ
క్కొండును లే దధిప నీదు + కొడుకులు ధరణీ

*నా కడ గల ప్రతి ౧౮౮౭ సర్వజిత్తులో— తెన్మఠం వేంకటనరసింహాచార్యుల లఘుటీకతో చెన్నపురి వసురత్నాకర ముద్రాశాలలో ముద్రితము.

మండల మంత్రియు ప్రమంగిరి
పాండు నృపతి భారమునకు కాపిరి వారిన్.
(భారత. స్త్రీ. ౧-౮౩)

స్రగ్ధర॥ క్రూరేష్వాసంబు లే దో + క్కండు గలుగునె
తద్ఘోర యుద్ధంబు సైపన్.
(రాఘవపాండవీయము, ౨-౧౦౬)

ఈనిం బరికింప దోచున దేమన, ఒక్కండు— ఒక్కండు శబ్దములు సంధిగతాఖండశబ్దములు. రూపము క్రిక్కిఱియు క్రచ్చుఱ ఇత్యాది దేశ్య నిత్యసమాసములం బోలినది. కాన ఒక్కండు శబ్దమును దేశ్యాఖండయతి క్రింద గ్రహించి యుభయయతి ఘటించుకొన వచ్చును.

ఈ చర్చంబట్టి పై తిక్కనపద్యములోని వివాద భాగమగు—

మా కొనరిన...పదునొకొంటికి—అను చోట

మాకు + ఒనరిన......ఒక + ఒంటికి — అని ఛేద మొనర్చి,

స్వర ప్రధాన వడిగానేని, సమస్త సంధి గత శబ్దముల కఖండ యతి సమ్మతించు సహృదయుల మతమున

మా కొనరిన......పదు నొకొంటికి—అని యఖండవడిగా నేని చెప్పుకోవచ్చు నని ఫలితార్థము.

---

మధురపండితరాజము:

# గంగాలహరి

[అనువృత్తము]

●

శ్రీ పింగళి లక్ష్మీకాంతం

ఉదుటున్ మర్త్యభూమికి నుఱుకు నిన్ను-నీలకంఠుడు జడలలో నిల్పె నన్న
నిస్పృహులకేనియున్ లోభనీయమైన-నీదు గుణసంపదున్నతిన్ గాదె జనని?

కాలును జేయియున్ జెవియుఁ గన్నును లేక యభాగ్యజీవయా
త్రాలసులైనవారిని, గ్రహస్థితి చాలనివారి, వెజ్జులున్
వేలుపులున్ నమోస్తనుచు వేసరి రోసినవారి, జాడ్యని
ర్మూలము పొంద నీ జలము గ్రోలగనిమ్ము మహౌషధమ్ముగన్.

పులకితగాత్రులై సగరపుత్రులు స్వర్గమునుండి నేటికిన్
సులలితగీతికానరణి స్తోత్ర మొనర్చుచు నుంద్రు స్వచ్ఛశీ
తలమధురమ్ములున్ దురితతాపహరమ్ములు నైన నీ జలం
బుల మహిమంబు మాదృశ విమూఢుల కెట్లు నుతింప నయ్యెడిన్?

నేరిచి నేరమిన్,మనసు నిల్పఁగ లేమిని గొంచెపున్ దురా
చారపు దారి ద్రొక్కియును స్వాంతమునం దనుతప్తులైన సం
సారుల నుద్ధరించుటకుఁ జాల నదుల్ గల వెందు; అప్రతీ
కారమహాఘనిస్తరణకార్యచమత్క్రియ గంగకే తగున్.

స్థానము మోక్షలక్ష్మికి, నిధానము ధర్మమహత్తకున్, దిరో
ధానము మందబుద్ధికి, విధానము మానసతుష్టికిన్, సమా
ధానము మేధకున్, సుపరిధానము ధాత్రివధూటికిన్, మహా
ధానము శ్రీకి, నీ తనువు తాపహరమ్మగు నాకు జాహ్నవీ!

ధనమదిరామదాంధులగు దంభనరాధిపులన్ భజించుచున్
దినదిన మెన్నిరో సలిపితిన్ బరితాపము గొల్పు దుష్కృతుల్.
నిను విడనాడుకొంటి జననీ! తన మేలు గ్రహింపనట్టి మూ
ర్ఖుని యపరాధముల్ తడవి రోయక చల్లని చూపు చూడుమీ!

కేళివిలోలనిర్జరమృగీనయనాతనులేపగంధజం
బాలితముల్,మరుల్లులితపద్మరజఃపటలీపిశంగముల్,
బాలజలేజబాంధవవిభాద్రవమూర్తులు,నీ జలమ్ము, లీ
బాలిశభావిసంజననబాధలకున్ దొలగించు గావుతన్.

జననమా! విశ్వవిశ్వంభరాభరణుడౌ నారాయణుని పాదనలినమందు
ఆవాసమా! భూధరాత్మజాక్రాంతవామాంగుడౌ భవు నుత్తమాంగమందు
వర్తనంబా! మాదృశార్తమానవసముద్ధరణదీక్షాపుణ్యతంత్రమందు
మహిమమా! సంస్పర్శమాత్రసర్వప్రాణిజాడ్యాపనోదకౌశలమునందు
శాపపరిదగ్ధసగరరాజర్షిసుతులఁ-బుణ్యభువనమ్ము సేర్చుట-ముఖ్యలీల.
గంగ యను నక్షరములె యుత్కృష్టనిధులు-అన్యవర్ణన లెల్ల నిరర్థకములు.

కనుమలనుండి సాగరముఖమ్ముగఁ బాఱు నదుల్ మహీతలం
బున శతముల్ సహస్రములుపో! నినుఁబోలెఁ బురారిమూర్ధసీ
మను నిలువంగ నేర్చెనో? రమాధవపాదరజంబు క్షాళనం
బొనరుపఁ గల్గెనో? త్రిభువనోచితసంచరణంబు సల్పెనో?

కను మూసికొని నిర్వికల్పసమాధిలోఁ బడియుండఁగానిమ్ము పద్మభవుని
కలశవారిధితరంగములు జోలలు పాడ శయనింపఁగానిమ్ము శార్ఙ్గధరుని
నందిముఖ్యులు రసోన్మత్తులై జయపెట్ట నాడగానిమ్ము చంద్రార్ధధరుని
పౌలోమితోఁ గల్పపాదపచ్ఛాయల విహరింపగానిమ్ము వేల్పుఱేని
దానధర్మాదికర్మతంత్రముల,గుప్త- ధనముగా నుండనిమ్ము శాస్త్రమ్ములందె
యైహికాముష్మికములైన యఖిలఫలము-లొసగు తల్లివి నీ వుండ నొరు లికేల ?

సంకులాక్రోశభీషణరావభరితపుా శమనుని వీడు నిశ్శబ్ద మయ్యె
చిత్రగుప్తుడు పిల్చి చీకొట్ట యమభటుల్ సురిగిపోయిరి పరాసువుల వెదక
అమరావతీవీథులన్నింట దిగు విమానముల సమ్మర్దమ్ము లమిత మయ్యె
అతిథిపూజాపరాయణులైన యచ్చరతీవబోండ్లకుఁ జేయి తీరదయ్యె.
ఎపుడు పుడమికి దిగితివో యెపుడు జనులు-చెవులు చల్లగ నీ కథల్ చెప్పికొనిరొ
ఆద్యులౌ నార్షకవులు ని న్నధికరించి-యెపుడు గానము చేసిరో యపుడె, తల్లి!

తలపగ హేయమా మదనదాహము పేరి మహాజ్వరమ్ముచే
సలసల గ్రాగి దేహము భృశమ్ము కృశించిన నన్నుబోలు నా
ర్తులపయి జాహ్నవీవిమలతోయకణార్ద్రసమీరపోతముల్
పొలసి శరీరతాపశమమున్ గలిగించు మనోజయమ్ముతోన్.

నన్ను విధూతకల్మషు నొనర్పగలేక సమస్తతీర్థముల్
ఖిన్నత చెంది సిగ్గుపడెఁ, గేల్ చెవిఁ జేర్చిరి నాదు నామమున్
విన్న 'నినీ'యటంచు నరవిందభవాదులు, నీకు దక్కెతిన్
నిన్ను భజించుగాక యఘనిర్దళనప్రతిభాజయోన్నతుల్.

(సశేషము)











## మద్రాసు దొరతనమువారి ఆస్థానకవీశ్వరులు

1. నామక్కల్ శ్రీ వి. రామలింగ పిళ్లై (అరవము), 2. శతావధాని శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు, 3. శ్రీ యం. గోవిందపాయి (కన్నడము), 4. మహామహోపాధ్యాయ శ్రీ కె. యస్. కృష్ణస్వామి శాస్త్రిగారు (సంస్కృతము), 5. వల్లతోల్ శ్రీ నారాయణ మీనన్ (మలయాళము).

వీరందరికిని మొన్న ఆగస్టు 14-వ తేదీనాడు చెన్నపట్టణమున గవర్నరు అధ్యక్షతను జరిగిన నిండు పేరోలగములో విధి విహితముగా ముద్రాధికార ప్రదానము జరిగినది. శాలువలు, పతకములు మొదలైనవి యథా శాస్త్రముగా బహూకరింపబడెను.



# చదరంగము

[కథానిక]

◉

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

మూడు ముళ్లు పడువరకును ఈ పెండ్లి యగునను నమ్మకము మగపెండ్లివారికిగాని, ఆడుపెండ్లివారికిగాని లేదు. పెండ్లికొడుకు బృహస్పతి!

వేయి మొగములతో వెలికుబుకు తన కొడుకు తెలివి తేటలకు వియ్యంకుడు వెనుకకు పోవునేమో యని వెనుకయ్య భీతి. కట్నముగాని కానుకగాని పెట్టి కాబోవు తన యల్లునకును నడుమ నెవరు తెరవాటు గొట్టుదురో యని పెండ్లికూతురుతండ్రి పాపయ్యభీతి.

వియ్యంకు లిరువురకును ఇట్టి భీతితో పని లేదు. ఏలనగా ఈ పాపయ్యకు ఆస్తిపై ఆస్థ. వెనుకయ్యకు కొనితెచ్చుకొన నక్కరలేని కోడలిపై ఆస్థ.

చీరెలమీదను, సారెలమీదను వాంఛయేకాని వధువునకు వరునిమాటయే లేదు. వాడొక కొండ ముచ్చు కాకుండిన చాలు. ఈ వరుడో చూపుల గుజ్జు. ఇక నెందులకు భీతి! ఇసుకతక్కెడ పేడ తక్కెడ.

లగ్నము నిశ్చయము కాగనే పాపయ్య మేనల్లుని కడకు వెళ్ళెను. ఈ పెండ్లి కగు వ్యయములో సగమేని మేనల్లునికడ పుచ్చుకొనవలయు నని పాపయ్య ఆశ.

'నాయనా, మన సుందరమ్మను ఉండవల్లి వెనకయ్యగారి కొడుకు శంకరయ్యకు ఇచ్చి పెండ్లి చేయ పెద్దలు నిశ్చయించిరి.' అని పాపయ్య నీళ్లు నమిలెను.

'ఏమేమీ, సుందిమెడ కుందిలో పెట్టితివా?' అని ఆ మేనల్లుడనుచుండగా దారి మారెనని పాపయ్య తెలిసికొని 'ఓయీ, నే నిచటికి నీసలహా తీసికొనుటకు రాలేదు. లగ్నము నిశ్చితమయిన దనిమాత్రము చెప్పుటకు వచ్చితిని' అనెను.

'గొప్పపని చేయవచ్చితివి. చెప్పుటకు నీకు సిగ్గయినను లేదే! చెప్పితివి: కడుపు నింపితివి. చాలు నిక పొమ్ము' అని ఆ మేనల్లుడనెను.

పాపయ్య మేనల్లునికడ అన్నమునకు బదులు సున్నము తిని అచటినుండి లేచెను. పొరుగూరు దాపుననే కలదు. అచట తన కొక మిత్రుడు కలడు. అకాలమున పాపయ్య అచటికి జేరెను. మిత్రు డాతిథ్య మిచ్చెను.

భోజనసమయమున పాపయ్య—'మన అమ్మాయి సుందరమ్మకు లగ్నము నిశ్చయించుకొని వచ్చితిని' అని చెప్పెను.

'అదృష్టవంతుడవు. తిరిగితిరిగి నా కాళ్లు బలపాలు కట్టినవి. మా అమ్మాయికి ఎచటను సంబంధము కుదురలేదు. కుదిరిన సంబంధము మా అమ్మాయి ఒప్పదు.' అని మిత్రు డనెను. కన్నవాని కే కష్టము తెలియవలయునుగాని పసికూనలకును గొడ్డుమోతులకును ఏమి తెలియును? ఈ సంబంధమునుగురించి మా మేనల్లునితో చెప్పబోవగా తన్నక విడిచిపెట్టెను. అటనుండి యిట కొక పరుగు తీసితిని'. అని పాపయ్య అనెను.

'పాపము. సంబంధ మెచట?'

'సంబంధమున కేమోయీ బంగారమువంటి సంబంధము. వారికి పదిఎకరాల చెరకుతోట. మూడుకుంటల పసుపుతోట. మూడున్నర ఎకరాల సపోటాతోట. ఉండవల్లివారి నెరుగవా?' అని పాపయ్య నోరుకరచుకొనెను.

'సంకోచించుచున్నటు లున్నావు?'

తన సంకోచమునకు పాపయ్య నగచి—'ఎబ్బే, వెనుకయ్యగారి నెరుగవు కాబోలు.'

'ఎరుగ నేమి?'

'ఇక నేమి! ఆయన కొడుకే. పేరు శంకరం.'

'ఆఁహాఁ. అలాగా! మంచిది.' అని ఆ మిత్రుడు పలికెను.

దాపుననే వారి సంభాషణ మాలకించుచున్న లక్ష్మి 'వాడి కిచ్చేబదులు వాకట్లో దున్నపోతు కివ్వండి'అని అనెను.

'చిన్న నోటికి పెద్దరుపులు' అని ఆ మిత్రుడు తన కూతును వ్రేలజూపుచు-'దీనిని వారు చేసికొన నంగీకరింపలేదు. అందులకని యిది అటు లనుచున్నది' అని చెప్పెను.

పాపయ్య నవ్వి—'ఈ కాలపు పిల్లలందరు నింతే. ఇటులగుచో మనబోటి బీదవారి గతి యేమగును? మా మేనల్లుడుగూడ నిటులే యనెను. లోకులు కాకులు.' అని పాపయ్య చేయికడుగుకొని మరి ఆ ప్రస్తావన చేయక వెళ్లిపోయెను.

లగ్నమునకు మగపెండ్లివారు తరలివచ్చిరి. వచ్చుచునే నలుబది కాసుల గొలుసొకటి పంపిరి. ఆడుపెండ్లివా రాదరణరసము లెస్సగ చూపిరి. మూడు ముళ్లును పడెను. 'ఇల్లేడ్పు అమావాస్యయు ఇరుగు పొరుగేడ్పు తద్దినమును ఊరేడ్పు పెండ్లియు' నను సామెతను నిజముచేయుచు పాపయ్య తన లేబరమును వియ్యంకునకు విన్నవించుకొనెను. 'తేనె దగిరి మూరెడు కుంగుట ఎందుల'కని వియ్యంకు డోదార్చెను. వియ్యంకు లిరువురకును నాటితో బెంగ వదలిపోయెను.

'పెండ్లికొడుకుకు ముప్పదేండ్లన్నా రేమిటి? కాకటులు కొలిచిచేసిన పెళ్లిలా వుంటే! కొండము చ్చున్నారు కుమారస్వామిలా వుంటే! ఇంతకూ సుందమ్మ అదృష్టం' అని ఊరివా రనుకొనిరి. ఈ యభిప్రాయము మార్చుకొనుట కా యూరివారి కంతో కాలము పట్టలేదు.

౨

పెండ్లి అయినపిదప నాలుగేండ్లలో నాలుగు వందలసారులు శంకరయ్య అత్తింటికి వెళ్లెను. తండ్రి వాని నిసుమంతయు ఆపజాలక ముడియెద్దువలె విడిచి పెట్టి యూరకుండెను.

అల్లుని చెప్పు అక్రీతదాసుడు అను పదము జీత నాతములు లేని నౌకరు అను యోగార్థములో పాపయ్య అల్లుడగు శంకరయ్యయెడల అన్వర్థమాయెను.

అత్తింటికడ మూన్నాళ్లు కాపురముచేసి సుందమ్మ పుట్టింటికి వచ్చెను. మరి మూన్నాళ్లకు శంకరయ్య తలిదండ్రులకు చెప్పక అత్తింటికి వచ్చెను.

అల్లుని జూచుచునే పాపయ్య పండ్లు పటపట కొరికి—'ఏలుకొనలేని ఓబయ్యకు పెండ్లి ఎందుకు?' అని పెరటిలోనికి జని అల్లునికి జరిపింపవలసిన మరియాదల నన్నిటిని తన సంతానమునకు విపులముగా బోధించెను.

శంకరయ్య మాటాడక అరుగుమీద కూరుచుండెను. తా ననుకొన్న చందముగా సుందమ్మ తలుపు చాటున నుండి తన్నోరచూపుల నభిషేకింపలేదు. కాళ్లు కడుగుకొనుటకు నీటిచెంబు తెచ్చి స్తంభముచాటున నుండి తనమీద నీరు చిలుకరించలేదు. కాగా అతడు కౌతుక మాపుకొనలేక పెరటిలోనికి చూచెను. ఏమియు ఎరుగనటులు సుందమ్మ గదిలోనుండి పెరటిలోనికి బోయి నూతిలో నీడ చూచుకొనుచు గూరుచుండెను. ఇది యేమి వాలకము? ఇది యేమి పతిభక్తి? ఏ యాడుది యేని యిటులు చేయగలదా?

పెద్ద మరదలు వచ్చి—'బావా, కాళ్లు కడుగు కొమ్మ'ని బట్టమీద నీళ్లు పోసెను. శంకరయ్య ఎలుగు వలె మరదలిని పట్టుకొనబోయెను. మరదలు గొల్లభామ వలె లోపల వాలెను. శంకరయ్య బట్ట పిడుచుకొని గృహగర్భములోనికి తొంగి చూచుచు మరల అరుగు మీద గూరుచుండెను.

రెండవ మరదలు వచ్చెను. శంకరయ్య—'మా అక్కకు జబ్బుగా నున్నదా?' అని అడిగెను. 'నీకు జబ్బు నీ యబ్బకు జబ్బు. అలసివచ్చితివి. ఈ కజ్జకాయ తిను' మని ఒక మొట్టికాయ మొట్టెను. శంకరయ్య దానిని పట్ట పరువెత్తబోవగా మూడవ మరదలు కాలడ్డము పెట్టెను. బావమరది గబగబ వచ్చి—'గుల్లం గుల్లం' అని పడిన శంకరయ్యను తన కీతిగా ఉపయోగించుకొనెను. వీరిటులు తన్ను హింసించుచుండగా గుడ్లుపెట్టుకొనిచూచుచు గూరుచుండెనే యని సుందమ్మమీద శంకరయ్యకు పట్టరాని కోపము వచ్చెను. అతడా కోపము నపుడు జేబులో వేసికొని నడిరేయి బయటికిదీయ నిశ్చయించుకొనెను.

'వంట జాగు లేదు. బావకు నీళ్లు తోడు' అని సూరమ్మ కేకపెట్టెను. కొద్దిసేపటిలోనే పెద్దమరదలు వాకిటికి వచ్చి—'బావా, ఉతికలాడు' అని గదిలో నక్కెను. శంకరయ్య యిల్లంతయు శోధించుచు కొండంతాశతో పెరటిలోనికి బోయి చీకటిలో తడిమి తెల్లబోయి పరాకు చిత్తగించి చెంబెడునీరు మీద బోసికొనెను. ఆ నీరతనిచే గంతులు వేయించెను. గెంతుటకు కుడికాలెత్తగనే పీట ఒకవైపున పామువలె లేచెను. ఎడమకాలు జారి మడతపడి శంకరయ్య బిల్లపెట్టుగా ధమ్మని నేల గూలెను. ఒడలెల్ల బురద కొట్టుకొనెను. అటు ఇటు చూచి ఎవరును జూడకుండుట తన భాగ్య మనుకొని— 'చలినీళ్లు చలినీళ్లు' అని అరచెను.

మరదలు కిటికీలోనుండి తొంగిచూచి—'కొంచెము సేపటివరకును తలుపుతీయు వీలులేదు. బావా, బావా, యింటిముందు బురదగుంటలో దున్నపోతు పడి గిలగిల కొట్టుకొనుచున్నది. అటు వచ్చి దానిని కొంచెము కట్టిపోవూ!' అని అనెను.

మరదలికోరిక తీర్చుటకు శంకరయ్య గబగబ గృహప్రదక్షిణము చేసి వాకిటిలోనికి వెళ్లెను. అటనున్న ఊరివా రందరును గుంటలోనుండి లేచినటు లున్న శంకరయ్యను జూచి పకలబడిరి. శంకరయ్య వారి నవ్వుల కతీతుడై ఆ గుంపులో సుందమ్మ ఉన్నదేమో యని కనులతో వెదకుకొనెనుగాని వృథా.

అత డెటులో స్నానభోజనములు ముగించి పంచకు చేరెను. పాపయ్య ఒకరొకరికే చాపలును, మంచములను పరచెను. పిల్లలంద రెచటివా రచట శయనించిరి. పాపయ్యయు వాకిటితలుపు లోరగా మూసి మంచముమీద బరుండి గుఱ్ఱుకొట్ట మొదలిడెను. సూరమ్మయు వంటయింటి దీపము మలిపివేసెను.

లోలోపలినుండి పిలుపు వచ్చునని ఆసించుచున్న శంకరయ్య విసికి విసికి ఆవులించెను. చెవులు దోరబెట్టుకొని వినెను. కనులు పొడుచుకొని చూచెను. లేచి కూరుచుండెను. తలుపుసందునుండి దివ్వెవెలుగు వలకేని చెరువుఅలలుగువలె వాకిటిలోనికి ప్రసరించుచుండెను. అతడు చేపవలె ఆ అలలుగున కెదురెక్కి గదిముంగలి కేగెను. తలు పోరగా వేసియుండెను. సంతసించుచు శంకరయ్య దొంగవలె లోనికి దూరెను. ఎట్టెదుట మంచముమీద ముసుగుపెట్టుకొని పడుకొనియున్న సుందమ్మ!

శంకరయ్య నిట్టూర్చెను. జవాబు లేదు. మంచము చుట్టు ప్రదక్షిణించెను. మారు కదలిక లేదు. సముద్రమంత ధైర్యము తెచ్చుకొని సుందమ్మమీద తమలపాకువలె చేయి ఆన్చెను. ప్రతిక్రియ లేదు. అతని చేయి కొంచెము సంచారము మొదలిడెను. సుందమ్మ అసింట జరగెను. శంకరయ్య ఉత్సాహ మాగలేదు. గబుక్కున మంచముమీద నిండుబరువుతో కూలి పడుకొనెను.

'నే నెవ రని అనుకొంటివో? నేను నీ యక్కను. నేను నూతబడి చచ్చి వచ్చితిని. రావిచెట్టుమీది కని రావిచెట్టుకింది విఘ్నేశ్వరుని పట్టినటులు నిన్నుగూడ బట్టెదను. నిన్నుగూడ నూత గూల్తు చూడు' అని సుందమ్మ పంగలించి ఒక్కతన్ను తన్నెను. శంకరయ్య మంచముమీదినుండి గోడిబిళ్లవలె ఎగిరి క్రిందబడి విలవిలలాడెను.

ఊరెల్ల ఎగిరిపోవునటులు మరల మరల నామాటలే ఆవర్తించుచు సుందమ్మ గ్రుడ్లెఱ్ఱజేసి చూచుచుండెను. శంకరయ్య లేచి బట్టలు దులుపుకొని సోకాలు పెట్టదొడగెను. పిల్లలందరును లేచి ఎవరో చచ్చిపోయినటు లేడ్వదొడగిరి. అత్తమామలు గబగబ గదిలోనికి పరువెత్తి శంకరయ్యను బయటికి లాగుకొని వచ్చిరి. ఉప్పెన వచ్చినటులు ఊరంతయు మూగెను.

చెంగయ్యపంతులు లోని కేగి మరలివచ్చి సుందమ్మకు దయ్యముపట్టె నని చెప్పగా ఎక్కడివా రక్కడ మాయమయిపోయిరి.

## 3

సూర్యుడు కొరపంజువలె తూరుపున కనబడెను. పాపయ్య అల్లుని కూతును స్నానము చేయించి తడిబట్టలతో ఆంజనేయస్వామి కోవిలకు దీసికొనిపోయెను. అర్చకుడు పూజ చేయుచుండెను.

అపుడు పాపయ్య లేచి ఆంజనేయస్వామి యెదుట నిలువబడి చేతులు దోయిలించి—'స్వామీ,

రెండునూరు లీయనిదే మంత్రాల మల్లావధానులు రాడు. నూ రీయనిదే జపాల జాలయ్య రాడు. మరి రెండు నూరులు లేనిదే పూజాపురస్కారములకును సంతర్పణమునకును చాలదు. నేనా, గర్భదరిద్రుడను. మా దయ్యం కూడా, ఈగ కిలి పాముకు బలి పెట్టదు. ఏమి గతి!' అని విన్నవించుకొనెను.

శంకరయ్య త్రాచువలె లేచి—'అయనే యివ్వాలంటే ఈ దయ్యం వదలినట్లే. అదో దయ్యం, ఇదో దయ్యం. దయ్యాన్ని కన్నవాడు దయ్యం కాక ఏ మౌతాడు! మేం పెట్టిన గొలుసు తాకట్టు పెట్టి ఐదొందలు తెండి' అని అనెను.

పాపయ్య ఆ మాటలకు మొగము వంకరగా పెట్టి—'మేము పెట్టితి మట పెట్టు. మీ నాయన ఏమి పెట్టెను! గిలుటు గొలుసు! అదిరైనను తీసి సుందిమెడ బోసి చేయరాదు. సుబ్బిసెట్టికి నీ వయిదు వందల కొకనోటు వ్రాయుము' అనెను.

శంకరయ్య సుందమ్మ మెడలోని గొలుసు పరీక్ష చేయుటకు మీద చేయివైచెను. సుందమ్మ మగని చెంప ఛెడేలు మనిపించి గొలుసుతీసి క్రింద బారవయిచెను. అది కంయిమని మోగెను.

'వింటివా దాని మోత! బంగారు మనుచో నిటులు కంచువలె మోగునా!' అని పాపయ్య అనెను.

శంకరయ్య తెల్లబోయి 'నోటు రాయించండి రాసిపారేస్తా' అని అనెను.

అర్చకుడు కలము కాకితము సిరాబుడ్డిని సమకూర్చెను. మామ మతలబు చెప్పగా అల్లుడు వ్రాయగా పది కాకితములు పాడాయెను. పిమ్మట అర్చకుడు వ్రాయగా శంకరయ్య సంతకము చేయగా ఆనోటు సిద్ధమాయెను. అంతట పాపయ్య పూజ ముగించి అల్లు గూతుల వెంట నిడుకొని యిల్లు చేరెను.

నాలు గయిదు నాళ్ళలో మంత్రాల మల్లావధానులు జపితలతో దిగి జపము లారంభించెను. పది దినములపాటు జపములు సాగినపిదప నత డొకనాడు జపములో గూరుచుండి—'అదిగో ఆ దయ్యము ఆలుమగల యిరువురమీదను గూరుచున్నది' అని కంటికి కనబడినటులు చెప్పెను. సుందమ్మ విరుచుకొని పడిపోయెను. అది చూచి శంకరయ్య యిల్లు వెడలి పరుగిడ దొడగెను. అందరును అతనివెంట నురికి పట్టుకొని వెనుకకు తీసికొనివచ్చి మరల మాంత్రికునిముంగల కూరుచుండబెట్టిరి.

'ఆః. తిన్నగా అటులు దారికి రా. మగ రాకాసులే నాకు శరణు సొత్తురు. ఆడుదానవు నీ వొక లెక్కా!' అని ఆ మాంత్రికుడు హుంకరించి శంకరయ్యకు మంత్రజల మిచ్చెను. ఆ జలము త్రావిన కొలది కాలములో తల తిరిగి అతడు—'లా వొక్కింతయు లేదు' అను పద్యమును ఆవృత్తిచేయ మొదలిడెను. శంకరయ్యకు వచ్చిన దదియొకటే.

లోపలలోపలనే కాయు జ్వరమువలె లోలోపలనే పట్టి పాలార్చుచున్న దయ్యము నిటులు పైకురికించిన మాంత్రికుని శక్తి కందరును సంతసించిరి. కాని శంకరయ్యతిమ్మిరి ఆ సంతసించినవారి కెవరికిని ఊరట కలిగింపలేదు. అతడు వారి యిండ్లన్నియు చెడదిరిగి—'మాయయ్య మన్నయినా నలిపి చేతిలో పెట్టడు. నన్ను చూడటానికి సుందికి కళ్ళు లేవు' అని యేడ్చుచు వాగును. అత డిటు లేడ్వగా సుందమ్మ—'నాకు చీర పెట్టు. పసుపుపెట్టు. కుంకుమ పెట్టు.' అని గుడ్లు ప్రత్తికాయలంత చేసి శంకరయ్యమీద కెగబడెను. శంకరయ్య భయపడి పారిపోవదొడగెను. పాపయ్య వెంటపడి లేడివలె పరుగెత్తి అల్లుని పట్టుకొని యింటికి నెట్టుకొని వచ్చి కట్టి పడవయిచెను.

'వద్దురా బాబో యీ పెండ్లాం' అని శంకరయ్య మొత్తుకొనెను.

'ఏమంటివి! వద్దురా బాబో యీ పెండ్లాం అనియా! నా కెందుకే మగడు నా కెందుకే!' అని పాడి 'పో లేచిపో' అని సుందమ్మ కట్లు విప్పి శంకరయ్యను ముందుల కొక తోపు తోసెను.

'ఎబ్బెబ్బె! ఏమీ లేదు. కట్టు నీచేతిమీదుగా కట్టు' అని శంకరయ్య సుందమ్మమీద చేయివైచెను.

'నాన్నా! ఇతడు నామీద చేయి వేయుచున్నాడు. కట్లు విప్పుకొన్నాడు. మీదిమీదికి వచ్చుచున్నాడు' అని సుందమ్మ తండ్రిని పిలిచెను.

పాపయ్య వడివడిగా వచ్చి శంకరయ్యబడలు నలుగగొట్టి ఎక్కడినుండియో ఒక తుక్కుగొలుసు తెచ్చి చేతులకును కాళ్లకును తగిలించి తాళముపెట్టి చీకటిగదిలో విడియించెను.

'అయ్య బాబో! ఐదొందలకు నోటూ రాపిచ్చి, చేతులకూ కాళ్లకూ మురుగులూ కడియాలూ తగిలించిరి వద్దురా బాబో యీ పెండ్లాం'అని శంకరయ్య ఊరెగిరి పోవునటు లేడ్వసాగెను. ఊరిపిల్లలు ఈ రెండు పాటలను అందుకొని ఒకడు— 'వద్దురా బాబో యీ పెండ్లాం' అని అనగా మరియొకడు— 'నాకెందుకే యీ మగడు' అని వంతపాట మొదలిడిరి

సుందమ్మ చాటుగా చీకటిగదిలోని కేగి 'నీవు నాకు దూరుచుండుము. కానిదే మీనాయన కానియు నీయడు' అని ఉపదేశించెను. 'ఓ తేష్కా' అని శంకరయ్య 'లావొక్కింతయు లేదు' అని వాగ దొడగెను.

శంకరయ్యను పట్టి తీసికొనివెళ్లుటకు వచ్చిన వెనుకయ్యరైతు ఇచటిసంగతు లన్నియు తెలిసికొనెను. అత డెటులో వీలుచేసికొని చీకటిగదిలో నున్న శంకరయ్యను చూచి వగచి—'పాపయ్య చెప్పినటులు పత్రములు వ్రాసితివా తిండికి లేకుండ చత్తువు' అని చెప్పెను. శంకరయ్యమనసు చెదరెను.

'దయ్యమును బాగుచేసినతరువాత కొడుకును కోడలిని తీసికొనిపోవచ్చును. ఐదువందలు వ్యయమయినది. వెంటనే పైకము తీసికొనిరమ్మని మీదొరకు చెప్పుము'అని పాపయ్య ఆ రైతును సాగనంపెను.

౪

వ్యవహారము ముదిరెనని వెనుకయ్య గ్రహించెను.—'నా కొడుకు శంకరయ్యచే వారును వీరును పత్రములు వ్రాయించుకొనుచున్నటులు తెలిసెను. వానికి కాకితము నలుపుచేయవలసిన పని లేదు. కాబట్టి వాడు వ్రాసిన నోట్లు వగైరా చెల్లవు'అని పత్రికలో ఒక ప్రకటన చేసెను.

పాపయ్య దానిని అల్లునకు జూపెను. శంకరయ్య బావురుమని ఏడ్చి—'ఒసే సుందీ, నన్ను జొట్లో పెటతారు కాబోలు. నానోటు! నానోటు' అని అరచెను.

'ఓరి పిచ్చివాడా! నే జెప్పినటు లొక కాకితము వ్రాయుము. వీరభద్రపళ్లెమునకు హనుమత్పళ్లెము' అని పాపయ్య అనెను.

'ఏమని?'

'నేను నోటు రాసినమాట నిక్కమే. అమ్మ పెట్టనూపెట్టదు, అడుక్కొతిననూ తిననివ్వదాయె. నే నేం చెయ్యాలి?'అని.

'అలా రాయమన్నా?'

'కూడనిచో మానాయన మన్నయినా నలిచి పెట్టనని నీ వేల అనుచుంటివి?'

'అనొచ్చుగాని అచ్చు గుద్దమన్నా?'

'ఓ. ఢంకామీద దెబ్బ కొట్టి.'

'అలాగయితే మా రయితును పిలిపించండి.'

'నీకే చెనురుపెట్టిపోయిన వెధవ వా డెందుకూ?'

శంకరయ్య మాటాడుటకు సంకోయించెను.

ఇది జరగిన మరునాడే—

'నాచేత వారూ వీరూ నోట్లు రాయించుకోవడంలేదు. నేనే వ్రాయించేస్తున్నాను. నీ విప్పవాయె. నే నేం చేయాలి? —శంకరయ్య.'

అని ఒక ప్రకటన పత్రికలలో వెనుకయ్యకు కనిపించెను.

వెనుకయ్యకు వెఱ్ఱులు పిచ్చులు ఎత్తుకొనివచ్చెను. అత డా ప్రకటన పట్టుకొని ఊరంతయు తిరిగెను. బంధుగుల కందరకును వినిపించెను.

ఉత్తరకుమారప్రజ్ఞ లని కొడుకుమీద కారములు మిరియములు నూరెను. భస్మాసురు డని వియ్యంకునకు పేరు పెట్టెను. ఆస్తి చీల్చెను. రిజిస్టరు చేసెను. అరుగుమీద కూర్చుండి—'ఇక మామతో ఊరేగు' అని హుంకరించెను.

వెనుకయ్య యిటులు వీరావేశములో నుండగా గొల్ల డొక చీటి తెచ్చెను. వెనుకయ్య దాని నందుకొని,

జపములు వలుబడివాళ్లతో పూర్తివినవి. 'మాంత్రికునకు రెండు నూటపదారులును, జపీతలకు నూటపదారులును పైకర్చు మున్నారును వరసి ఐదువందల పైచిలుకుతో శచే దయచేసి మీకొడుకును కోడలిని తీసికొని పోవచ్చును. నా యింట భూదేవి తప్ప ఆమెసకతి లేదని తెమకు విశదము.' అని చదివి—'ఓయీ మీ భస్మాసురుడు డబ్బుమాటేకాని జబ్బుమాట వ్రాయ డేమి?' అని ప్రశ్నించెను.

'ఇప్పుడు జబ్బేడ నుండదీ? మరిగత్తే ఆ మంతిర గాణ్ణి మానీ చుట్టుపక్కల వూళ్లల్లో దెయ్యాలుగూడా లగత్తినయ్. ఊళ్లో దెయ్యాలన్నీ లెగిపినయ్యంటే. దెయ్యాలు లెగడ వేంటి రెంకమ్మగోరికి యేవిళ్లేంటి? ఒక్క రెంకమ్మగోరేంటి చుక్కమ్మగోరు మారమ్మ గోరు సుందమ్మగోరు ఎల్లమ్మగోరు పుల్లమ్మగోరు యెక్కడ మానినా యేవిళ్లే, యిగ మాట మాపు సేసు కుని లెగండి.'

'సరిలే. నా కెక్కడ తీరిక? మా బావగారిని బతిమాలుకొందును.' అని వెనుకయ్య విసవిస విస్సయ్య గారి యింటికి వెళ్లెను.

అత డటు వెళ్లగనే గొల్ల డిటు వెళ్లి వెనుకయ్య వ్రాసిన దస్తావేజు సంగతి యంతయు తెలిసికొనెను.

ఆ మరునాడు గొల్లడు విస్సయ్యతో పాపయ్య కడకు వచ్చెను. వచ్చుచునే వాడు తాను తెలిసికొనిన రహస్యమును పాపయ్యకు రహస్యముగనే చెవిని వేసెను.

పాపయ్య విస్సయ్యను చూచుచునే 'నీ వెందుకు వచ్చితివయ్యా హంసపాదవు' అని విస్సయ్య చేతులు పొడిచెను. గదిలో నున్న శంకరయ్య—'నే నిక్కడ ధస్తావుంటే మా నాన్న మంచాలు సేస్తున్నాడా? పోనీ డబ్బేమయినా పంపాడా?' అని అరచెను.

'నాకు తీరిక లేదు- నీవు పోయి, మాంత్రికుని సత్కరించి కొడుకుగోడండ్రను తీసికొనిరమ్మ అని బావగారు నన్ను బతిమాలిరి.'

'అరుగో లోపల. జపముమీద. పోయి చూడుడు'

విస్సయ్య భక్తితో మాంత్రికునకు మొక్కి వారిపాదములముందు నూటపదారు రూపాయ లుంచెను. లక్ష్మివెూత విని కనులు తెరచి మాంత్రికుడు—'వెను కయ్యగారి యిల్లు దయ్యాలకు పుట్టిల్లు. దానిని బాగు చేయునిదే యీ భూతగ్రస్తు లటకు పోరాదు' అనెను.

'చిత్తము. వెనుకయ్య కిది చెప్పుదును' అని విస్సయ్య యనెను.

పిదప నామాంత్రికుడు ౧౧౬ మాత్రమే చూచి చప్పరించెను. పాపయ్య ఆ పైకము తీసి—'వారి కొప్పుకొన్నది ౨౩౨. పైవారికి ౧౧౬. పైకర్చులు ౩౪౦. మింజుమలె నూరా? ఇది బిచ్చమా?' అని విస్సయ్యమీద విసరికొట్టెను.

'అయ్యా, వారు నాకు చెప్పిన దింత. ఇచ్చిన దింత. ఈ చదరంగములో మీ రొండోరులే ఎత్తుపై యెత్తులు వేసికొనవచ్చును. నడుమ నేనువచ్చుట తప్పు. ఇక రాను' అని విస్సన్న అనెను.

పాపయ్య మరల ఆపైకము పోగుచేసికొని 'మీరు పోయి దయ్యములకి ల్లద్దెకిచ్చిన ఆ భూతభర్త నిటకు వెంటనే పంపు'డని అనెను. 'మంచిది' అని విస్సయ్య శంకరయ్యను చూచుటకు గదిముంగలి కేగెను. పాపయ్య 'మీరు చూచుటకు వీలు లేదు' అని అడ్డువచ్చెను. విస్సయ్య మరి నీళని పుచ్చుకొనక వెళ్లి పోయెను. శంకరయ్య ఏడ్వదొడగెను.

౫

పాపయ్య నాడే దస్తావేజుకు నకలు తెచ్చెను. చెట్టుకింది ప్లీడరు చెంగయ్యపంతులును పిలిపించి దస్తా వేజును శంకరయ్యకు తెలుపుమని కోరెను.

'దీని భాగ్యమునకు నేను రావలెనా? మీ అమ్మాయి చెప్పలేదా? మీ భార్య చెప్పలేదా? అంద రకును అప్పీలు మీరు చెప్పలేరా?'

'మీ రుండగా మేమా మాబోంట్లా'

అంత చెంగయ్య దస్తావేజు చదివి— 'ఆస్తి యంతయు మూడు వాటాలు...వాటాకు ఐదెకరాలు. వాటాకు అప్పు మూడువేలు. శంకరయ్య వాటాకు తండ్రియు పినతండ్రియు ధర్మకర్తలు.' అనెను.

'అనగా?' అని సుందమ్మ ప్రశ్నించెను.

'వారు పెట్టినచో కద్దు, లేనిచో రద్దు.'

'పాదూరిలో మంచపుకోళ్ళే పోతరాజట. ఈ పినతండ్రి ఎవడు?' అని పాపయ్య అనెను.

'నాకు పెట్టడానికీ పెట్టకపోవడానికీ వాడెవడు? మానాయన చచ్చాడా?' అని శంకరయ్య గొలుసులు గలగలలాడగా నేల మట్టెను. సుందమ్మ నవ్వెను. చెంగయ్య పెదవులపై నగవువెన్నెల నిగనిగలాడెను.

శంకరయ్య తల వాల్చి—'నేను మాపిన్నాయన చేతులు కట్టి నా ఆస్తి నే తెచ్చుకుంటా'అని రోశెను.

'అంత పనిలేదు. నీవు ఒక కాకితము వ్రాసి కోర్టులో దాఖలుచేసిన చాలును. నీ పిన్నబ్బ నీకడకే పరుగెత్తుకొనివచ్చును.'

'నేను రాయలేనుగా, ఎట్లా?'

'నీవు వ్రాలుపెట్టిన చాలు. మిగిలినది సుందమ్మే పూర్తిచేయును'

అని పంతులనగా సుందమ్మ కిలకిల నవ్వెను.

'అట్లాగా!'అని శంకరయ్య అనెను.

'అట్లాగా లేదు, ఇట్లాగా లేదు. పంతులు గారూ, ముందు రిజష్టరు నోటీసు వ్రాయించండి. మీ వ్రాత ప్లీడర్లకు వరండి.'

'జాలెందు. వ్రాయగా వ్రాయగా కరణము, దగ్గగా దగ్గగా మరణము'అని పంతు లనెను. పిదప చెంగయ్య చెప్పగా సుందమ్మ వ్రాయగా, సుందమ్మ వ్రాయగా చెంగయ్య చెప్పగా పాపయ్య దిద్దగా కొంతవడి కా నోటీసు సిద్ధమాయెను. శంకరయ్య మనసు ముసించిపోయెను. పాపయ్య శంకరయ్య గొలుసులు విప్పి కాకితమును కలమును చేతి కిచ్చెను. ఒక రెప్పపాటులో శంకరయ్య ఆ నోటీసు కడ్డదిడ్డముగా తాటికాయలు నిలిపెను.

'ఓరి నీ దుంప తెగ. కాకితమునకు కాటుక పూసితివిగదరా'అని పాపయ్య అల్లుని మనికట్టుమీద కఱ్ఱ విరిచెను. శంకరయ్య విలవిలలాడుచుండగా 'ఫరవా లేదు, ఇది నకలుగా మన కుపయోగించును'అని సుందమ్మ యనెను.

'ఎటులయినను సుందమ్మ మగనిపక్షము'అని చెంగయ్య శంకరయ్య సంతసించుచుండగా గబగబ మరొక కాకితము వ్రాసెను. శంకరయ్యగుండెలు గుబగుబలాడెను.

'ఈసారి తిన్నగా ఇక్కడ వ్రాలు పెట్టు; వెనుక నోటుమీద పెట్టినట్లు'అని పాపయ్య గోరితో గీచి చూపెను.

శంకరయ్య చేయి లేవలేదు. 'చేవ్రాలు పెట్టినచో తన తలిదండ్రులు తనకు గారు. చేవ్రాలు పెట్టినచో మామ తన ఆస్తి యంతయు నేకాక తన్నుగూడ తినివేయును. పులిమీద పుట్ర - ఇక సుంది తన మాట వినునా!' అతనికనులముం దిది యంతయు గిఱ్ఱున తిరిగెను.

'వ్రాలు పెట్టు' అని సుందమ్మ గదిమెను.

శంకరయ్య స్థాణువువలె కూరుచుండెను. సుందమ్మ కన్ను గిరిపెను.

చెంగయ్య తల యూపెను. పాపయ్య మొద్దు కొడవలి తెచ్చి—'వ్రాలు పెట్టు'మని అరచెను. శంకరయ్య కనులు మూసికొనెను. శంకరయ్య బుజముమీద కొడవలి తిరుక్కున పెరపెను. బుజము రక్తము చిమ్మెను.

'ఓసీ, నీబావకు తడిగుడ్డ చుట్టు. అమ్మా, గరిటె కాలబెట్టు' అని సుందమ్మ హుకు మిచ్చెను.

'వాతలు పెట్టనిదే వ్రాలు పెట్టడు' అని పాపయ్య పంతులను చూచెను.

'తొందరగా' అని చెంగయ్య అనెను. పాపయ్య లోనికి పోబోయెను. 'ఇదిగో తెచ్చుచుంటి' నని సూరమ్మ అనెను. ఒక మరదలు వచ్చి తడికట్టు కట్టెను. ఇంకొక మరదలు పేపచున్న ఫెడీ మనిపించెను. చిన్నమరదలు తన్నెను. పెద్దబావమరది కారు తెచ్చెను. పంతులు తోడకు పట్టించెను. చిన్నమరది చెంపకాయ పెట్టెను.

శంకరయ్య మొఱ్ఱోమని చేతు లొగ్గెను. లబలబలాడెను. దణ్ణములు పెట్టెను. ఈ రెగిరిపోవ సోకాలు

పెట్టెనుగాని పంతకముమాత్రము పెట్టలేదు. 'ఇప్పుడే యిటులు హింసింపగా వ్రాలుపెట్టినపిదప వీరు మందు పెట్టి చంపరా?' అని అతనికి తోచెను.

అత్త కుంపటి తెచ్చెను. బావ విసరుచుండెను. అందరును 'వ్రాలు వ్రాలు' అని అనుచుండిరి. మరదలు శంకరయ్యరెప్పలను కిందికి మీదికి లాగెను. కుంపటిలో కాలిన సన్నపాటి గరిటె యిప్పుడే రక్తము చిమ్ముచున్నటు లుండెను.

'వ్రాలు పెట్టు' అని సుందమ్మ యరచెను. శంకరయ్య తనచేతిలోని కాకితమును నిప్పులలోనికి విసరెను. చరాలున గరిటె తీసి పాపయ్య శంకరయ్యవీపుమీద నాలు గయిదుచోటుల వాతలు పెట్టెను. శంకరయ్య కన్నులు నిండార విప్పి సుందమ్మను చూచి సొమ్మసిల్లెను.

'కొట్టు, మొగముమీద నీళ్లు కొట్టు' అని పంతులనెను.

ఆరు నెలలకుగాని ఆ వాతలు శంకరయ్యకు మానలేదు. పైగా మందు పెట్టుదురను జంకు. తం. రా డను కొంకు. వీనిచే నతడు ఎముకలగూడాయెను. సుందమ్మ తలుపు తాళము తీసి చీకటికొట్టులోనికి వెళ్లి—'నేటికయినను వ్రాలు పెట్టుదువా పెట్టవా?' అని ఉరిమెను.

శంకరయ్య సుందమ్మ నిండువిగ్రహమును మరల నానాడే చూచి తల వాల్చి యూరకుండెను.

'పెట్టుదువా పెట్టవా?'

'పెట్టను.'

'నీవు పెట్టకున్న ఆగదు. నీ యాస్తిని నీ యబ్బ యాస్తినిగూడ మింగగలవాని తీసికొనివత్తును చూడు' అని సుందమ్మ నిర్గమించెను.

శంకరయ్య కయోమయమయిపోయెను.

సుందమ్మ తాను చెప్పినచందముగనే ఆ మరునాడు మగపిల్లవానిని కనెను.





# ముక్తాలత

శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి

రాధ వృషభానుని కూతురు. ఆమె పుట్టిన తరువాత చాల దినముల వరకు కనులు తెరువలేదు. చూడవచ్చినవారందరు ఆమె పుట్టంధురాలు కాబోలనుకొన్నారు.

ఒకనాడు యశోద బాలకృష్ణుని వెంటనిడుకొని రాధను చూడబోయినది. కృష్ణుడు వచ్చి చెంత నిలుచుండినంతనే రాధ నేత్రములు విప్పి ముగ్ధదృష్టితో నతనివంక జూచినది. భూమిమీద జన్మించిన పిదప ప్రప్రథమమున జగన్నాథుడగు శ్రీకృష్ణుని తప్ప అన్య వస్తువు నామె దర్శించదలచుకొనలేదు. అది ఆమె జన్మజన్మాంతరములనుండి నిర్వహించుచున్న ప్రణయ సమయము.

నవనవలాడు గున్నమామిడివలె రాధ అల్లారు ముద్దుగా పెరిగినది. క్రమముగా నామెకు వయసు వచ్చినది. తారుణ్యరేఖ లుదయించినంతనే వసంత శోభా విలాసిని అయిన ప్రకృతివలె, నవరాగోన్మిషిత అయిన ఉషస్సువలె, శారదజ్యోత్స్నా శోభిత అయిన పూర్ణిమవలె సర్వాంగసుందరియై, లావణ్యలలితయై, జగన్మోహిని అయినది. వృషభాను డామెను యశోదకు సన్నిహితభ్రాత అయిన ఆయానఘోషున కిచ్చి వివాహము చేసినాడు.

వివాహము వివిధోత్సవవిన్యాసములతో వినోదముగా జరిగినది. కళ్యాణమంటపమున కృష్ణుడు రాధను తిలకించినాడు. క్రొత్త సిగ్గుల పెండ్లికూతు రగుటచే రాధ కృష్ణుని చూచినదో లేదో.

రాధను చూచినదిమొదలు కృష్ణున కామెమీద అపూర్వానురాగ ముదయించినది. అలౌకికానుబంధ మేర్పడినది. ఆమెను దర్శింపవలెనని ఆకాంక్ష జనించినది. కాని దర్శన మెట్లు? రాధ ఇప్పుడు అంతఃపురాంగన. రాజావరోధము సులభముగా చొరరానిది. మరి తన వాంఛిత మామెకు తెలుపుట యెట్లు? కృష్ణున కేమియు తోచలేదు. అతనికి రానురాను దర్శనేచ్ఛ దుర్వారము కాసాగినది.

సాయంసమయము. అస్తమానసూర్యుడు హిరణ్మయకిరణములతో యమునానదీమారితరంగహస్తములను లాలించుచున్నాడు. అంతరీపమునుండి కదంబశాఖ స్రోతోఒంగములకు గిలిగింతలు పెట్టుచున్నది. శాఖ మీద కూర్చుండి విస్ఫారితనయనములతో, నిర్నిమేష దృష్టులతో కృష్ణు డా రమణీయదృశ్యము వీక్షించుచున్నాడు. ఆ సమయమున విశాఖ వినోదార్థ మచటికి వచ్చినది. వచ్చి మహోజ్వలసూర్యబింబపటమున, చిత్రితప్రతిమవలె తేజరిల్లుచున్న శ్రీకృష్ణుని దూరము నుండి తిలకించినది. అతని దివ్యసౌందర్యమునకు ముగ్ధురాలైనది.

రాధప్రాణసఖి విశాఖ. మరునా డామె శ్రీకృష్ణమూర్తిని పటముపై చిత్రించి ఆనందించుచుండ రాధ అచటికి వచ్చి ఆమూర్తిని దర్శించినది. తోడనే ఆమెకు అననుభూతము, అలౌకికము అయిన భావోద్రేక ముద్భవించినది. అం దామెమనస్సు లయ మొందినది.

కొంతసేపటికి బాహ్యస్మృతి కలిగి, హృదయము కుదురుపడిన తరువాత తన భావము మరుగుపరచి రాధ, "విశాఖా! ఆ ప్రతికృతి ఎవరిదే?" అన్నది.

విశాఖ ఉలికిపడి తిరిగిచూచి తొట్రుపాటుతో, "ఎంత సేపైనది రాధా, నీ విచటికి వచ్చి?" అని అడిగినది.

రాధ—(కృత్రిమచమత్కారస్ఫురణతో) ఆ మూర్తి ఎవరిది?

విశాఖ—ఇది—ఇది—నీవు గుర్తించలేదా?

రాధ—ఎక్కడో ఎన్నడో స్వప్నములో చూచినట్లున్నది. కాని—కాని ఎవరో సరిగా స్ఫురించుట లేదు.

విశాఖ—ఇది శ్రీకృష్ణుని రూపము.

రాధ—(చిరునవ్వుతో) శ్రీకృష్ణుడా! దివ్యసుందరవిగ్రహుని చిత్రించితివి. నీ చిత్రకళానైపుణ్యము శ్లాఘ్యముసుమా!

విశాఖ—ఎగతాళి చేయుచున్నావా, రాధా?

రాధ—లేదు, చెలీ నిజమే పలికితిని.

విశాఖ—అట్లయిన ఇందులో చిత్రకళయు లేదు; నైపుణ్య మంతకన్నను లేదు. అతని దివ్య సౌందర్యమిందులో శతాంశమైనను అంకితము కాలేదు.

రాధ—(నవ్వుచు) అట్లయిన అతిశయోక్తు లందు నిపుణత సంపాదించిన ట్లున్నావు!

విశాఖ— అతిశయోక్తులా! చూచినగదా తెలియునది! అంత ఎందుకు? నీ కిప్పుడే రుజువు చేసెదను. సాయంకాల మైనదిగదా! శ్రీకృష్ణుడు యమునాతీరమునకు నేడుకూడ వచ్చియుండును. రమ్ము సౌధోపరిభాగమునకు. నీ కతని నిప్పుడే చూపింతును.

సఖు లిరువురును సౌధముమీదికి వెళ్ళి చీకటి పడునంతవరకు నలువంకల కలయజూచినారు. కృష్ణు డెక్కడను కనిపించలేదు.

నాటినుండి రాధకు శ్రీకృష్ణదర్శనాభిలాష అనుక్షణము విజృంభించ దొడగినది. సఖుల సరసాలాపములపై ఆసక్తి సన్నగిల్లినది. భక్ష్యభోజ్యములం దభిరుచి మందగించినది. మాటలాడుచుండగనే మైమరపు ప్రారంభ మైనది. నిర్వ్యాజముగా నామె పచారు చేయుచుండును. ద్వారముకడకు బోయి ఎవరికోసమో ప్రతీక్షించుచున్నట్లు చూచుచుండును. ఒకప్పుడు దీర్ఘనిశ్వాసము విడుచును. ఒకప్పుడు పీతాంబరము ధరించి యోగినివలె నిశ్చలముగా కూర్చుండి ధ్యానించును. ఉన్నట్లుండి చివాలున లేచి నిలుచుండును. ఒకప్పుడు ఉపవసించును. ఒకప్పుడున్మాదినివలె పైటతొలగినను, హారములు జారినను, వేణీబంధ మూడినను గణింపదు. మనోగతము సఖులకు వెల్లడింపదు. సఖు లేదైన ప్రశ్నించినపుడు కన్ను లప్పగించి రెప్పవాల్చక వెర్రి చూపుచూచును. ఒకప్పుడు కనుబొమలు ముడిచి విసుగు కొనును.

రాధమనస్సు రంజించుటకై సఖు లామెను జలక్రీడకు పురికొల్పినారు. విహారములకు ప్రేరేపించినారు. ఖాద్యములకు మురిపించినారు. గీతములు పాడినారు. నృత్యములు సలిపినారు. ఎన్ని విధముల ప్రయత్నించినను వా రామెహృదయపరివర్తనము తెలిసికొనలేకపోయినారు.

ఒకనాటి సాయంకాలమున శ్రీకృష్ణుడు విరహవికలీకృత మనస్కుడై ఏమియు పాలుపోక విహారమునకు బయలుదేరి పోయి పోయి యాదృచ్ఛికముగా నౌకానౌక క్రీడోద్యానము చేరినాడు. అచటి కేళీసరస్తీరమున ఏకాంతప్రదేశమందు దట్టమైన కదంబవృక్షచ్ఛాయలో పుష్పశోభారమణీయమైన లతావితానమున ప్రవేశించి మురళి మ్రోయింప నారంభించినాడు. ఆ వంశీనినాదము—

"రాధా, రాధా, రాధా! నా
రాగరసైకసుధా, రాధా!
నీ లీలలు నా హృదయస్పందము
నా లీలల కీవే యాలంబము!"

అని పలుకుచున్నది.

రాధ శయ్యాగృహమున మంచువంటి పరుపుమీద అర్ధశయానయై కిటికీలోనుండి ఆకాశమువంక చూచుచున్నది. నల్లమబ్బులు సంధ్యారుణాంచలములతో పింజలు పింజలుగా వ్యాపించి యున్నవి. వానిపై ఇంద్రధనుస్సు తోచినది. రాధ తదేకధ్యానముతో నా దృశ్యము పరికించుచున్నది. నీలమేఘములు క్రమముగా కృష్ణరూపము ధరించినవి. ఇంద్రధనుస్సు మయూరపింఛ మైనది. అరుణితాంబుదాంచలములు కుసుమదామము లైనవి.

అట్టి సమయమున మురళీనినాదము మలయానిల తరంగములలో నూగుచువచ్చి రాధకు మృదువుగామధురముగా ప్రాణోత్తేజకముగా వినిపించినది. రాధ యులికిపడినది. ఆమెశరీరము పులకిత మైనది. చిత్తము సముల్లసిత మైనది. చటుకున లేచి యామె సౌధోపరిభాగమునకు పోయి వంశీధ్వని వచ్చు వైపు కలయజూచినది. కడిమినీడలలోని పొదరింటిలో నెమలికన్నులకిరీటముతో అడవిపూలదండలతో నీలమేఘశ్యాముడు గోపకులైకభూషణుడు వదన మోరగా వంచి మురళి మ్రోయించుచున్నాడు. దూరమునుండి రాధ ఆ దివ్యమోహన మూర్తిని కనులార దర్శించినది. అతని వంశీనాదామృతము వీనులార గ్రోలినది. ఆమె నేత్రములనుండి ఆనందాశ్రువులు జాలువార నారంభించినవి. తనువు పరవశ మందినది. హృదయ మా గానస్రవంతిలో నిమగ్న మైనది.

విశాఖ రాధను వనవిహారమునకు పిలువబోయినది. శయ్యాగృహమున రాధ కనబడలేదు. అంతట విశాఖ గృహమంతయు కలయవెదకినది. రాధజాడ తెలియలేదు. విశాఖ ఉద్వేజితయై ఇంచుక తడవాలోచించి మేడమీదికి బోయి చూచినది. అచట రాధ ప్రశాంతభావముతో నిశ్చలముగా కూర్చుండియున్నది. ఆమె లలాటమున నేదియో నూతనతేజోవికాసము పొడకట్టుచున్నది. ముకుళిత నేత్రాంచలములనుండి అరుణితకపోలములమీదుగా ముత్యాల దొంతరలు దొరలుచున్నవి. వంశీగీతము మోహనముగా వినబడుచున్నది. విశాఖ నిశ్శబ్దముగా రాధను సమీపించి ఆమెదృష్టికి సూటిగా చూచినది. దూరమున ఉద్యానవనములో

కదంబచ్ఛాయలలోని లతానికుంజములో సంధ్యా సువర్ణ పుష్పిత శరీరుడు శ్రీకృష్ణుడు హృదయరంజక ముగా మురళి వాయించుచున్నాడు. విశాఖ నయన ములు ముగ్ధము లైనవి. హృదయము స్నిగ్ధ మైనది.

ప్రభాకరుడు పశ్చిమాంగనాపరిష్వంగమున కరిగినాడు. కృష్ణుడు మురళి చాలించినాడు. కాని రాధ సమాధినిష్ఠవలె అట్లే యున్నది. మురళీకాకలి ఆమె శ్రవణములం దింకను మ్రోగుచునే యున్నది. ఆమె హృదయ మా మాధుర్యపారవశ్య మనుభవించు చునే యున్నది.

క్రమముగా శోణశోభలు కుష్కించినవి. అష్టమిచంద్రుడు అరవిరినవ్వులు వలయించుచున్నాడు. అచ్చటచ్చట తారకలు గుమిగూడి గుసగుసలాడ దొడగి నవి. అప్పుడు విశాఖ మెల్లగా 'రాధా!' అని పిలిచి నది. రాధ యులికిపడి, కనులు విచ్చి చూచినది. విశాఖ మందహాసము చేసినది. రాధ సంభ్రమముతో లతా నికుంజమువైపు కడగంటిచూపులు ప్రసరించి ఎటుకున విశాఖవైపు మోము త్రిప్పినది. విశాఖ ఆమె తత్తరము గ్రహించి అరగంటి చిరునవ్వులతో పరిహాసబాణములు విసరినది. అవి కనుగొని గండస్థలములపై కుంకుమశోభ లలముకొన రాధ శిరము వంచినది. అది గాంచి విశాఖ, 'రాధా! నీ రహస్యము తెలిసినదిలే' అని నవ్వినది. రాధ తలయెత్తి దీనవదనముతో, తేలిపోవు చూపులతో 'చెలీ!' అన్నది. విశాఖ పరిహాసము మాని సాదర ముగా, "ఏమి, రాధా! ఎందు కట్లున్నావు? అంత చేలవైతి వేల? నీ భావము తెలియలేదు. చెప్పు— స్పష్టముగా, విప్పి చెప్పు. చెప్పవా? నేను నీ సఖిని కానా? నాకడ నీకు వెరు వెందుకు? చెప్పు." అని గడ్డము పట్టుకొన్నది. రాధ దీర్ఘనిశ్వాసము వదలి గద్గదికతో మెల్లగా, 'శ్రీకృష్ణుడు' అన్నది.

విశాఖ—అవును, శ్రీకృష్ణుడు దివ్యసుందరుడు. అతని మురళీగానము జగన్మోహనము.

రాధ—అంతే కాదు.

విశాఖ—(రాధకనులలో తేరిపార చూచుచు) అతనిని ప్రేమించితివా?

రాధ—(అర్ధ్రనయనము లించుక మరల్చి) అది యేమో నాకు తెలియదు. అతడు—అతడు నా హృద యము హరించినాడు.

విశాఖ—రాధా! యుక్తాయుక్తములు మరచిన ట్లున్నావు. నీవు కులాంగనవు. అతడు పరపురుషుడు.

రాధ—పరపురుషుడా? కాదు. అతడు నాకు అత్యంతాత్మీయుడు. నా ఆత్మీయత మనుష్యస్వభావ మునకు సంబంధించినది కాదు.

విశాఖ—మరి?

రాధ—నా ఆత్మ అతడు. అతని శరీరము నేను.

విశాఖ—అట్లయిన నీ విపుడు కోరున దేమి?

రాధ—(మౌనము)

విశాఖ—ఇంకను దాచుచున్నావా, రాధా?

రాధ—లేదు, సఖీ! ప్రాణసఖివి నీవు. నీకు తెలుపక నే నేమి చేయగలను? కాని—కాని—

విశాఖ—అబ్బా! ఎందు కంత సందేహము, రాధా? నీ వ్యథ చూచిన నా హృదయము దహించు కొని పోవుచున్నది. త్వరగా చెప్పు.

రాధ—సఖీ—సఖీ—

విశాఖ—భయము లేదు. చెప్పు. నా ప్రాణా లర్పించి యైనను నీ కోరిక నెరవేర్చెదను. చెప్పు.

రాధ—(దగ్గుత్తికతో) చెలీ! నాకు శ్రీ కృష్ణుని దర్శనము కావలెను. అతని సాన్నిధ్యము— అతని సాంగత్యము కావలెను.

విశాఖ—సాంగత్యమా?

రాధ—అవును, చెలీ! అదే నా జన్మసాఫ ల్యము. ఆ శ్రీకృష్ణుడు నా దైవము. అతని చరణ కమలములందు నన్ను నేను సమర్పించుకొనవలెను. అందు కివిగో నా ప్రాణాలు నీ హస్తములందు సమ ర్పించుచున్నాను.

విశాఖ—(దీర్ఘముగా నాలోచించి నిట్టూర్పు విడచి) సరే. కానున్నది కాకమానదు. లోనికి రమ్ము. అందుకు తగిన యుపాయ మాలోచించెదను.

విశాఖ రాధను మెల్లగా గృహాభ్యంతరమునకు తీసికొని పోయినది.

విశాఖకు గొప్ప చిక్కు వచ్చినది. కృష్ణుని యొద్దకు ఏమిషతో పోవలెను? ఏమని చెప్పవలెను? ఏవిధముగా? కృష్ణునకు రాధమీద ప్రేమ ఉన్నదో లేదో! లేకున్న రాధగతి ఏమి? ఉన్నచో వారిని సమావేశపరచుట ఎట్లు? రాధ రాజకుమారి—అంతః పురాంగన. పరులకు తెలిసినచో? వృషభానుని చెవిసోకి నచో? విశాఖశరీరము కంపించినది. ముఖము వివర్ణమై నది. మరి ఉపాయ మేమి? రాధ ఆమెకు ప్రాణసఖి. ప్రాణా లామె హస్తగతము చేసినది. అందుచేత విన్ను మన్నైనను, మృత్యుముఖగహ్వరము ప్రవేశించియైనను

రాధఅభీష్టము తీర్పవలసినదే. విశాఖ కర్తవ్యము నిర్ణ
యించుకొననప్పటికి తొలికోడి కూసినది. మరునాటి
నుండి ఆమె కృష్ణుడు విహరించు తావులు కనిపెట్ట
నారంభించినది.

ఒకనాటి సాయంకాలమున యమునాతీర
మందలి పొదరిండ్లలో కృష్ణుడు ప్రకృతిసౌందర్యము
పరికించుచున్నాడు. మలయానిలములు తరగపడికలు
పీడి అలసగమనములతో సంచరించుచున్నవి. వాని
ఒయ్యారమునకు అలరుచెలువలు విరగబడి నవ్వు
చున్నవి. అదే సమయ మనుకొని భ్రమరకుమారులు
వెనుకనుండి వచ్చి కుసుమకోమలులతో దాగుడు
మూత లాడుచున్నారు. అది చూచి విరికన్నెలు చిగురు
జొంపముల చాటునుండి ముసిముసినవ్వులతో ముచ్చట
పడుచున్నవి.

విశాఖ కృష్ణుని దూరమునుండి చూచి దూర
దూరముగా నతని మార్గ మనుసరించి వచ్చి మెల్లగా
నతడున్న పొదరిల్లు సమీపించినది. తరువాత జలము
త్రాగు మిషతో ప్రవాహము సమీపించి చేతిలోని
పూలబుట్ట నీటిలో జారవిడచి, 'అయ్యో, అయ్యో'
అని బిగ్గరగా అరచినది. ఆ కేకకు కృష్ణు డులికిపడి
బయటికివచ్చి చూచినాడు. ప్రవాహములో కొట్టు
కొనిపోవు పూలబుట్ట నందుకొనుటకై విశాఖ ప్రయ
త్నించుచున్నది. ఆమె ప్రయత్నించినకొలది ఆ బుట్ట
మరింత ప్రవాహములోనికి పోవుచున్నది. కృష్ణుడు
గబగబ నచటికి పోయి నీటిలో దిగి, పూలపుటిక అందు
కొని విశాఖ కొసగినాడు. విశాఖ కృతజ్ఞతాపూర్వక
మందహాసముతో, "మీపుణ్యమున నాకు మరల పూల
బుట్ట లభించినది. లేకున్న నేను రిక్తహస్తములతో
బోయి నా చెలికి ఆశాభంగము కలిగించవలసి వచ్చె
డిది. నమస్కారము" అన్నది.

కృష్ణ—సుందరీ! నీ పలుకు లామ్రేడనముల
వలె ఆప్యాయముగా ఉన్నవి. ఒక్కమాట అడుగు
దునా?

విశాఖ—సందేహ మక్కరలేదు. అడుగుడు.

కృష్ణ—మీ చెలి ఎవరో తెలిసికొనవచ్చునా?
విశాఖ—(మందహాసముతో) మా చెలియా?
రాధ.

కృష్ణ—రాధయా—రాధయా?
విశాఖ—మీరు మా రాధ నెరుగుదురా?
కృష్ణ—ఎరుగుదురా! నన్ను నే నెరిగిన
ట్లెరుగుదును.

విశాఖ—ఆమె మీ కేమగును?
కృష్ణ—ఆమెయా—ఆమెయా—! చంపక
పుష్పము లన్న మీ చెలి కిష్టమా? వీని నేల ప్రత్యే
కముగా తీసికొనిపోవుచున్నావు?
విశాఖ—చంపకము లన్న ఆమెకు చాల ప్రీతి.
వీనితో నామె తన హృదయాధినాథు నర్చించునట!
కృష్ణ— హృదయాధినాథుడా?
విశాఖ—అవును.
కృష్ణ—ఎవ రా ధన్యుడు? దేవుడా మానవుడా?
విశాఖ—దేవుడే! మానవరూపముతో ఉన్న
దేవుడు—దేవతారూపము దాచికొన్న మానవుడు.
కృష్ణ—సుదతీ! నీ చమత్కారము నీ సౌంద
ర్యమునకు వన్నె తెచ్చుచున్నది.
విశాఖ—యథార్థము చమత్కారముగా తోచిన
నే నేమి చేయగలను?
కృష్ణ—అట్లయిన ఆ ధన్యు డెవ్వరో తెలిసి
కొనవచ్చునా?
విశాఖ— చెలుల రహస్యము వెల్లడించుట సఖీ
ధర్మము కా దనుకొందును.

కృష్ణ—అంత రహస్యమా?
విశాఖ— అవును. ఆమెతోడి మీ బాంధవ్య
మెంత రహస్యమో అంత.
కృష్ణ—మధురభాషిణీ! నీ చతురతాపటిమ
నెట్లు బహూకరింపవలెనో తెలియుట లేదు.
విశాఖ —బహూకరించితిరికదా మీ సుహృ
ద్వాక్యములచేత!
కృష్ణ—అట్లయిన నా ధన్యు డెవరో చెప్పు.
విశాఖ—అతడా? చెప్ప నందురా? అతడు
మీవలెనే యుండును. ఆ మెరుగుచామనచాయ, ఆ
కలువకన్నులు, ఆ రూపరేఖలు అచ్చముగా మీవే.
కృష్ణ—ఆ రాధ ఇట్టి సఖితో ఎట్లు వేగు
చున్నదో!

విశాఖ—మీ రిపుడు వేగుచున్నట్లే!
కృష్ణ—రమణీ! నీ పేరేమి?
విశాఖ—నన్ను విశాఖ అందురు.
కృష్ణ—నీవు విశాఖవు కావు—ద్విశాఖవు
సుమా!

విశాఖ—ఎట్లు?
కృష్ణ—ఒక శాఖ రాధమీదను, రెండవది
అన్యునిమీదను వేసి నడుమ నున్నవాని నడికించు
చున్నావు. ..

విశాఖ—మీ హృదయరహస్యము వెల్లడించ లేక మీరే ఉడుకుచున్నారు.

కృష్ణ—విశాఖా! నీవు రాధకు ప్రాణసఖివి కదా!

విశాఖ—అవును. అయితే?

కృష్ణ—నాకును ప్రాణసఖి వై నావు.

విశాఖ—ధన్యురాలను.

కృష్ణ—రాధ నొక్కసారి చూపింపగలవా?

విశాఖ—చూపింతు ననుకొనుడు. అందువలన మీ కేమి ప్రయోజనము?

కృష్ణ—ప్రయోజనమా? చక్షుః ప్రీతి అయినను—

విశాఖ—అందు కింత శ్రమపడ నక్కరలేదు.

కృష్ణ—విశాఖా!

విశాఖ—పొరపాటైన క్షమింపుడు.

కృష్ణ—నా మనస్సు తెలిసికొనలేకున్నావా?

విశాఖ—రాధను ప్రేమించితిరా?

కృష్ణ—నానోట పలికింప నెంచితివా?

విశాఖ—పలికిన నోటి ముత్యాలు రాలును కాబోలు!

కృష్ణ—(నిట్టూర్చి ఊరకుండును.)

విశాఖ—చల్లకు వచ్చి ముంత దాచ నేల? చెప్పుడు.

కృష్ణ—విశాఖా! అది ప్రేమయో ఏమో చెప్పలేను. రాధ—ఆ రాధ నా హృదయము!

విశాఖ—కృష్ణా మీరు! ధర్మమూర్తులు. మీరు—

కృష్ణ—నా అనురాగము ధర్మాధర్మములకు అతీత మైనది — అతీంద్రియ మైనది — ఆధ్యాత్మిక మైనది.

విశాఖ—(సంతోషముతో పూలపుటికనుండి చంపకమాల చేతికి దీసికొని) నేడు మా రాధసుకృతము ఫలించినది. కృష్ణా! ఇదిగో మీ ప్రణయిని—మీ రాధ ఈ నా హస్తములతో తన హృదయాధినాథు నర్చించుచున్నది.

ఇట్లనుచు విశాఖ కృష్ణునిపాదములమీద చంపకమాల నుంచినది. కృష్ణుడు మాల తీసి, మెడలో వేసికొని, హృదయమునకు హత్తుకొనుచు, "విశాఖా—విశాఖా! నీ యుపకృతి—" అని ఏదియో చెప్ప బోయినాడు. విశాఖ అతని మాట కడ్డువచ్చి, "కృష్ణా! నేను మీకు ప్రాణసఖిని గదా! ఇది సఖీధర్మము. అప్పుడే తారకలు గుసగుసలు సాగించినవి. రేపు జాము ప్రొద్దు పోయినతరువాత ఇచటికి దయచేయుడు. ఇక సెలవా! నమస్కారము" అని వెడలిపోయినది.

కృష్ణుడు హర్షోత్ఫుల్లనయనములతో నామె కనబడునంతవరకు చూచి, తరువాత మురళివాయించుచు బయలుదేరినాడు. ఆ మురళి—

"రాధా, రాధా, రాధా, నా
రాగరసైకసుధా, రాధా!"

అని మధురాతిమధురముగా పలుకుచున్నది.

మరునాడు విశాఖ యమునాతీరమున రహఃప్రదేశమందు లతానికుంజములో రాధాకృష్ణుల సమావేశమునకు తగిన యేర్పాటులు చేసినది. సుగంధద్రవ్యములు, కుసుమదామములు మొదలైనవి సిద్ధపరచినది.

ప్రొద్దుగూకినది. జాముప్రొద్దు పోయినదో లేదో పురవీథులు నిర్జనము లైనవి. సౌధము నిశ్శబ్దమైనది. అపుడు విశాఖ రాధ నలంకరింపబోయినది. రాధ అదివరకు ధరించిన అలంకారములు తీసివేసి దానిమ్మపూవువంటి పట్టుపుట్టము ధరించుచున్నది. అది చూచి విశాఖ ఆశ్చర్యముతో, "ఇదేమి, రాధా! నీకోసము రత్నాభరణములను, పరిమళద్రవ్యములను కొనివచ్చితిని. ఉన్న సొమ్ములే తీసివేసితి వేమి?" అని యడిగినది.

అప్పుడు రాధ అనురాగాంచితదరహాసముతో నిట్లన్నది: "నా హృదయదేవతాసాన్నిధ్యమున నా సహజరూపమును, నా నిరలంకృతసౌందర్యమును సమర్పింప సమకట్టితిని. విశాఖా! నాకీ కృత్రిమభూషణము లెందుకు? కృష్ణసేవయే నా కరములకు కంకణములు. అతని మధురాలాపములే నా కర్ణములకు భూషణములు. ఆ ప్రేమైకమూర్తిమీది అకలంకానురాగమే నా హృదయమునకు రత్నహారము. అతని పాదస్పర్శచే పవిత్రమైన పరాగమే నా శరీరమునకు మలయజపంకము. అంతేకాని నాకీ రత్నాభరణము లక్కరలేదు. చంపకమాలను నన్నుగా నెంచి హృదయమునకు హత్తుకొన్నాడన్నావుగదా! కనుక ఒక్క చంపకమాలమాత్రము నా మెడలో వేయుము. దాని సుధాస్మృతితో నాకా హృదయము సమలంకృతము గలదు."

రాధపలుకులకు విశాఖ అద్భుతరసమున నోలలాడినది. కొంతసేపైనతరువాత ఆమె, "సఖీ! నీ ప్రణయ మనన్యసామాన్య మైనది. నీవు ధన్యురాలవు! ఇదిగో, ఈ నీలాంబరము పాదమస్తకము ముసుగు పెట్టుకొని బయలుదేరుము" అన్నది.

నవనవలాడు పత్రములతో, నవ్వుచున్న పువ్వులతో ముద్దులు మూటగట్టు లతాలతాంగివలె రాధ బయలుదేరినది. క్రొక్కారుమబ్బుల చాటున తత్తరపడు మెరపుకన్నెవలె సాగిపోయినది.

కృష్ణుడు పొదరిల్లు చేరి రాధాగమనము నిరీక్షించుచున్నాడు. గాలికి ఎండుటాకులు మర్మరించిన ఉత్కర్ణుడగుచున్నాడు. పిట్టలు రెక్కలు విదిల్చిన కన్నులు విప్పి చూచుచున్నాడు. పైడికంటుల పలుకుల కులుకుచున్నాడు.

విశాఖ రాధను కృష్ణసన్నిధికి గొనివచ్చినది. రాధాకృష్ణులు — పరస్పరజ్యోతిర్మండితముఖమండలులు అన్యోన్య మాలోకించుకొన్నారు. ఆ యాలోకనములు నిర్నిమేషములు; మాధుర్యమునకు బుగ్గలు; పరమసుఖానుభూతికి పతాకటెండ్లు.

కృష్ణుడు ప్రేమోత్కలికతో "రాధా!" అన్నాడు.

ఆ యమృత సంబోధనమునకు పరవశయై రాధ కృష్ణుని చరణములమీద వ్రాలినది. కృష్ణు డత్యాదరముతో రాధను లేవదీసి హృదయమునకు హత్తుకొన్నాడు. ఆ పరిష్వంగములోని ఆనంద మనుభవైకవేద్యము.

ఈవిధముగా రహస్సన్నివేశములు కొలదిగా జరిగినవి. సన్నివేశములు జరిగినకొలది ప్రణయినీప్రణయులకు పునస్సమాగమేచ్ఛ అతిశయింప దొడగినది. వారెంత నిగూఢముగా ప్రవర్తించినను రహస్యము దాగలేదు. మొదట పరిజనములో గుసగుసలు బయలుదేరినవి. తరువాత బంధువులలో పరిభాషణము లారంభ మైనవి. పిదప గృహములో తర్జనములు ప్రాప్తించినవి. అందుచే నిక సమావేశములు జరుగలేదు.

కొంతకాలము గడచినది. విరహాభరముచే రాధ కృశింప నారంభించినది. క్రమముగా వ్యాధిగ్రస్తురాలైనది. అప్పుడు విశాఖ దీర్ఘముగా నాలోచించి మంచి ఉపాయము పన్నినది.

కృష్ణుడు యోగి వేషముతో వచ్చి, రాధను సమీపించి నాడీపరీక్షకై ఆమెహస్తము గ్రహించినాడు. రాధ అతనివంక తేరిపారచూచి, కృష్ణుడని తెలిసికొని సంతోషభరితురాలైనది. ఆమెకరస్పర్శచే కృష్ణుడు పులకితచిత్తుడైనాడు.

ఒకనాడు కృష్ణుడు విరహవిహ్వలుడై యుద్యానవనములో సంచరించుచుండగా నతనికి మంపుతావులు వెదజల్లు సంపెగపువ్వులు కనిపించినవి. వానిని చూచినంతనే అతనికి పూర్వస్మృతి యంతయు ఒక్కసారి తెరదీసినట్లైనది. నాటినుండి అతనికి రాధావిరహము దుస్సహము కాదొడగినది. అది గమనించి, విచారించి కృష్ణుని స్నేహితుడు సుబలుడు గొల్లవేషముతో కనుచీకటిసమయమున రాధావిశాఖలు ఏకాంతగోష్ఠిలో నుండగా వారియొద్దకు బోయి యిట్లు నివేదించినాడు: "రాధా! నేటికి మూడుదినములక్రిందట కృష్ణు డుద్యానములో విహరించుచు—చంపకకుసుమములు చూచినాడు. తోడనే నీవు భాసించినావట! అప్పటినుండి 'రాధా, రాధా!' అని ఒకే విధముగా పలవరించుచున్నాడు. ఇప్పుడు మన స్మృతిలో లేడు. నీ వేమి చేసెదవో! అతని ప్రాణములు నీ చేతిలో నున్నవి."

రాధ ఆర్ద్రనయనములతో, నిస్సహాయతాసూచక దృష్టితో విశాఖవంక చూచుచు నామెవక్షముమీద వ్రాలినది. విశాఖ ఆమెయలకలు దువ్వుచు, చెక్కిళ్లు పుణుకుచు భయము లేదని బుజము తట్టినది. తరువాత నొక్కక్షణములో వారు గోపాంగనావేషములు ధరించి, మధురపానీయకలశములు బుజములం దుంచుకొని సుబలునితో బయలుదేరినారు. సుబలుడు వారిని కృష్ణసన్నిధికి జేర్చినాడు.

రాధ కృష్ణుని తలగడవైపున గూర్చుండి కొంచెముకొంచెముగా పానీయ మందిచ్చినది. విశాఖ తామరాకులు గొనివచ్చి వీచినది. సుబలుడు ప్రక్కన గూర్చుండి మృదువుగా వక్షస్స్థలము నిమిరినాడు.

కొంతసేపటికి కృష్ణుడు కనులు తెరచినాడు. అతని దృష్టి సుబలునిమీద పడినది. తోడనే యతడు, "సుబలా! ఏదీ నా రాధ—నా హృదయము—నా ప్రాణము ఏదీ?" అన్నాడు.

అప్పుడు రాధ గద్గదికోద్వేగములతో "ఇదిగో, మీ చరణదాసి. ఇటు నావంక చూడుడు. అట్లు చూచెద రేమి? నన్ను గుర్తింపలేదా?" అన్నది.

తోడనే కృష్ణుడు డగ్గుత్తికతో, "రాధా, నా రాధా!" అనుచు కరము లామెకంఠమునకు పెనవేసినాడు. వారి యాలోకనము లొండొంటిలో లీనమైనవి.

ఈవిధముగా రాధాకృష్ణులు వివిధోపాయములతో సమావేశములు కలిగించుకొనుచు ఆనందించుచుండిరి.

* * *

అతి పరిచయమున గాబోలు రాధకు అవజ్ఞత అంకురించినది, వారు వా రాడిపోసికొను నిందాలాప

రాజీ వ్రాసే ఉత్తరాలు రాకపోవడం, రాజాని కల వరపెట్టినా, మధుకతల్లో ఏ మేనల్లుడో మేనకోడలో పుడుతుందని ఊహించుకుని తృప్తిపడ్డాడు. దాంతో వెనువెంటనే చిన్నపుడు జరిగిన దృశ్యాలన్నీ ఎదురు తిరిగితే, ఆనందంలో నవ్వుకునేవాడు.

ఆ రోజుల్లో చదువులో ఈ దెబ్బతో విశ్వ విద్యాలయపు పూర్వపు రేకుల్ని పడగొట్టాలన్న ఆవేశం, ఆశతోనే పుస్తకాల్లో పడ్డాడు. తనకి ఒస్తుంది అన్న ధైర్యం ఎక్కడలేని శక్తి పోసింది. రోజులు జరుగుతున్నై.

ఆ రోజు అనుకోనేలేదు. జీవితంలో సుఖాలను, ఆశల్ని, ఉన్నతుల్ని కూడా ఇంకో మార్గానికి తీసుకు వెళ్తుందని. టెలిగ్రాం వచ్చింది. తన తండ్రే ఇచ్చేడు. "వెంటనే బయల్దేరి రావలెను" నమ్మకం కల్గటం లేదు. వారం రోజులైనా పరీక్షలు లేవు. అంత వెంటనే ఎందుకు రమ్మన్నారు? ఇంట్లో అంతా క్షేమమా? రాజీ?...

ఊహకు అందలేదు... ఇక జీవితం మారుతుందన్న ఊహ తడితే, ఆఖరుగా కాలేజీని చూసేడు. ఆ రాత్రే బయల్దేరేడు... దారిలో ఎన్నో భావనలు అర్థం చెప్పేయి. అయినా అవి అతకటం లేదు. ఏదో తక్కువగా, లోపించినట్టే వుండిపోయేయి.

లాంచిలోనే నిద్రపోయేడు... బహుశః పురుడు వచ్చింది. వెంకన్న విషయంలో భూమిపరిష్కారం అవుతుంది కాబోలు అనుకునే కలలు గన్నాడు. తన్ని తీసుకు వెళ్లడానికి రేవుకు పాలేరు ఒస్తాడు. వాణ్ణి అడుగుతా, వాడు చెపుతాడనే లాంచి దిగేడు. పాలేరు రానేలేదు. నడుం విరిగినట్లే అయ్యింది.

పొలాలు అడ్డబడ్డపుడే, ఎరుగున్నవాళ్లు, తన వైపు విచారంగా, జాలిగా, చెపుదామని చెప్పలేక ఊరుకోవడం చూసేసరికి ఖంగారు పడ్డాడు. భయం ఆవరించింది. ఇంటికి వచ్చేసరికి అంత ఇల్లూ తాళాలు పెట్టి, సీళ్లు వెయ్యడం చూసి వెంబేలు అయిపోయి, క్రుంగిపోయేడు.

"ఇల్లు ఒదిలేసేరా?" తలమునకోనివ్వటంలేదు పూర్తిని. ఎవర్ని అడగాలి?... వెనక తిచ్చాటుకుంటూనే గురవయ్య "అబ్బాయిగారా! ఎంత కష్టమొచ్చిందండి. ఈ కాలంలో నిజంగా నాన్నగారికి దెబ్బేనండి... ఎంతలో జరిగిపోయింది..." సానుభూతిగానే అన్నాడు.

అసలు సంగతేదో చెప్పకుండా ఉంచడం పెద్ద కష్టం అన్న భావనలోనే... దుఃఖం వచ్చింది. కళ్లు చెమ్మగిల్లేయి. హృదయస్పందనం ఎక్కువే అయి, డీలా అయ్యేడు.

"కేసేనండి. మూడు రోజులక్రితం జరిగింది... నిన్న స్వాధీనపరచుకున్నాడు. రేపు వేలాం వేస్తారండి... ఆ జమిందారు రాక్షసుడు కనికారం లేకుండానే... అటు వెంకన్న కాపుదీ, ఇటు జామీనున్న మీ నాన్నగారిదీ..."

అవగాహన అయ్యింది. ఆస్తి; దానికోసం మానవులు ఎంత నీచంగా తయారవుతారో బోధపడింది. జీవితంలో అదీ అనుభవమే అయినా, దిగతీసింది...

"నాన్నగారు డీలాయే అయ్యేరు. బెంగతో సగం అయ్యేరండి. పడమటి కొండ్రలో వేసవి చావడిలో ఉన్నారండి" అంటూ జాలిగానే గురవయ్య కన్నీళ్లు ఒత్తుకున్నాడు.

పొలంగట్లమ్మట వెళుతుంటే ఎన్నో సాదృశ్యాలు తలంపుకు వచ్చేయి "పచ్చగా పూలు పూసిన చెట్టు ఓసారి ఎండు మ్రానైపోదూ" అన్న వేదాంతంలో తృప్తిపడుదామన్నా... తన జీవితం? భావి? అసంపూర్ణ విద్య, భుజాలమీద ఇప్పుడుపడ్డ సంసారం, వయస్సుమళ్లిన తల్లీ తండ్రీ...ఈ స్థితికి తండ్రిని తెచ్చిన వ్యక్తులూ, వ్యవహారాలూ...ఆఖరుగా రాజీ... ఏమవుతుంది? తను నిర్దయగా చూస్తూ తలొగ్గవలసిందేనా? మరి ప్రతీకారం?...ఎన్నో అసంపూర్తి రామాయణాలు అల్లకల్లోలం కావించేయి...

ఒక్కటే మిగిలింది...హృదయం అదే కాంక్షించింది. "తన కక్ష సాధించాలి, పగ తీర్చుకోవాలి, అందుకే జీవితాన్ని బలిపెట్టాలి" అనుకునే అడుగులు వేసేడు.

గుమ్మంమెట్లు ఎక్కుతున్నపుడే పార్వతి గొల్లుమంది. రాజీకూడా వెక్కివెక్కి ఏడ్చింది. రాజీ

చూడ్డానికి వచ్చిందా? ఆ ప్రశ్నకి సమాధానం ఆక్షణంలో దొరకనే లేదు. మంచంమీద శిలావశిష్టంగా, రక్తం క్షీణించి పాలిపోయిన తండ్రిని చూచేసరికి గుండె తరుక్కుపోయింది.

జానకిరామయ్య, అంతకాలం బిగపెట్టుకున్న బాధని, ఒక్కసారే చెప్పేడు. తను ఏవిధంగా పతనం చెయ్యబడ్డాడో కన్నీళ్లతో చెపుతూనే "నాయినా! ఏతండ్రీ చెయ్యని అపచారంలో నిన్ను ఒదులు తున్నాను. నేను సంపాదించినదాంతో నీవు యువరాజులాగే జీవిస్తా వనుకున్నా. కాని దేవుడు వేరు విధంగా తలచేడు. నిజంగా నీకు తండ్రిని కాను అన్నట్టే, ఈ చిన్నవయస్సులో పెద్ద మిత్తిని తెచ్చి, నీ లేతహృదయాన్ని గాయపరచేయి ఈ చేతులు... అంతకంటే ఏమీ ఇవ్వలేకపోయేయి...

మాడు...అట్టేకాలం బ్రతుకుతానో లేదో... అమ్మా, రాజిని... నీకు ఒదిలేసి వెళ్లవలసి ఒస్తుందేమో! జీవితంలో ఓ మాధుర్యంకోసం ఎగసిపడి, అందుకో లేక క్రింద పడిపోయేను...ఆ మాధుర్యమే పెద్దపులి అయ్యింది.

వాళ్లిద్దరే మన కున్నది. రాజి...దాని జీవితాన్నంతా చేతులారా దగ్ధం చేసే ననుకుంటా. దాని సుఖం అన్నది ఎంత క్రూరంగా విచ్ఛిన్నమయ్యిందో చూస్తే కడుపు తరుక్కుపోతోంది...మీ అమ్మ...

ఆ గోపాలం..."

అంతకంటె ఎక్కువ చెప్పలేకనే ఆయాసపడి జానికిరామయ్య కళ్లు తుడుచుకున్నాడు. జాలిగా తుమార్పణ ఉన్నట్టే అగ్నికణాల్లోంచి, వేడివేడిగా రెండు కన్నీళ్లు చిలికేయి.

రాజాకి అంతా అర్థమే అయ్యింది. ప్రతీకారం, అటు ఇటు తల్లి తండ్రి, రాజీల నిస్సహాయస్థితికి హృదయపు కోతతోనూ ఊగులాడింది భావి...

* * *

రెండురోజుల తర్వాతనే దివాను అమీనా, ఇద్దరు పోలీసులు, ఇంకో ముగ్గురు నౌకర్ల బందోబస్తుతో జానకిరామయ్య ఇల్లూ, సామానూ వేలం పాటకు సిద్ధమైయ్యేడు. కొంగమాపులతో గోపాలం బావమరదితోనూ, పరదేశి రామారావుతోనూ తయారయ్యేరు. వెంకన్న కంటికి కనుపించనేలేదు. జానికిరామయ్య కొడుకుభుజంమీద ఆనుకుంటూనే కన్నీళ్లు కుక్కుకుని, తన జీవితం ఏవిధంగా కళ్లెదురుగా అమ్ముడైపోతోందో చూడ్డానికే వచ్చేడు. అది తప్పని సరే అయ్యింది.

చేరిన పెద్దమనుష్యుల్లో చాలభాగం "పండంటి సంసారానికి ఎంత కష్టం వచ్చిం" దని వాపోయేరు. కాని గోపాలంపరదేశిలుమాత్రం నాణ్ణంగా తమ ఇంట్లోకి చేరబడే సామాన్లను ఏరుకోవడంలో మునిగి పోయి, పొంగిపోయేరు. తన పేరుమీదుగా పాట పాడిస్తే బాగోదనే, గోపాలం బావమరదికి పురమాయించి ముప్పాతికవంతుసామాను, సగం ఖరీదుకు లోపునే తనపేర కొట్టివేయించుకొన్నాడు. పరదేశి ఉన్న లైబ్రరీని, వేసంలోనే పాడి, ఆ జవహర్ లాల్ జీవితం, గాంధీచరిత్ర, నాగేశ్వరరాయని భగవద్గీత, కాంగ్రెస్ చరిత్రల్లాంటి అమూల్యగ్రంథాలు ఇష్టమొచ్చినట్టు పంచిపెట్టి జానకిరామయ్య కుటుంబంమీద పగ తీర్చుకొన్నాడు. రాజాకి తను కాలేజీలో సంపాదించుకున్న బహుమతులు పుల్లిస్తరాకుల్లా పాడుచేయబడుతుంటే, దుఃఖం, కోపం కూడా వచ్చింది.

జానకిరామయ్యహృదయం నీరే అయ్యింది. అంతమందిలోనూ, వియ్యంకుడు, బావమరిదిచేత తను తన ఖామీద డబ్బుఅడిగినప్పుడు లేదని చెపుతూ, ఇప్పుడు డబ్బు విరజల్లుతూ చవ్వగా కొనడం, పైకి నిరసనగా, హేళనగా తన వైపు చూస్తూ వుండడంతో మండిపోయింది. కోపంలో ఖూనీ చెయ్యాలన్నంత ఆవేశం వచ్చింది. కాని అసమయం అవడంవల్లా న్నే లోపల్లోపలే అణచుకున్నాడు. పైగా దివాన్జీ పదిరోజులు మైము ఇవ్వకపోవుటకు కారణం కూడా ఇప్పుడు తేటతెల్లం అయ్యింది.

వెనక్కు తిరిగి చేలగట్టమ్మట వస్తుంటేనే గోపాలం "రెండుతలలపాము..." అని గొణుక్కున్నాడు జానకిరామయ్య.

ఇల్లు చేరి అలసట తీర్చుకొనే సరికే, గోపాలం రావడం చూచి, తండ్రీకొడుకు లిద్దరూ కూడా ఆశ్చర్య పోయేరు. 'ఎందుకో' అన్న ప్రశ్న కంటె, చేసిన దుర్మార్గంతో సరిపెట్టక, ఈదుర్మార్గుడు, ఇంకా నక్షత్రకుడే అయ్యే డన్న కోపం వచ్చింది. జానికిరామయ్య పళ్లు పటపటా కొరకడం చూచి, పార్వతి 'ఏం పుట్టి ములుగుతుందో' అని భయపడింది; కాని జానికిరామయ్య తమాయింపు ధైర్యం ఇచ్చింది.

చెప్పులు విడుస్తూ "మా చెడ్డ కష్టం వచ్చిందండి బావగారూ. వెంకన్న కొంపు అంత దగాకోరు ముండావాడని కల్లో అయినా అనుకోలేదు. వాడి ఆస్తంతా ఇదివరకే తణఖాలో వుందని తెలియనియ్యకుండా, ఎంత మోసపు ద్రోహపని చేసేడు... దేవుడు ఎప్పటికైనా..." అంటూనే చిక్క మొఖం వేసి, ప్రపంచకంలో జాలి, అనునయింపు ఊసిపదేట్లుగానే మాట్లాడేడు.

రాజు, పార్వతి, జానికిరామయ్యలు ముగ్గురూ కూడా తనమాట విననట్టే విముఖతతో వుండడం తల కొట్టినట్టే అయ్యింది. పైగా వాళ్ల చూపులు "ఇంకేం పనిమీద ఒచ్చేరు మహానుభావా?" అన్నట్టుగా ఉండడం, కోడలు కూడా అదే దృష్టిలో వుండడంతో, తనఎడ వారి గౌరవం ఎంత వుందో కరతలామలకం అయ్యింది.

"బావగారూ! ఈ కష్టసమయంలో మా కోడలు మీ ఇంట వుండడం ఇంకొంచం బరువు...అందులోనూ ఇప్పుడు..." పణికేడు. జానికిరామయ్య పగంలో అందుకుని "ఏమిటీ అన్నావ్" అనడంతో బిక్కచచ్చిపోయేడు గోపాలం.

ధైర్యం తెచ్చుకునే "మా అమ్మాయిని మా ఇంటికి తీసుకు వెళ్లడానికి వచ్చేను" అన్నాడు ముక్తసరిగా.

"మీ అమ్మాయి! మీ ఇంటికిఏ! ముఖం పెట్టుకు అడగడానికి వచ్చేవు? మా సంసారానికి చేసిన ఉపకారంతో మమ్మల్ని ఇల్లా ఉద్ధరించేవని, ఇంక నీకొడుకు దాన్ని ఉద్ధరిస్తాడని అడగడానికి వచ్చేవా! మొఖం ఎల్లా చెల్లిందయ్యా! పండంటి సంసారాన్ని ముక్కలు చేసి, మా పెద్దమనిషిలా ఓదార్చుటకు వచ్చేవు...వెళ్లు...వెళ్లు. సిగ్గు లేదూ?"

నిజంగా జానికిరామయ్య అల్లా మాట్లాడుతాడని గోపాలం అనుకోలేదు. అంతగా తన్ని అవహేళనం చేసుకుంటున్నా డనేటప్పటికి 'అహం' దెబ్బతిని "అయితే, మా కోడల్ని పంపనంటారా?"

"ముమ్మాటికి పంపను."

"పంపరూ?"

"పంపను."

"అయితే దాని పని నేను కోర్టులోనే చూచుకుంటాను" అన్నాడు ఉద్వేగంలో.

"కోర్టులో చూస్తావేం...గాడిదికొడకా...... నాకు చేసిన..." తడబడే పాదాల్తో, కోపంతో ఒణికిపోతూనే, గోపాలంమీదికి వచ్చేడు. రావడంలో నీరసంవల్ల అలసిన ప్రాణం ఉండలేకనే పడిపోయేడు. మంచంకోడు గట్టిగానే తగిలింది...

దాంతో అంతా ఖంగారు పడ్డా... గోపాలం మాత్రం వెనక్కు తిరగకనే, జోళ్లు తొడుక్కుని వెళ్లి పోయేడు. ఆ రోజుమొదలు జానికిరామయ్య మంచం దిగనేలేదు. కలవరింతల్లో జీవితం గడచింది. పార్వతి తన మెడలో వున్న కాసుల పేరు అమ్మి, చెయ్యకల్గ వైద్యసహాయం చేయించినా విఫలమే అయ్యింది.

కొద్ది రోజులు. రెండువారాలు... కళ్లమ్మట నీళ్లుకుక్కుకుంటూనే, రాజీని చూస్తూ... చూస్తూనే... కళ్లు మూసేడు.

* * *

సంసారంకు గుండెకాయ వెళ్లిపోయింది.

క్రూరంగా, మిథ్యల్తో వున్న భావికోసం రాజీ, రాజా, పార్వతులు నిలబడ్డారు.

కర్మ అనేది ఇల్లావుంటే, ఇక సంసారం పర్యావదిలిన కథ. రాజాకి తోకచుక్క అయ్యింది.

* * *

రాజాను గత రెండుసంవత్సరాల్లోనూ చూచినవారు, ఇప్పటివానిని చూస్తే, ఎవరూ ఆతనే అనుకోరు. అప్పటి నవ్వుకళ పోయి పట్టుదల వచ్చింది. మితంగా ఒకటి రెండుమాటలు తప్ప ఎవరితోనూ, ఆఖరుకు రాజితో, తల్లితో కూడా మాట్లాడడం లేదు. గంభీరంగా ఏదో ఓ నిర్ణీతకార్యానికే తను బ్రతుకుతున్నానన్నట్లుగానే ఉండిపోయేడు. కోమటి సురవయ్యదగ్గర నెలకి పదిహేనురూపాయిల జీతంమీద కుదిరి, పైగా ఒకటిరెండు ప్రయివేట్లు కూడా చెప్పడం మొదలుపెట్టేడు. ఆ మొదటి రోజుల్లో, తండ్రిపోయినతర్వాత, తను పునః చదువు కొనసాగించడానికి వీలవుతుందేమో అనుకున్నాడు. కాని వచ్చే చిన్నమొత్తం సంసారానికే సరిపోకుండా వుండడంతో, చిన్న గుమాస్తాగిరీకే తయారై పోయేడు.

నెలనెలకీ తను కష్టపడ్డ శ్రమకు వచ్చిన డబ్బును, బహు క్లుప్తంగా కొంతభాగాన్నే వాడుతూ మిగిలింది పెట్టెలో పెట్టి భావిలో ఎల్లాగైనా, వెంకన్నని గోపాలాన్ని ఉచ్చుల్లో ఇరికించటానికి పనికి వస్తుందనే పిపాసతో తాళంవేసి మొల్లో కట్టుకునేవాడు.

ఇదివరకు వేసిన సిల్కు, పాపలైన్ అన్నీ ఒదిలేసేడు. విజయనగరంలో తను కొన్న చేతిచరఖా ఒక్కటే, తీరుబడి సమయాల్లో ఆతనికి, అటు జీవచ్ఛవి పార్వతికి, దగ్ధహృదయ రాజికి శరణ్యం అయ్యింది. దాంతో పైనో అంగవస్త్రం, క్రిందో అంగవస్త్రం, ఎప్పుడైనా ఓ బనీనతోటే కాలం గడిపేడు. రాజీని చూచి మొట్టమొదట్లో పార్వతి బెంగపడింది. కాని సంసారంను పునరుద్ధరణ చెయ్యాలన్న ఆతని దీక్ష సఫలీకృతం కావాలని నెమ్మదిగానే జాలి, ప్రేమల్లో కన్నీళ్లు తుడుచుకునేది.

అన్నగారు అల్లా ఉండడం రాజికి చాలా కష్టంగానే వుంది. మొదట్లో తన పగిలిన హృదయాన్ని అనునయింపు చేస్తాడని ఆశించింది. ఎప్పుడైనా 'రాజీ!'అని పిలిచి చిన్నప్పటి మాధుర్యంతో కవుర్లు చెప్పి, ఓదారుస్తాడు అనుకుంది. కాని రాజా మారనేలేదు. దీంతో అటు అత్తగారి ఆదరణ, ఇటు భాతృప్రేమ, భర్తనిరాదరణ, అమ్మశోకం, అన్నిట్లకీ తలోమాదిరిగానూ దూరమైపోవడంతో, ఒంటరిగా ఉండలేక, దేన్నో కాంక్షించేది. వెతపడేది. ఒక్కొక్కసారి 'తను అత్తగారింటికి వెళితే'...అనుకున్నా "భర్త కిరస్తానీదానితో..."అన్న భావన దేవదానవుల సముద్రమథనమే చేసింది.

ఆరోజు మామూలుగానే సురవయ్యకొట్టుకు వెళ్లేడు. సురవయ్య ఇటు ఆశ్చర్యంలో తిరుగుతూనే "విన్నారా అబ్బాయిగారూ"అని శరీరం అంతటితోటీ ప్రశ్నించేడు.

"ఏమిటి?"

"మీ బావగారు ఆ మిరియేల్ తో లేచిపోయాట్ట...ఇంట్లో నగదు కూడా..."

ఒక్కసారి ఆశ్చర్యం వుమిలినా, వెనువెంటే దుఃఖం ఓప్రక్క, సంతోషం మరోఎడ ఆక్రమించుకుంది. "మంచి పని జరిగిందిలే" అన్నాడు.

ఈ మాటలు సురవయ్యని ఆశ్చర్యపరచేయి. స్వంత బావమరిదే ఇల్లా అనడంతో 'ఏం అల్లా అన్నారు' అన్నట్టే చూచేడు.

"సురవయ్యా! నక్క కడుపున నక్కే పుడుతుంది. కృతఘ్నుడి కడుపున కృతఘ్నుడే పుడతాడు. దానికి విచారించడం ఎందుకోయ్!" సురవయ్యకి ఈ వేదాంతం అర్థం కాలేదు.

భావికి మంచి సూచనలు కన్పించినా, రాజీ జీవితం అధఃపాతాళానికి కృంగి, గాలిలో అల్లాడే దూదిపింజ అయినందుకు ఆరాటనతోటే, సాయంత్రం వరకూ కేంద్రీకృతి లేకుండానే పనిచేసి ఇంటికి వచ్చేడు.

కాళ్లు కడుక్కుంటున్నప్పుడే పార్వతి "రాజా! వాళ్ల సీతమ్మ వచ్చిందిరా?"అంది.

"ఏ సీతమ్మ."

"రాజీ అత్తగారు."

"ఎందుకు వచ్చిందేమిటి!" ఈసడింపు ఉందనే ఉంది.

"పెద్దదై పోతోందని, వంట్లో జవసత్తువలు తగ్గేయని, ఇంట్లో ఇంకో ఆడదిక్కు లేకపోవడంవల్ల, రాజీ చూచుకోకపోతే ఇంకెవరు చూస్తారని నానా విధాల చెప్పుకుని ఏడ్చిందిరా."

"పంపమందా?"

"కళ్ల నీళ్లతోటే అడిగింది."

"అయితే నీ ఇష్టం"

"అది కాదురా! ఒక్కర్తె ఆడపిల్ల... అది కాస్త సుఖపడుతుందేమో అని" కళ్లు తుడుచుకుంటూనే అంది.

"నీకు ఇష్టంగా వుంటే పంపు... నన్ను అడగడం ఎందుకు?"

"అల్లా అంటే సరా... నువ్వు ఓపారి రేపు వెళ్లి..."

సగంలో అందుకుంటూనే "నేనా! ఏముఖం పెట్టుకుని వెళ్లమన్నావ్? నాన్నని నిలువునా స్మశానానికి ఈడ్చిన ఈ రాక్షసుడి ఇంటికి వెళ్లి 'మా చెల్లెల్ని తీసుకువచ్చేను, ఏలుకోండి' అని ఎల్లా చెప్పమన్నావ్? చచ్చిపోయేటప్పుడు నాన్న ఏమని ఏడుస్తూ చచ్చేడో జ్ఞాపకం లేదూ? నీకు తెలియలేదన్న మాట. బ్రతికినన్నాళ్లూ రాని సీతమ్మ ఇప్పుడు ఎందుకు ఏడుస్తూ అడగడానికి వచ్చిందో. వాళ్లబ్బాయి ఆ కిరస్తానీదాన్ని లేవదీసుకుపోయేడు. ఈ వార్త మీ చెవుల్ని పడితే అసలు పంపరేమో అని ముందుగా వచ్చింది. పంపమని. కావలిస్తే ఇంకొకపారి ఏడుస్తుంది కూడాను. ఏం అమ్మా! రాజీని ఆ కిరస్తానీదానికూడు తింటూ, భర్తకి సపర్యలు చేస్తూ సుఖపడుతుందని పంపమన్నావా? సవతి కాళ్లు పడుతూ, వంటలక్కలా, దాసీదానిలా ఉండి ఆనందిస్తుందని పంపమన్నావా?" రాజు తెలియని ఉద్రేకంలోనే అన్నాడు.

పార్వతి వెన్నువిరిగినట్టే ఆ వార్త తీసింది. ప్రపంచం అంతా ఇంత విపరీతమై వుందా! కడుపు శోకంలో, నడివయస్సు రాజీ జీవచ్ఛవం చేయబడ్డంతో బావురుమనిపోయింది.

గోదావరికి నీళ్లకు వెళ్లి తిరిగి వస్తున్న రాజీ తల్లి దుఃఖం గజిబిజిచేసినా అది నిత్యకృత్యమే అవడంవల్ల అంతగా పాటించకనే అన్నగారితో 'నీళ్లు పోసుకో'మని చెప్పింది.

ఆ క్షణంలో రాజీని చూస్తే రాజుకు ఆవేదన కల్గినా, దుఃఖం వుమిలినా, పగ మాత్రం గోపాలం ఎడ ఎక్కువనే అయ్యింది. ఏం చేస్తున్నాడో కూడా తెలియనే లేదు.

"రాజీ!"

అన్నగారు ఎన్నాళ్లకి పిలిచేడు అని సంతోషపడిపోయింది. జీవితాన్ని ఎన్ని దుఃఖాలు ఆవరించినా, అనోటి పిలుపు అమృతమే.

"నీకు ఇచ్చిన భగవద్గీత పట్టుకురా అమ్మా"

ఎందుకో అని అనుకున్నా. ఆ క్షణంలో ఆవరించిన ఆనందం మైకం కమ్మింది. తెచ్చింది.

"రాజీ! నిన్నొకటి అడుగుతాను. భగవద్గీతతో ప్రమాణం చేస్తావా?"

అన్నగారు తెలివితక్కువగా ఏ విషయంలోనూ ప్రవర్తించడని తెలుసు. అయినా, ఆతృత మెరసింది. తలూపుతూనే "అల్లాగే"

"భగవద్గీత ముట్టుకుని... ఈరోజు మొదలు నేను గోపాలం ఇంటికి వెళ్లను. ఆఖరుకు పరదేశితో అయినా మాట్లాడను... వాగ్దానం చెయ్యి."

అందులో ఎంత క్రూరం ఇమిడివుందో అని ఒణికిపోయింది. పార్వతి కొడుకు ఎంత భీకరంగా తయారవుతున్నాడో అని కుమిలింది.

"చెయ్యి రాజీ!"

రాజీకి ఇతరమార్గం ఏమీ లేనట్టే వుంది.

"నాన్నగారి ప్రాణం నిలువునా తీసేరు వాళ్లు. తెలియనూ? నీ మామ మన ఆస్తినంతా కలుపుకుని రాక్షసుడే అయ్యేడు. నీభర్త కిరస్తానీదాన్ని పెళ్లి చేసుకుంటాడు. ఇల్లాంటివాళ్ల మీద మమకారం ఒదల్లేదు? నాన్నగారు ఏడుస్తుంటే..."

కుమిలిపోయే మధ్యలో వినలేకనే "చేస్తాను అన్నాయ్" అని కేకేసింది.

ప్రపంచకంలో స్త్రీయే దుఃఖం మొయ్యాలని దేవుడు వ్రాసిపెట్టేడా? తన జీవితంలో ఆ గతించిన చిన్నతనం, సంసారంలోని మొదటి రెండువత్సరాలే సుఖాంశపు చిహ్నాలు. తర్వాత పరిస్థితులు తన్ని దుఃఖదేవతచేతుల్లో పెట్టేయి. ఇంకా నవ్యత్వం ఆశించుకున్నా అది రాదు. దూరం అయ్యింది. ఇల్లాంటి బ్రతుకులో ఎందుకు జీవించడం అని చాలాసార్లు అనుకుంది...అన్నగారే ఎదురుతిరిగితే...

ప్రమాణం చేసింది కన్నీళ్లు కారుతుంటేనే— ఇప్పుడున్న స్థితికంటె ఇంకో ఏ నీచస్థితీ రాదు. వచ్చినా భరించగలదు అన్న విరక్తిలోనే.

“మాట తప్పితే......ఇక నీకు జీవితంలో అన్నయ్యగడప త్రొక్కడానికి హక్కు లేదు రాజీ” అంటూనే లోపలికి వెళ్లేడు.

తల్లీకూతుళ్లు ఒకళ్ల కౌగిట్లో ఒకరు ఏడ్చేరు— స్త్రీగా సృష్టించడమే భగవంతుడు ఎన్నో పాపాలు చేస్తేకాని చెయ్యడని.

* * *

ఎగుడుదిగుడుల రోజుల్తోనే జానకిరామయ్య సంవత్సరీకం వచ్చేసింది. పైరుగాలి పెనుగాలిక్రిందే అయ్యింది.

ఆరోజుల్లో రాజా తను పాముపుపెట్టే డబ్బుకు పార్వతి, ఇంకెవ్వరున్నారు అని ఇచ్చిన బంగారాన్ని అమ్మి జతచేసి, చిన్నచిన్న అప్పులిస్తూ, నోటులు వ్రాయించుకుని వసూళ్లు చేస్తూనే, చెరువుల్లో కొద్ది నీరును వర్షం కురిసిన తర్వాతలాగే చేసేడు.

అంత త్వరలో రాజా వడ్డీవ్యాపారంకు మదుపు పెట్టగలుగుతాడని ఎవరూ అనుకోలేదు. తెలిసి ఆశ్చర్య పడ్డారు. కోమటి గురవయ్య శిక్షణ, తండ్రి గడుసుతనం, తన వ్యవహారదక్షత ఉన్న చదువు కలిపి, అతను మనుష్యుల్ని ఎల్లా రాబట్టుకోవాలో తెలిసినట్టే వుండే వాడు. గోపాలంకు ఇది ప్రక్కలో బల్లెంలాగే వుంది.

పైగా పరదేశి దగాచేసి పోయేడు. వార్థక్యంలో చెయ్యి ఆసరా పూర్తిగా పోయినందువల్ల, వ్యవహారం స్తబ్ధే అయ్యింది. ఇనప్పెట్టి తెరచేటప్పటికి గుండె గుభేలుమనేది. పూర్తిగా వ్యాపారం మానేయ్యవలసి వచ్చినా, జానకిరామయ్యకొడుకు పూనడం, అరికాళ్లక్రింద మంటలుగానే వుంది. పరదేశి క్రైస్తవమతం పుచ్చుకున్నాడని చూచాయగా విన్నాడు. పైగా వాడి మూలాన్ని పేటలో తిరుగుటకే తలవంపు అయ్యింది.

ఆ రోజుల్లో గోపాలం లేకపోవడంతో, రాజా విజృంభించేడు. డబ్బు కాబూలీవాడిలాగే అప్పు ఇవ్వడం, వసూళ్లు చెయ్యడంతో కొంతమంది విరోధుల్ని ఏర్పరుచుకున్నాడు కూడాను. ఇక ఆ పిపాస నిర్మొఖమాటంగా జప్తులు చేయించడంతో కోర్టుపక్షే అయ్యేడు. ఇల్లా ఉచ్చుల్లో తగిలినవాళ్లు, గోపాలం మద్దత్తులో, ఏ సమయమందైనా డబ్బుతియ్యాలనుకున్నవారు లేకపోలేదు. ప్రత్యేకంగా కాపుది చేనుమీదనే జప్తు చేయించి, ఒక్క గింజ, ఆఖరుకు గడ్డయినా లేకుండా, వేలం వేయించడంతో వాడు పగే పట్టేడు. తండ్రికి చెడబుట్టేడని అనుకున్నా, ఊరుఊరంతా కోడై కూసినా, రాజా తను చేసిన ఈ జప్తులో, గోపాలం, కుడిభుజమైన కాపుని వంచడంతో, దెంపపెట్టే అనుకుని గర్వపడ్డాడు. ఆ రోజుల్లో తండ్రిసామాను ఏమేమి పోయిందో, అన్వంతా కొనడం ప్రారంభించేడు. దీనికి పార్వతి, రాజీ ఓ ఎడ సంతోషించినా, విన్న మాటలు విని భయపడ్డారు.

కొవ్వూర్వారు ఆరోజు దివాను దగ్గరకి రాజా వెళ్లేడు. తల్లీ చెల్లెళ్లకు ఎందుకు వెళుతున్నాడో తెలుసు. తండ్రిగారు అమ్మిన ఇల్లు జమీందారు అమ్మేస్తే కొనుక్కుందామన్న ఉద్దేశ్యంతోనే వెళ్లేడు. ఆ మాటల్లో పాటివాడు కనుక దివాను, తనకి చెయ్యతగ్గ సహాయం చేస్తానని వాగ్దానం ఇవ్వడంతో, తండ్రి ఆత్మకు శాంతి చేకూరుతుంది అనుకునే సంతోషంలో, ఈ వార్త అమ్మకి, రాజీకి చెప్పాలని వెనక్కు తిరిగి, త్వరగానే వచ్చేడు. ఎప్పుడు చెబుదామన్నంత ఆతృతలో హృదయం ఆయత్తపడింది.

పగందారిలోనే గురవయ్యఎదురై “అబ్బాయిగారూ ఎంత పని జరిగింది...మీ బావగారికి చాలా పెద్ద

దెబ్బ తగిలిందండి. వస్తుంటే గుర్రబ్బండి తలక్రిందులైందట...అమ్మాయిగారు ఏడుస్తూనే గోపాలంగారింటికి వచ్చేరండి...నేనే పరిగెత్తుకుని వెళ్లి అమ్మగారితో చెప్పేను..." జాలిపడి ఆత్మీయత తీర్చుకున్నాడు.

రాజి వెళ్లిందా? ఒక్కసారిగా ఒళ్లు కుతకుతమంది. తను అప్పటివరకూ ఎంత సంతోషంలో వున్నాడో, అదంతా తుంపుల్లే అయ్యింది...మాట్లాడకనే అడుగులు వేసేడు. ఈ మనిషి ప్రవృత్తి ఏమిటా అనుకునే గురవయ్య దిగజారిపోయేడు.

దారిపొడుగునా "రాజి వాగ్దానం నిల్పుకోలేకపోయింది. వంశానికి కళంకం. తండ్రికి అపచారం... తన్ను ఓ మూఢుడి క్రింద జమ చేసింది..." అవే ఆలోచనలు. ఆందోళనలు. గుమ్మం ఎక్కుతూనే "అమ్మా! రాజి ఏదే!" గంభీరంగానే అన్నాడు.

పార్వతి గాబరాలో ఒణికింది. మాట్లాడలేకపోయి కళ్లుమాత్రం వప్పగించింది. చొప్పకట్ల తలుపు చప్పుడవడంతో వెనక్కు తిరిగేడు...రాజి...తల్లి ప్రాణం "తల్లీ ఓ పదినిముషాలముందైనా రాలేకపోయేవా?" అని ఏడ్చింది.

"ఎక్కడికి వెళ్లేరు రాజ్యలక్ష్మమ్మగారూ?" తన్ని పూర్తిపేరుతో పిలవడం ముందు రాబోయే తుఫాన్నే చెప్పింది. దెబ్బతగిలినవాళ్లకే దెబ్బలు తగులుతాయి అనుకునే మాట్లాడలేకపోయింది. ఆ క్షణంలో ఏం చెప్పాలి? ఎల్లా చెప్పాలి? తెలియనే లేదు.

"ఎందుకు వచ్చేరు తిరిగి? అక్కడనే ఉండలేకపోయారా? నాన్నగార్ని చంపిన ఆ రాక్షసకొంపలోనే ఉండి, నువ్వు ఓ విసురు విసరలేకపోయావా? చూడ్డానికి వచ్చేవా? వెళ్లు. ఈ రోజుమొదలు నీకు ప్రపంచంకంలో ఓ తండ్రీ చచ్చేడు, దానితో ఓ అన్నయ్య చచ్చేడనుకో......మీ అత్తగారింటికి వెళ్లండి రాజ్యలక్ష్మమ్మగారూ."

మగాడుగా జన్మించినందువల్లే హృదయాలు ఎంత క్రూరంగా, పరిస్థితుల విచక్షణలు లేకుండా తయారవుతాయో రాజి గ్రహించింది. నిజంగా, తను కష్టపడ్డా, చచ్చినా, తాళికట్టినందుకు కృతజ్ఞత కాదు, ఋణం అక్కడే తీర్చుకోవాలి; కాని విభిన్న పరిస్థితులు తన గతినే మార్చేయి. ప్రతీ గ్రహం దాని దశ అన్నట్టే నూత్న అధోగతులకే దారి తీస్తోంది జీవితం...ఏ నక్షత్రంలో పుట్టిందో...నవ్వు, ఏడుపు కూడా వచ్చేయి...

పార్వతి మాట్లాడలేక గుడ్లమ్మట నీళ్లు కుక్కుకుంది. అణగి మణిగిన జీవితమే, జీవచ్ఛవంగానే గడుపుతోంది. తన కళ్లెదుటగా తన పూర్వజన్మఫలం అనుభవిస్తోంది.

"ఇంకేనా?" హృదయంల్లోంచే దీనంగా రాజి. "ఇంకేముంది...వెళ్లు...వాళ్ల ఇల్లే నీ ఇల్లు...ఇక నా యింటికి రాకు...ఋణం తీరిపోయిందే అనుకో..."

ఆ వాక్యంకు పార్వతి బావురుమనిపోయింది. కన్నీళ్లు కారుతుంటే "అన్నయ్యా! వెళుతున్నా... నువ్వు మర్చిపోయినా నేను నిన్ను మర్చిపోలేను. వెళతా...ఒక్కసారి......ఆఖరిసారిగానే అడుగుతున్నా......రాజీ అని నోరారగా పిలవ్వూ... అంతకంటె ఏమీ అడగనేలేను..."

"నేనాండి రాజ్యలక్షమ్మగారూ...పిల్వడం... వెళ్లండి...అంత ముద్దుగా పిలిచేవాడు మీ ఆయన వున్నాడు లే..."

ఎంత వెర్రిగా ఆశించిందో, అంతగాను నడుం విరిగిపోయింది. నడిచింది. తను బ్రతికివుందా? చచ్చిపోయే నడుస్తోందా? వెనకాల పుట్టిల్లు దూరం అయిపోయింది. జీవితంలో రాదు, లేదు. ఆశ క్షణికం అన్నయ్య పిలుస్తాడేమో అని...వెనక్కు చూచింది. లేదు...గుండెలు గోలెట్టేయి...వుక్కిరైయ్యే దుఃఖంతోనే అడుగులు వేసింది.

* * *

ఆ రెండు నెలల్లోనూ రాజు పరదేశిని నాల్గైదు సార్లు చూచేడు. మొఖంమీద దెబ్బలమచ్చలతోనూ, నీరసించిన శరీరంతోనే చూచేడు. పలకరించాలి

అన్న జిజ్ఞాసనే చంపుతున్నాడు. అప్పుడప్పుడు, గురవయ్యమాటల్లో 'ఇప్పుడు కొంత కుదుటపడ్డాడు' అని విన్నా, రామారావుస్నేహం ఒదులుకోకపోవడంతో, ఏరోజుకైనా, ఆ గతించిన ఛాయలు పోవన్న భావన లోనే ఉండిపోయేడు. ఏ ప్రశాంతసమయంలోనో, రాత్రిళ్లు, ఆ చిన్నతనపు రాజితో తన జీవితం జ్ఞాపకం వచ్చినా తండ్రి చచ్చిపోతూ ఒప్పగించిన పగ, ప్రతీకారము వాటిని పెంపొందించలేకపోయింది. రాజిని చూడనేలేదు.

పార్వతి ఆరోజుమొదలు లోపల్లోపలే కృశించి పోయింది. ఒక్కకడుపున బుట్టినా అన్నా, చెల్లెళ్ల జీవితాలు ఎంత విరుద్ధంగా తయారైయ్యేయో చూచి వాపోయింది. కర్మ అనే సిద్ధాంతాన్ని ముడివేసుకుని ఓదార్పు చెప్పుకున్నా, "వాళ్లిద్దరూ కలుస్తారా!" అన్న కడుపుతీపి ఒదలలేకపోయింది. ఇంట్లో పనుల వల్ల తీరుబడి లేకనే పార్వతి రాజిని చూడ్డానికైనా వెళ్లలేకపోయింది.

ఆ దాళవాపంటలకోతల్లో రాజుకు ఊపిరిసల పనేలేదు. ప్రథమపంటలోని బాకీలకు, జప్తుసమనులకు కోర్టులకు తిరగడం, అమీనాని పిలిపించడం, వేలాం వేసి,సంతోషంపడుతూనే, తండ్రిమీద ఈ ప్రపంచకం చేసిన కృతఘ్నత తీర్చుకున్నాడు. ఆ హడా విడిలా అవగానే, ఉన్న డబ్బు లెఖ్ఖచూచుకుని, తన ఇల్లు కొనడానికే, దివాన్ దగ్గరకి వెళ్లేడు. తల్లితో ఈ సంగతి చెప్పినపుడు ఆమె సగం జీవం వచ్చినట్టే అయ్యింది...

ఆరోజు సంతోషం పట్టలేకనే, రాజికి కబురు పంపించి "మీ అన్నాయి కొవ్వూరు వెళ్లేడు, రేపటికి గాని రాడని" ఆ మాతృస్థానం కళ్లు కాయలు కాచి నట్టే రోదించి, ఎదురు చూచింది. ప్రతీసారి చొప్ప కట్టతలుపు చప్పుడైనపుడల్లా, 'రాజీవచ్చిందనే వెళ్లి చూచింది. ఎప్పుడు, ఎప్పుడు అన్న ఆ హృదయపు ఆక్రందనలో, అంత దూరంలో రాజిని చూడగానే, పరుగెత్తుకువెళ్లి కౌగలించేసుకుని ఏడ్చేసింది. అందు లోని వియోగసంయోగానికి పాలు చే పొచ్చి, హృద యానికి హత్తుకునే కరగిపోయింది.

"అమ్మా! అమ్మా!" అంటూ రుద్ధంలో రాజి పిలుపు వినేసరికి, ఇంక ప్రపంచకంలో తనకి ఏమీ అక్కరలేదు. ఆ క్షణంలో భగవంతుకు మృత్యువుని ప్రసాదిస్తే చాలని అనుకుంది. పొదివి పట్టుకునే ఇంట్లోకి తీసుకు వచ్చింది.

మధ్యలో 'చిక్కిపోయేవ్! మీ అత్తగారు ఏమంది? ఆయన సరిగ్గా వున్నారా?' అటువంటి ప్రశ్నల్లోనే, అన్నగారు ఆ ఇల్లు కొండానికే వెళ్లే డన్న వార్త చెప్పింది. ఆరాత్రి రాజికి ఎంతో ఇష్ట మనే వంకాయకూర వండింది. సగ్గుబియ్యపు వడి యాలు వేయించింది. తన చేత్తోనే పెట్టి రాజి ఇంకా ఎడపిల్ల అన్న భావనలోనే సంతోషించింది. నిజంగా పార్వతి జీవితంలో కాందిశీకే అయ్యింది. ప్రియంగా ప్రేమించేవాళ్లు కరువే అయిపోయేరు...ఇప్పుడో అన్నం రొట్టె ఇస్తే, దూరంగా పోయి, ఒకరు దొంగిలిస్తారు అన్న భయంతోనే తినేందుకు ప్రారం భించినట్లే అయ్యింది.

ఆ రాత్రి తన ప్రక్కనే పడుకోబెట్టుకుంది. అనుకోకుండానే, విప్పారిన ఆకాశంలో ఫెళఫెళ మంటూ ప్రళయం వచ్చినట్టే రాజా వచ్చేడు. తలుపు పిలిచేసరికి, పార్వతి హడలిపోయింది. త్వరత్వరగానే కునుకుపడుతున్న రాజిని లేపి, వంటింట్లో చాప పరచి, పడుకోబెట్టి, తలుపు గొళ్లెం వేసి, వీథిద్వారం తెరచింది.

"దివాన్ మద్రాస్ వెళ్లేడుట. జమిందారుతో మాట్లాడేను...రెండు రోజులు వెళ్లి నతర్వాత..."అని మంచంమీద నడుం వాల్చేడు.

వంటింటివైపు భయంలో చూస్తూనే, అక్కడే మేను వాల్చి, రాజిని ఎల్లా తప్పించడమా అన్న ఆలో చనలో పార్వతీ, అటు అన్నగారిమొఖం కనీసం ఓసారి చూడాలి, చూడగలనా అన్న భాతృ ప్రేమలో రాజీ...ఆలోచిస్తూనే కునుకు తీసేరు... ముగ్గుర్ని మైకం ఆవరించేసింది...

రాజా కొవ్వూరినుండి తిరిగి వచ్చేడు, ఇంకవ రికి ఎసరుపెట్టడానికి అన్న వినపుమాపుల్తోనే,

ఆరాత్రే దెబ్బతిన్న పాములన్నీ తలలు ఎత్తేయి. చాటుగా వెంకన్న వెళ్లి గోపాలంను సలహా అడిగేడు. ఆయనా తలూపేడు. అంతే! ఒక్కొక్కళ్లు తిండి లేకుండా చేసినందుకు, స్థలాలూ, పెళ్లాల పుస్తెలూ అమ్మించినందుకు రొమ్ములు కుతకుతలాడుతుంటే, కడుపుమంటల్తోనే, అర్ధరాత్రి బయలుదేరేరు...

గడ్డిబొద్దు మాత్రం వెలిగింది చీకట్లో...

ఒక్కసారే గాలి వియ్యడంవల్ల, దుబ్బుగడ్డి ఇల్లు వలుచూలలా క్రమ్ముకుపోయింది. మెలుకువ వచ్చేసరికి రాజుకు దారీ తెన్నూ తెలియనేలేదు. పార్వతిమాత్రం 'వంటిల్లు'అనే అనగలిగి, పందుగా పెట్టి పైకి తీసుకువెళ్లడానికి ప్రయత్నించింది.

వంటిల్లుపమ్మం తెరిచేడు...ఎదురుగా...... జీవంతో...రాజీ...చుట్టూరా మండుతున్న పెంకలు.

ఒక్కసారి రాజుకు ఆ క్షణంలో హృదయం సులుముకుంది. కమ్మెచ్చులో పడ్డట్టే బాధపడ్డాడు... రాజీ...తన చెల్లెలే...తను చేసిన అపచారం ఎదురుగా తాండవించింది. తన సోదరికి తనే...అన్నీను... చేసి...పెర్రి పగల్లో...తను సాత్వికంగా నడిచి వుంటే...

"అన్నయ్యా!"

"రాజీ!"

ఒకర్ల కౌగిట్లో ఒకర్లు స్మృతే తప్పేరు. ఆ క్షణికంలో స్వర్గమే...చెవిదగ్గర... "రాజీ!... రాజీ" అని రాజాహృదయం గోలెట్టింది.

"మనం దేవతలం కాదూ అన్నయ్యా!"

"అవును రాజీ!"

అంతే...అగ్నిదేవుడు తన తేజస్సులోనే కలుపుకున్నాడు. అందులో బాధ లేదేమో! ఆ వేదన, పగ కనుపించలేదేమో! పూర్ణసౌఖ్యం...స్వర్గం...

ఆఖరుకు మృత్యువైనా వాళ్లని విడతీయలేకపోయింది...

* * *

కాలం జరుగుతోంది...



# మహాత్ముని హత్యలో పర్వప్రభావము

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

సూర్యకుటుంబములో కుజ, బుధ, గురు, శుక్ర, శనులను మన ప్రాచీనులు 'తారాగ్రహము' లనిరి. నూతనగ్రహములగు ఇంద్రావరుణులనుసయితము ఇపుడు మనము తారాగ్రహములపట్టికలో చేర్చవచ్చును. ఈ తారాగ్రహములవలె మన భూగోళము సయితము సూర్యునిచుట్టును నియమితకక్ష్యామార్గమున నిరంతరము తిరుగుచున్నది. కావుననే, పాశ్చాత్య ఖగోళశాస్త్రజ్ఞులు భూమిని గ్రహమనియే వ్యవహరించుట. చంద్రుడుమాత్ర మట్లు కాక మనభూమికి చుట్టు తిరుగుచున్నాడు. అగుటచే, తారాగ్రహములతో మాత్రము మనభూమికి సమానస్కంధత కలదు. చంద్రుడన్ననో, భూమికి అనుచరుడు—ఉపగ్రహము. కావుననే, గ్రహజాలమంతటిలో మనభూమికి రవిచంద్రులతోనే హెచ్చుగా సంబంధ ముండుట. రవి మన యజమానుడు; చంద్రుడు మన భృత్యుడు; ఇతరగ్రహములు మన బంధువులు. ఈ ధర్మమును గుర్తించితిమేని, మన సామాన్యజీవితముతో రవిచంద్రులకు ప్రబల సన్నిహిత సంబంధ ముండుట వింతగా తోచదు. మన పంచాంగములలో తిథి, నక్షత్ర, యోగ, కరణములు నాల్గును తాత్కాలికరవిచంద్రుల స్థితిసంబంధములను తెలుపునట్టివే. రవిచంద్రులు అనుకూలస్థితిని చూపనినాడు—అనగా, పంచాంగశుద్ధి లేనినాడు—ఏ శుభకార్యము కాని జరుపుట శ్రేయస్సుకాదని ప్రాచీనమహర్షులు శాసించిరి.

తారాగ్రహములకు దైనికసంచారమువలన పరస్పరముగా సంభవించు సంయోగవియోగాదిసంబంధములవలన కలుగు ఫలములను కూడ మన భూమి అనుభవించుచున్న దనుట వాస్తవమే. బంధువుల సుఖదుఃఖములలో మనకు భాగ మున్నది కదా! కాని, రవిచంద్రుల సంయోగవియోగములే తాత్కాలికముగా మనకు ప్రబలమైన సన్నిహితఫలము నిచ్చునట్టివి. ఇవే అమావాస్యాపూర్ణిమలు. వీనినే పర్వదినము లని మన ప్రాచీనపండితులు వ్యవహరించిరి. అమావాస్యనాడు సూర్యచంద్రు లిరువురును ఏకరేఖలో నిలిచి, ఒకవైపునకే భూమి నాకర్షింతురు. పూర్ణిమనాడు వీరు పరస్పరము ఎదురుగా నిలిచి, నడుమ నున్న భూమిని చెరియొకవైపునకు లాగుదురు. అగుటచే, అమావాస్యాపూర్ణిమలలో రవిచంద్రుల కిరణఘర్షణవలన ఆకాశరంగమునందు జనించునట్టి అపారశక్తి మనభూమిపైన గొప్ప అధికారము కలదు. ఖగోళములో శనిగురువుల సంయోగము గొప్ప శక్తి కలదే. దాని ఫలములో కొంత, కాలక్రమమున, మన భూమికి సయితము వ్యాపించవచ్చునే కాని, వెంటనే వ్యాప్తికి రాదు. అమావాస్యనాడు కాని, పున్నమనాడు కాని సముద్రములో గొప్పకల్లోలములు బయలుదేరునట్లుగా, ఇతర గ్రహసంయోగవియోగములు కల దినములలో జరుగదనుటే దీనికి తార్కాణ. భూకంపములు, విమానపతనములు, రైలుబండ్లప్రమాదములు, సాంఘాతికమరణములు మున్నగు విశేషసంఘటనలు, సాధారణముగా, అమావాస్యాపూర్ణిమల ఫలముగనే సిద్ధించుచున్నవి.

అది యట్లుండె. జాతకశాస్త్రమునకు సంబంధించినంతలో, ఈ పర్వములకు గొప్ప ఫలమున్నది. వ్యక్తిజాతకములలో దశలవలన ఉద్బోధితములగు శుభాశుభఫలములను కార్యరూపమునకు తేగల శక్తి ఈ పర్వములకు గలదు. అనగా, దశలలో ఫలప్రదములుగా ఏర్పడిన గ్రహములయొక్క జన్మకాలికస్థానములపైన గాని, లేక చలితస్థానములపైనగాని రవిచంద్రుల సంయోగమో, వియోగమో సంభవించెనేని, సాధారణముగా రెండువారములలోపలనే, తాత్కాలిక గ్రహచారమున కనుగుణముగా, జాతకులకు ఫలము కానవచ్చు ననుట అనుభవసిద్ధము. జన్మలగ్నము ఏ భాగలో నున్నదో ఆ భాగపైన కాని, జన్మచంద్రస్థానపు భాగపైనగాని పర్వము వచ్చినచో, జాతకులకు, సామాన్యముగా, ఆరోగ్యభంగము కల్గుట తప్పదు. అపారమైన సామర్థ్యముకలది పర్వముల శక్తి. దాని ప్రవాహమునకు చిక్కినపుడు స్థూలదేహము (లగ్నము) కాని, సూక్ష్మదేహము (చంద్రుడు) కాని, ఆకస్మికముగ తమ నైజశక్తిసామర్థ్యములను కోలుపోవుటం జేసి, జాతకులు అనారోగ్యక్లేశ మనుభవించుట వింతకాదు. దశలో గ్రహవైషమ్య మున్న కాలములో ఇట్టి పర్వవేధ సంభవించెనేని, ప్రాణసందేహము కలుగుట సులభమని చదువరులు ఊహించుకోగలరు,

కనుకనే, వశిష్ఠమహర్షి —

"యస్య జన్మర్‌క్ష మాసాద్య
విషవాడ్యాం కుహూర్న్య వేత్,
అభిచారేణ కిం తస్య ?
స్వయ మేవ మరిష్యతి.

అని కంఠోక్తిగా ఆనతిచ్చుట!

ఇచట ఒక విశేష మున్నది. జ్యోతిశ్చక్రపు ౩౬౦ భాగలలో ఏ భాగలో పర్వము వచ్చునో, నాటినుండి పందొమ్మిదిసంవత్సరములదాక, మరల ఆభాగలో అట్టి పర్వము రాదు. ఆ యా కాలములో ఎట్టి దశ యుండునో, దాని ననుసరించి పర్వము ఫలము నిచ్చుచుండగలదు. మరియు, జాతకములో ఏదో యొక విశిష్టస్థానమునకుమాత్రమే పర్వవేధ వ్యాపించి నప్పటి కంటె మూడునాల్గుస్థానములకు ఒకేమారు పర్వశక్తి వ్యాపించినప్పుడే ఫలము చాల గొప్పదిగా అనుభవము నకు రాగలదు. పర్వస్థానమునకు కేంద్ర (౦; ౯౦; ౧౮౦ భాగల) స్థితిలో కాని, కోణ (౧౨౦ భాగల) స్థితిలో కాని, మూడునాల్గు జన్మకాలగ్రహములో, చలితగ్రహ ములో ఉన్నప్పుడు ఇట్టి ఫలమును చూడవచ్చును. లేదా, పర్వకాలమందలి గ్రహములు మూడు నాల్గు జన్మకాలగ్రహములపైననో, చలితగ్రహములపైననో వచ్చినపుడు సయితము ఫలము ప్రబలముగా చూపట్టును. కేవలరాశికుండలితో కాలక్షేపము చేయుచు తృప్తిచెందువారు ఇట్టి పర్వఫలములను గుర్తింపజాలరని వేరుగా చెప్పుట అనవసరము.

పర్వములకు గల ఈ అసాధారణశక్తిని మన ప్రాచీనులు బాగుగా గుర్తించిరి. ఏ గ్రహముల దశ అయినాసరే, దశాఫలమును మన కందిచ్చువారు రవి చంద్రు లనియే వారి తీర్మానము. దశాఫలమును పక్వ స్థితికి దెచ్చు గ్రహము సూర్యుడనియు, ఆ ఫలమును పోషించు గ్రహము చంద్రుడనియు స్పష్టముగా కల్యాణవర్మ చెప్పెను. (సారావళి)

"సవితా దశాఫలానాం
పాచయితా ; చంద్రమాః ప్రపోషయితా."

సూర్యునికి "కర్మసాక్షి" యని పేరుపెట్టిన వా రెంత మహనీయులో ?

సుప్రసిద్ధము లయిన కొన్ని ఉదాహరణము లివి:

(౧) హైదరాబాదు నైజాముజాతకములో భాగ్యాధిపతియగు చలితబుధుడు వ్యయభావమందలి చలితరాహువుతో, షష్ఠభావమందలి చలితకేతువుతో, కేంద్రవేధను పొందిన వయస్సులో, ఆ చలితరాహు స్థానముపైన అమావాస్యవచ్చిన పదిదినములలోనే ఇండియన్ యూనియన్ సేనలు "పోలీసుచర్య" కొరకై నైజామురాజ్యములో ప్రవేశించుట.

(౨) వ్యయాధిపతియగు చలితశని చలితరాహు సంయోగములో నున్న వయస్సులో, ఆ శనికి నిండు సమసప్తకస్థానమున, చలితకేతువుపైన, అమావాస్య వచ్చిన వారముదినములకే పాకిస్థానపు గవర్నరుజనరలు జిన్నాసాహేబు కాలధర్మము నొందుట.

(౩) జన్మకాలపు రవిస్థానమునకు నిండుసమ సప్తక ప్రదేశములో అమావాస్యవచ్చిననాడు పర్వ కాలపు కుజుడు చలితరాహుకేతువుల వేధపాలు కాగా, ఇండియా ఉపప్రధాని శ్రీ సర్దార్ పటేలు జయపుర ప్రయాణము చేయుచు విమానప్రమాదమునకు చిక్కుట.

(౪) మహాత్ముని జన్మకాలమందలి కుజ, గురు, చంద్రులకు ఆత్యంతిక కేంద్రసంబంధములో పూర్ణిమ పడినకొన్ని దినములకే కస్తూరీబాయిగాంధిగారు భౌతిక దేహమును వదలుట.

(౫) జన్మచంద్రునికి నిండుసమసప్తకస్థాన ములో చలితబుధవరుణు లున్న వయస్సులో, ఆబుధవరు ణులపైన పూర్ణిమపడిన కొన్నాళ్లకే, అమెరికాదేశ ములో లాస్ఏంజలిస్ నగరములో కరోల్‌లాండిన్ అను సుప్రసిద్ధ సినీమాతార తన నాల్గవభర్తతో సంసా రము నిర్వహించలేక ఆత్మహత్య చేసుకొనుట!

దిఙ్మాత్రప్రదర్శనముగా పైఉదాహరణములు చాలు ననుకొందును. గమనించి చూచితిమేని, సామాన్యజీవితములలో సయితము వేలకొలది దృష్టాంత ములు మనకు సర్వసులభముగా గోచరించును.

ప్రకృత మనుసరింతము. ఒకానొక పర్వకాలపు సాయనస్పష్టగ్రహకుండలి ఈ ప్రక్క నున్నది. రవిచం ద్రులు నిండు సమసప్తకస్థితిలో నుండుటవలన ఇదిపూర్ణిమ యనిపాఠక మహాశయులు గుర్తింపగలరు. ౧౯౪౮ వ సం. జనవరి ౨౬ వ తేదీనాడు గ్రీనిచ్‌మధ్యమ కాలములో (G. M. T) ఉదయము ౮ ఘంటలు, ౧౧ నిమిష ములు, ౨౦ సెకండ్లకు వచ్చిన పూర్ణిమ యిది. ఈ కుండలిలో పర్వకాలపు లగ్న, దశమ, కేంద్రములు మహాత్ముని జన్మస్థానమునకు సాధించబడినవి.

ఈ పర్వకాలమున బుధ, శని, గురువులు ఎట్టి పరస్పరసంబంధముతో నున్నారో గమనింపుడు. బుధ శనులు ముఖాముఖిగా నిలచి స్పర్ధకు దిగి యున్నారు. ఇది ప్రబలమైన ప్రత్యక్షవైరదృష్టి.

"అన్యోన్యం సప్తమఖే, లగ్నైకభవనే,
ప్రత్యక్షవైరాఽఖిలా" (నీలకంఠ తాజకము)

| | | | |
|---|---|---|---|
| కు ౧౦-౩ | | I ౧౦-౪౦<br>రా ౧౯-౨౯ | వ ౨౨-౩౬<br>(వ) |
| బు ౨౦-౧<br>ర ౫-౧౫ | "పూర్ణిమ"<br>(౨౬-౧-౧౯౪౮) | | |
| X ౨౯-౫౮ | | | చ ౫-౧౫<br>శ ౨౦-౩౧ |
| గు ౨౦-౧౮ | కే ౧౯-౨౯ | ఇ ౧౨-౫౪ | శు ౫-౩౧ |

కాని, బుధునినుండి అర్ధకోణస్థానములో, శని నుండి పూర్ణకోణస్థానములో స్వక్షేత్రమందు ప్రబలుడగు బృహస్పతి యున్నాడు. బుధశనులిరువురికిని ఈ బృహస్పతినుండి పుష్టమైన మిత్రదృష్టియున్నది కదా ? అన్యోన్యస్య సమసప్తక వైరదృష్టిలో నుండు రెండుగ్రహములలో ఒకదానితో అర్ధకోణములో, రెండవదానితో పూర్ణకోణములో మూడవ గ్రహ ముండెనేని సమ సప్తకస్థితిలోనున్న గ్రహముల ఘర్షణవలని ఫలము, సామాన్యముగా, దుష్టముగా పరిణమించదనుట సాధారణధర్మము. కలహమునకు కాలుద్రవ్వుచు ఇద్దరు నిలిచి యుండగా, వారి మిత్రి మొకడు సమయమునకు 'మధ్యవర్తి' గా వచ్చిన ట్లుండును. జాతకములో ఇట్టి పరిస్థితి ఏర్పడినపుడు, సమసప్తకదృష్టిలో నుండు గ్రహములకు చెందిన భావఫలములలో కొన్ని చిక్కులు సంభవించినా, మిత్రదృష్టి నిచ్చు మూడవగ్రహము సూచించునట్టి వ్యక్తులనుండియో, పరిస్థితులనుండియో జీవితమున చిక్కులు తొలగుటకాని, పరిష్కారమగుట కాని సిద్ధించుచున్నది. ఇచట ఒక విశేషసూత్రము కలదు. ఆ 'మధ్యవర్తి' గ్రహము జాతకునికి సత్ఫలము నిచ్చువాడుగా నున్నప్పుడే ఈ సౌకర్యము కలుగగలదు. కాని, దుష్టస్థానాదిదోషములు ఆ గ్రహమున కున్నచో, దానిమధ్యవర్తిత్వమునుండి జాతకునికి మేలు కలుగదు. ఈ విశేషవిధిని మనము మరువరాదు.

ఒకానొక ధనుర్లగ్న జాతకురాలికి చలితరవితో చలితబుధునికి (సప్తమాధిపతికి) అష్టమభావములో సంయోగము వచ్చినది. పర్వకాలపు గురు, బుధులకు చేరి ౧౫౦ భాగలదూరములో (షష్టాష్టకములో) ఈ సంయోగముండుట. ఇట్టిపరిస్థితులలో పర్వకాలపు బృహస్పతికి (జాతకురాలిలగ్నాధిపతికి) సార్ధకేంద్రములో పడిన ఈపర్వము చలితరవి బుధస్థానమునకును, తాత్కాలిక శనికిని మధ్య బిందువందే వచ్చుటచే, అతిదుష్టముగా పరిణమించినది. సప్తమాధిపతియగు బుధుడు చలనవశమున అష్టమభావములో తిరుగుచు చలితరవి సంయోగమువలన దగ్ధుడైన వయస్సది. ఇట్టి దశలో, పర్వకాలబుధుడు శనితోటి సమసప్తకస్థితివలన చెడుటచే, పర్వజనితమగు మహాశక్తి దుష్టఫలమునే సంపాదించి ఇచ్చినది. ధనుర్లగ్న జాతకురాలికి అష్టమాధిపతి చంద్రుడుకదా ! పర్వములో ఈ చంద్రుడు కుజునికి ౩౦ భాగలలో నున్నాడు. ఈ చంద్రకుజులకు సరిపడుననే పర్వశని యుండుట. సప్తమాధిపతి బుధుడు ఈ శనినుండియే సమసప్తకము. పర్వకాలపు రవిచంద్రులనుండి గురువునకు క్రమముగా అర్ధకేంద్ర సార్ధకేంద్ర వీధ లున్నవి. అగుటచే, ఈ గురువు శుభఫలమును ఇయ్యజాలడు. వారముదినములలోనే, అసాధారణపరిస్థితులలో, ఈ జాతకురాలు తన మనఃప్రియుని కోలుపోయినది. పాపము ! బృహస్పతి లగ్నాధిపతి యగుటచే, జరిగిన ఘోరసంఘటనకారణముగా, జీవితమున సర్వనాశనము కలుగకుండ కన్యకనుమాత్రము కాపాడగలిగినాడు !

వ్యక్తులకు సిద్ధముగానున్న ప్రారబ్ధఫలమును పర్వము లేరీతిగా పక్వతకు దెచ్చిఇచ్చునో, చూపుటకై ఇంత వ్రాయవలసివచ్చెను. అది యట్లుండె.

మహాత్మునియొక్కయు, గాడ్సేయొక్కయు జాతకములపైన ఈ పర్వమున కెట్టి వ్యాప్తి వచ్చినదో పరీక్షించుట అప్రస్తుతము కాదు. ఈ పూర్ణిమవచ్చిన తరువాత నాల్గుదినములకే మహాత్ముడు హత్యపాలగుట. ఈ పర్వము ప్రకృతివిషయమున ఎంత పని చేసినదో చూడుడు.

పర్వకాలపు శని మహాత్ముని జన్మచంద్రునిపైన కూర్చున్నాడు. అప్పటి బుధుడు పై శనిస్థానమునకు సమసప్తకముగదా ! జన్మకాలపు గురువు ఈ శని బుధులకును, జన్మచంద్రునికిసహా, నిండుకేంద్రములో నున్నాడనుట చదువరులు మరవరాదు. పర్వకాలపు బృహస్పతి మహాత్ముని జన్మశనిపై, మరియు గాడ్సే చలితపుణ్యసహమముపై సాక్షాత్కరించినాడు. ఈ గురువునుండి పర్వకాలపు శనిబుధులకు మిత్రదృష్టియే కలదుకాని, అది సత్ఫలకారి కాదు. ఏలందురా ! మహాత్ముని బుధుడు మృత్యుస్థానాధిపతి. గురువు

అతని మృత్యుభావమునకు కార్యనిర్వాహకుడు. ఇక శనియో, మహాత్మునికి చతుర్థాధిపతి. ఇతనికే గాడ్సే జాతకమున మృత్యుభావాధిపత్య మున్నది. ఎటు చూచినా, మృత్యుఫలమే తాండవమాడుచున్నది. అగుటచే, పర్వకాలపు బృహస్పతియొక్క మిత్రదృష్టి శనిబుధులదోషమునకే ప్రోది చేసినది. ఈ పర్వబృహస్పతిని పర్వరవిచంద్రుల వేధ చెలరేగించినపుడు దుష్ఫలము కాక వేరెట్లు జరుగును? పర్వములో రవిచంద్ర కిరణ ఘర్షణచే ఆకాశరంగమునం దుత్పన్నమైన మహాశక్తి మహాత్ముని విషయమున మారకధర్మము నాశ్రయించుట వింత కాదు.

విశేష మేమనగా, గాడ్సేజాతకమునందు అష్టమాధిపతియగు చలితశనినుండి కేంద్రవేధను పొందుటచే క్రూరుడైన చలితకుజుడు (ఉద్యోగాధిపతి) మహాత్ముని మారక గ్రహమగు జన్మరాహువుపైన కూర్చున్నాడనుట చదువరులు మరచి యుండరు. నికరముగా, ఆ కుజస్థానమందే పడిన ఈ పర్వము ప్రళయశక్తిని మేలుకొలిపి చెలరేగించినది. మందు సామానుల కొటారునకు నిప్పు అంటించిన ట్లయినది. ఈ ప్రళయ శక్తి మహాత్ముని జాతకమున కెట్లు వ్యాపించెనో, ఈ క్రిందిపటము స్పష్టముగా చదువరులకు చూపగలదు.

అతిముఖ్యములగు వేధలుమాత్రమే ఈ చక్రమున చూపబడినవి. ప్రశంసలో నున్న జాతకములతో పర్వచక్రమును పోల్చి చూచినచో, పాఠకమహాశయులే మరికొన్నింటిని కనుగొనగలరు. చిక్కుగా నుండునని తలచి అన్నింటిని చూపక మానితిని. ఈ చక్రమును నెమ్మదిగా పరిశీలించినచో, పర్వశక్తి ఏ స్థానములో సంభవించి, ఏ గ్రహముల వలన ఉద్రేకించి, ఎచటినుండి మారక ధర్మమునవలంబించి, ఎచ్చట పిడుగువలె పడినదో సులభముగా గోచరమగునని నా నమ్మిక.

వేధాసూచక చక్రము




మ = మహాత్మునియొక్క;
గా = గాడ్సేయొక్క;
చ = చలిత;
పు = పుణ్యసహమము;
మృ = మృత్యుసహమము;
కా = కార్యసిద్ధిసహమము.

జనవరి ౨౬వ తేదీ నాడు ౬-౧౧-౨౦ A.M. (G. M. T) గంటలకు వచ్చిన పూర్ణిమ మారకశక్తిని ఉద్రేకింప జేసినది వాస్తవమైనచో తరువాత, ౩౦ వ తేదీన సాయంకాలము ౫-౪౦ P. M. (I. S. T) గంటలు—అనగా, ౦-౧౦-౦ P.M. (G. M. T)—వచ్చుదాక మహా

త్ముని హత్య జరుగకుండుటకు కారణ మేమి? అని యడుగ వచ్చును. మందుసామానుకొట్టునకు నిప్పుతగిలిన ఉత్తరక్షణమే సర్వనాశనము జరుగనక్కరలేదు. కొట్టు ప్రేలుటకు కొంత కాలవ్యవధి కావలసియుండుట సహజము. అట్లే, పర్వపువేధవలన ప్రశంసా విషయమున ప్రళయము సంభవించుటకు ౪ దినములపైన ౪ గం. ౫౮ ని. ౨౦, సెకండ్లకాలముపట్టినది. ఇంత కాలవ్యవధి ఏల కావలసివచ్చెనో చూతము.

మరణదినమున రవిస్థితిని సూచించు పరాశర సూత్రములలో ఈక్రింది శ్లోక మొకటి:—

"భౌమమార్తాండలిప్తాహతిః కారయేత్,
చక్రలిప్తాహతా ల్లబ్ధయుక్తో రవిః,
యాతి యస్మిం స్తదా తత్త్రికోణేఽపి వా,
క్లేశ మాహుః క్షయం మానీ ధీమాన్ వదేత్."

(బృహత్పారాశరహోర)

దీని ప్రయోగ మిది:—

| | | |
|---|---|---|
| జన్మకుజరాశ్యాది మొత్తపు కలలను | ... | ౧౩,౭౦౪ |
| జన్మరవిరాశ్యాది మొత్తపు కలలచేత | ... | ౧౧,౩౩౬ |
| గుణించగా వచ్చిన మొత్తపు కలలను | ... | ౧౫,౫౩,౪౮,౫౪౪ |
| చక్రలిప్తలచేత | ... | ౨౧,౬౦౦ |
| భాగించగా వచ్చిన కలలు | ... | ౭,౧౯౨ |
| | | రా భా క |
| అనగా, రాశ్యాదిని | ... | ౩-౨౯-౫౨ |
| జన్మరవిస్థానమునకు | ... | ౬-౮-౫౬ |
| చేర్చగా వచ్చిన ఫలము నిధనరవిస్థానము | ... | ౧౦-౮-౪౮ |

పై సూత్రమననుసరించి, తులా, కుంభ, మిథున రాసులలో ౯ వ భాగలో రవి సంచరించుదినమున మహాత్మునికి మృత్యువు రావలసి యున్నది. ఈ మూడుస్థానములలో పర్వమునకు సన్నిహితముగా నుండునది కుంభములో ౯ వ భాగయే. పర్వము తరువాత నాల్గుదినములకే, అనగా ౩౦ వ తేదీనాడే రవి ఈ భాగలో నుండుట సంభవించుచున్నది. కావుననే, పర్వకాలఫలము అంతదాక వేచియుండవలసివచ్చెను.

మహాత్ముని నిధనకాలమునకు సాధించిన సాయన గ్రహకుండలి ఇదిగో ఈ ప్రక్క నున్నది:—

| | | | |
|---|---|---|---|
| శు ౧౫-౧౦ | | X ౦-౩౦<br>రా ౧౯-౧౬ | వ ౨౭-౩౦ |
| బు ౨౬-౩౨<br>ర ౯-౩౧ | తేదీ ౩౦-౧-౧౯౪౮<br>౫-౪౦ P.M.(I.S.T.)<br>దేహళీనగరము | | |
| | | | I ౬-౩౦<br>శ ౨౦-౧ |
| గు ౨౧-౫ | కే ౧౯-౧౬ | చ ౮-౮<br>ల ౧౨-౫౫ | కు ౪-౨౭ |

జనవరి ౩౦ వ తేదీనాడు ౦-౩౫ A. M. (I. S. T.) గంటలకు రవి కుంభరాశిలో ౮ భాగల ౪౮ కలలకు వచ్చినాడు. తరువాత ౨౪ గంటల లోపలనే—అనగా ౧౭ గంటలు ౫ నిమిషములకే—మహాత్ముడు హత్యపాలయి అసువులు వదలుట! పరాశరమహర్షి చెప్పిన సూత్ర మెంతో చక్కగా అన్వయించినదని చదువరులు గుర్తించగలరు. కాని, సాయనపద్ధతివలనమాత్రమే ఇది సాధ్యమని వేరుగా విన్నవించుట యనవసరము.

ఇచట మరియొక చిన్న విశేష మున్నది. పర్వకాలమునం దుదయించి వాతావరణము నాక్రమించి యుండిన ప్రచండశక్తి మహాత్ముని జన్మస్థానములో కేంద్రీకరించియున్న తాత్కాలిక దశమభావబిందువు ఎచట నున్నదో పరికింపుడు! మకరరాశిలో ౨౯ భాగలు ౫౮ కలలలో ఈ కేంద్ర మున్నదికదా! ఇచట కేంద్రీకృతమైన ఆ పర్వశక్తి మహాత్ముని మారక గ్రహముతో సంబంధమును సంపాదించుకొననిదే హత్య యెట్లు జరుగును? ఈ కేంద్రము మహాత్ముని జన్మరాహువునకు ఎదురుగా వచ్చుటకు—అనగా, అతని జన్మకేతుస్థానమును పొందుటకు—౪ భాగలు, ౧౪ కలల పట్టు ముందుకు జరుగవలసియున్నదని చదువరులు సులభముగా గుర్తించగలరు. ఈ ౪ భాగలు, ౧౪ కలల పట్టు తాత్కాలికరవియొక్క మధ్యమగతి మానముతో ౪ దినములు, ౫ గంటలకాలపు ప్రయాణ మగుచున్నది. సారాంశ మేమనగా, పర్వశక్తియొక్క కేంద్రము ముందుకు జరిగి మహాత్ముని జన్మరాహువున కెదురుగా వచ్చి నిలచుట జనవరి ౩౦ వ తేదీ సాయంకాలము ౫-౪౦ P. M. (I. S. T) గంటలకే అనుట!

పర్వశక్తి మహాత్ముని జాతకమునకు ఎచ్చట దెబ్బకొట్టినదో, ఎపుడు కొట్టినదో కన్నులకు కట్టినట్లున్న దికదా! ఏమి ఈ కాలపురుషుని విచిత్రవినోద లీల!

ఇక, దైనిక జాతకము లేమనుచున్నవో కనుగొననిదే మన చర్చ పూర్తి కాదు. పర్వమునాడు మహాత్మునియొక్కయు, గాడ్సేయొక్కయు దైనిక కేంద్రములు ఈ క్రిందిస్థితిలో నుండినవి :—

| | దై. దశమము | దై. లగ్నము |
|---|---|---|
| (i) మహాత్మునికి | ... ౩ ౩/౪° ధనుస్సు... | ౨౩ ౧/౪° కుంభము |
| (ii) గాడ్సే | ౧౬ ౩/౪° ధనుస్సు... | ౧౩ ౧/౪° మీనము. |

మహాత్ముని దైనికలగ్నము కుంభములో నున్నదికదా ! కనుక, దైనికజాతకమున అష్టమభావాధిపతి బుధుడగుచున్నాడు. జన్మకాలములో అష్టమాధిపత్యము బుధునిది. సరేకదా ! ఇట్టి బుధుడు పర్వకాలములో దైనికలగ్నమునకు సన్నిహితుడుగానున్నాడేకాని, సంయోగము నొందలేదు. దైనికలగ్నము ఈ మృత్యుస్థానాధిపతిని (బుధుని) చేరుకోవలదా మరి ? లేనిచో, భౌతికదేహ మెట్లు మృత్యువువశ మగును ? ౩౦ వ తేదీదాక ఈ సంయోగము జరుగలేదు. కావనే, పర్వకాలపు ప్రళయశక్తి వేచియుండక తప్పినది కాదు.

ఇంతే కాదు. గాడ్సేజాతకమున అష్టమాధిపతి శని. ఇతని చలితలగ్నము ఈ వయస్సులో సింహరాశిలో నున్నది. అగుటచే, చలితజాతకమున అష్టమాధిపత్యము గురువు సంపాదించుకొన్నాడు. పర్వకాలములో శనిగురువులిద్దరు పరస్పరకోణదృష్టితో పరమమిత్రు లయినారు. అనగా, ఒకరికొకరు సాయపడుదురని అర్థము. వీరిలో స్వక్షేత్రమందున్న గురువు మహాబలశాలి. ఈ గురువునుండియే పర్వరవిచంద్రులకు వేధ కలదు. ఇట్టి గురువుతోడి సంబంధము దైనికదశమకేంద్రమునకు రానిదే, పర్వకాలపు ప్రళయశక్తిని ఉపయోగించుకొనుటకై గాడ్సే ఉద్యోగింపనేరడుకదా ? పూర్ణిమనాడు అతని దైనికదశమకేంద్రము ధనుస్సులో ౧౬ ౩/౪ భాగలో నుండెను. అది బృహస్పతిసంయోగమును పొందుట ౩౦ వ తేదీనాటికంటె పూర్వము జరుగలేదు. కావుననే, ఆ దినము నందే ఆత డీఘనకార్యమును సాధించుట !

౩౦ వ తేదీ వీరి దైనికకేంద్రస్థితి ఇట్లుండును :

| | దై. దశమము | దై. లగ్నము |
|---|---|---|
| (i) మహాత్మునికి | ... ౬ ౧/౪° ధనుస్సు... | ౨౬ ౧/౪° కుంభ. (బుధ సంయోగము) |
| (ii) గాడ్సేకు | ...౨౧° ధనుస్సు... | ౧౬ ౧/౪° మీనము (గురుసంయోగము) |

మహాత్ముని దైనికలగ్నము బుధాక్రాంతమగుట, గాడ్సే దైనికదశమము గురువు నాశ్రయించుట ఈ రెండుకార్యములు ఏకకాలమందే—౧౯౪౮ జనవరి ౩౦ వ తేదీనాడే—జరుగవలయునని కాలపురుషుని శాసనము ! విధి !!

ఒక చిన్న ఆక్షేపము రావచ్చును. ఏమనగా, మహాత్ముని జన్మరాహుస్థానము సింహరాశిలో భా ౮-౧౧ కలలు కదా ! దానినుండి ఒక్క భాగ ౮ కలల దూరములో (సింహరాశిలో ౫ భా. ౧౫ కలలలో) పర్వము పడినది. నికరముగా దుష్టభాగపైననే పడనట్టి పున్నమకు ఇంత విలువ ఏల ? అనవచ్చును. దీనిలో ఒక ధర్మసూక్ష్మత యున్నది. అయన చలనము వలని మార్పును గమనించితిమేని, మన కీ వ్యత్యాసము కానరాదు. మహాత్ముని జననకాలములో ౨౨ భాగలు ౨ లిప్తలు అయనాంశ. అతని అవసానకాలమునకు అయనాంశలు ౨౩ భాగలు, ౬ లిప్త లయినవి. అనగా, మహాత్ముని జీవితకాలములో, రాశిచక్రము—నక్షత్రచక్రము కాదు—౧ భాగ, ౫ కలలపట్టు వెనుకకు తిరిగినదని అర్థము. ఫలమేమనగా, ఏ భచక్రప్రదేశము మహాత్ముని జన్మకాలమున సింహరాశిలో ౮ భా. ౧౧ కలలుగా వ్యవహరించబడుచుండెనో, ఆదేప్రదేశమునే మహాత్ముని నిధనకాలమునకు, అయనచలనమువలన, సింహములో ౫ భాగల ౧౬ కలలని మన మిపుడు వ్యవహరించుచున్నామని పాఠకమహాశయులు సులభముగా గ్రహింపగలరు. ప్రశంసలోనున్న పూర్ణిమ సింహరాశిలో ౫°-౧౫' లో పడుటచే, మహాత్ముని జన్మరాహుస్థానమందే పర్వము సంభవించినదని స్పష్టమగుచున్నది. కావుననే ఇంతటి ప్రళయము !

ఆకస్మికముగనో, కాకతాళీయన్యాయము వలెనో పైయోగము కుదిరియుండరాదా అని శంకించు యుక్తిపరు లుండకపోరు. కనుక మరియొక నిదర్శనము నిచ్చుట మంచిది.

| | అయనాంశలు |
|---|---|
| గాడ్సే జన్మకాలమున | ... ౨౨ భా-౩౫ క. |
| మహాత్ముని జన్మకాలమున | ... ౨౨ - ౨ |
| వ్యత్యాసము | ... ౦ -౩౩ |

అగుటచే, మహాత్ముని జన్మకాలమునుండి గాడ్సే జన్మకాలమునకు రాశిచక్రము ౩౩ కలలపట్టు

వెనుకకు తిరిగిన దనుట. మహాత్ముని జాతకమున మృత్యు సహమము సింహరాశిలో ౧౬ భా. ౫౦ కలలలో నున్నదికదా ? గాడ్సేజన్మకాలములో ఈ (మహాత్ముని) మృత్యుసహమము సింహరాశిలో ౧౪ భా. ౨౩ కలలలో నుండెగలదనుట సువ్యక్తము. గాడ్సే జాతకమున హాత్యసహమము సింహరాశిలో ౧౪ భా. ౨౨ కలలలో నున్నదని గమనించితిమేని, కాలపురుషుని మహిమ ఎంత అద్భుతముగా కానవచ్చునోకదా? మహాత్ముని మృత్యువుతో హత్య చేరుకొన్న కాలములో 'విధి' గాడ్సేను సృజించినాడని అర్థమా ? ఇదిసయితము కాకతాళీయన్యాయ మనగలమా ?

ఒక్క మనవి. ఇట్టి సూక్ష్మవిమర్శ అంతయు సాయనపద్ధతిలో మాత్రమే సాధ్యమని పాఠకమహాశయు లిప్పు డూహించుకొగల రనుకొందును. మన ప్రాచీనులలో సయితము సాయనపద్ధతిని గౌరవించినవారు లేకపోలేదు. చూడుడు.

"ఉత్తమాం రాశిసంక్రాంతిం
కేచి దాహు ర్మనీషిణః;
నైత న్మమ మతం, యస్మాత్,
న స్పృశేత్ క్రాంతికక్షయా."
"చలసంస్కృతి తిగ్మాంశో స్సంక్రమో య
స్సుసంక్రమః,
అజాగళస్తన ఇవ రాశిసంక్రాంతిరుచ్యతే."

అని వశిష్ఠమహర్షి అనతిచ్చెనట! నిరయనపద్ధతి తనకు అభిమతము కాదనియు, అది 'అజాగళస్తనము' వంటిదనియు ఆ మహనీయుడు ఘంటాఘోషముగా చాటియున్నాడు! ఋతుధర్మములు సాయనపద్ధతికి చెందినవనుట నిర్వివాదము. లగ్నసాధనము, క్రాంతి నిర్ణయము, చేష్టా కేంద్ర సంపాదనము, అయనబలగణితము, చరఖండసాధనము మున్నగువానికై నేటికి సయితము నిరయనవాదులు సాయనపద్ధతిని అవలంబించక తప్పినది కాదు. అయిన నేమి ? జాతకఫలాదేశవిషయమున మాత్రము, అదేమి కారణమో, మనవారిలో నిరయనపద్ధతి ఊడలుపారి నాటుకొన్నది.

ఇచ్చట, నాకొక ఊహ. అది ఊహాయేకాని, నిరాధారము కాదు. అనధికారులచేతిలోని శస్త్రము కాని, శాస్త్రముకాని ప్రమాదకారియగుట అస్వాభావికము కాదు. ఆ కారణమున, ముఖ్యమైన శాస్త్ర రహస్యముల కొన్నింటిని గుప్తముగా దాచియుంచుట యుక్తమని మన ప్రాచీనులు తలచియుందురు.

"ధూర్త, దుర్జన, విద్వేషి, కృతఘ్నానాం కదాచన
న ప్రకాశ్య మిదం శాస్త్రంరహస్యం కేవలం యతః"

అని గర్గమహాముని అనతిచ్చుటలో పై యర్థమే ఇమిడియున్నదని మన మనుకొనవచ్చును. శాస్త్ర రహస్యముల నిట్లు గుప్తముగా నుంచుకొనుట లోకకల్యాణదృష్టితో సాధువా, అసాధువా అను తర్కము మన కిపు డక్కరలేదు. "ఆటంబాంబు" రహస్యముల విషయమై ఇపుడు అగ్రరాజ్యములవారిలో జరుగుచున్న చర్చ ఇట్టిదేకదా ? అది యట్లుండె.

సూక్ష్మవిచారమునకు పనికివచ్చునట్టియు, అమూర్తమగుటచే ప్రబలశక్తిమంతమగునట్టి రాశిచక్రముపై ఆధారపడినట్టియు సాయనపద్ధతిని మన పెద్దలు రహస్యముగా నుంచుకొని, జనసామాన్యప్రచారమునకు మూర్తిమంతమైన నక్షత్రచక్రము నాశ్రయించిన నిరయనపద్ధతిని వ్యాప్తికి తెచ్చియుందు రనుకొనుట కవకాశ మున్నది. ఇది యంతయు పిచ్చియూహ లనుకొనరాదు. చూడుడు:—

"యస్మిన్ దినే నిరంశ స్స్యాత్
సంస్కృతో ఒర్కో యనాంశకైః
తద్దినం తు మహా త్పుణ్యం;
రహస్యం మునిభిస్స్మృతం." (జ్యోతిర్నిబంధము)

ఏ దినమున సాయనరవి రాశిప్రవేశముచేయునో, అదియే సంక్రమణపుణ్యదినమట ! ఈ విషయము మునులు రహస్యముగా చెప్పినారట ! ఏమి దీని భావము ! మహనీయుం డయిన శ్రీపత్యాచార్యుడు సయిత మిట్లె సెల విచ్చినాడు.

"యావద్భి రంశై రయనచ్యుతి స్స్యాత్,
తద్భాగకాలేన దివాకరస్య,
చ్యుతి ర్భ వేత్ విష్ణుపదాదికానాం,
రహస్య మేతత్ మునిభిః ప్రదిష్టం."

సాయనరవినుండి రాశిసంక్రమణములు కలుగుచున్నవను సూత్రమును రహస్యముగా మహర్షులు ఉపదేశించినారట! ప్రాచీనగ్రంథములలోని ఇట్టి వాక్యములే నా యూహల కాధారము.

పోనిండు. మహాత్ముని యొక్కయు, గాడ్సేయొక్కయు జాతకములలోవారి ప్రారబ్ధ మేరీతి పక్వమయ్యెనో, దానిఫలముగా ౩౦-౧-౧౯౪౮ నాడు కాలకర్మసంయోగ మెట్లు చేకూరెనో, కొంత సూక్ష్మవిమర్శ చేసితిమి. అనంతానంతములయిన గ్రహచారధర్మములలో ఏ పరమాణువైనా మన కీ చర్చవలనలభించినచో ధన్యులము. శాస్త్రాభ్యుదయమునకు ఇట్టి విమర్శనము లవసరమని సహృదయులగు పాఠకమహాశయులు భావించిరేని, నాప్రయత్నము సఫలమనియే నా విశ్వాసము.

---

# ఆత్రేయి

శ్రీ దండిపల్లి వెంకటసుబ్బాశాస్త్రి

## ౧

(వాల్మీకి ఆశ్రమము. వృక్షములకు నీళ్ళు పోయుటకై ఆత్రేయి ప్రవేశించును)

ఆత్రేయి—(అటు ఇటు కలయచూచి) ఈ నవోదయభానుకిరణములు వికసితపుష్పములతో, పల్లవిత లతికలతో కూడుకొన్న ఆశ్రమప్రాంగణమున ముగ్గులు తీర్చినట్లున్నవే!

ప్రకృతిసౌందర్యము అద్భుతావహము! (కొంచెము నడచి) ఈ పుష్పగుచ్ఛము సువాసనాభరితమై చూడ నెంత ముచ్చటగా ఉన్నది! మంద మారుతముల నల్లలాడు చిగురాకుల నాట్యభంగిమలు నయనానందసంధాయకములు (పెదవి విరచుకొని, చింద క్రింద పెట్టి) నాకు మతి చెడినది. కవిత్వము నన్నావేశించుచున్నట్లు తోచెడిని. ఈ వికారభావములకు కారణ మేమి? ఆఁ, తెలిసినది. సహవాసదోషము. కానున్న పాషాణప్రాయమైన నా హృదయములో ప్రాకృతికసౌందర్యముగ్ధత్వము కలుగజాలదు. స్నేహప్రభావము! స్నేహప్రభావము!!

(వాల్మీకి ప్రవేశించును)

వాల్మీకి—ఆత్రేయి! ఏమిటి ఆ స్నేహప్రభావము?

ఆత్రేయి—(వెనుదిరిగి) మహాభాగా! నమోవాకములు. తమ కవితాస్నేహప్రభావము.

వాల్మీకి—కవితాస్నేహమువల్ల నీకు కలిగిన అనుభూతి ఎట్టిదో వివరింపుము.

ఆత్రేయి—నాకు కలిగిన అనుభూతిలో మొట్టమొదటిది ప్రాకృతికవాంఛావికారము. ఇన్ని సంవత్సరముల తరబడి ఆశ్రమములో వున్నప్పటికిని లతాపుష్పపల్లవాదులు నా మనస్సును ఆకర్షింపలేదు. నేడు వాటి సౌందర్యమునకు ముగ్ధురాలనై కవితాప్రసక్తితో వర్ణించుకొనుచున్నాను. ఇదియే స్నేహప్రభావము.

వాల్మీకి—అదియు మంచిదే. ప్రపంచకల్యాణమునకు కవిత్వము ఎంతో ఉపకరించును. ఆ సత్యము నీవు నేటికైనా గుర్తించినందులకు ధన్యురాలవు.

ఆత్రేయి—నే నట్లు అనుకొనుట లేదు. తమతో వివాదము రానేవచ్చినది. మీ కవితావ్యాసంగమువలన నా బ్రహ్మవిద్యాభ్యాసమునకు విఘ్నము కలిగినది. ఈ మాటలు చెప్పుచున్నందులకు క్షమించవలె.

వాల్మీకి—నీ ప్రాతికూల్యానికి గల కారణమేమిటో నాకు బోధపడుట లేదు.

ఆత్రేయి—మహర్షీ! తాము సర్వజ్ఞులు. ప్రాకృతిక విషయాలతో కూడిన రామాయణరచనమూలంగా లోకంలో బ్రహ్మవిద్యాప్రభావం తగ్గగలదని నా అనుమానము. అందులకే ఈ నూతనకవితాప్రభావ మన్న ఏవగింపు.

వాల్మీకి—అమాయకురాలవు. ఆమ్నాయములు కూడ ఒక విధమైన కవితావస్తువును అంటిపెట్టుకొన్నవే. ఆ పరమార్థమును తెలిసికొమ్ము.

ఆత్రేయి—ఆమ్నాయములు బ్రహ్మవిద్యకు ఆటపట్టులు. వాటిచేత మానవత్వం సుశోభితం కాగలదు. కైవల్యపదమునకు అవి మార్గం చూపగలిగినవి. ఒకవైపు అట్టి ప్రభావము కలవి ఉండగా ఈ లౌకిక రచన మానవజాతికి ఎట్టి ఉపకారము కావించునో తెలియకున్నది.

వాల్మీకి—సరి. ఇప్పుడు నీ మనోగతభావము అర్థమైనది. క్రొత్త విధానమును చూచి ఈసడించుకొనుచున్నావు. నీకు ప్రపంచవ్యవస్థయే బోధపడలేదు. ప్రపంచసంతానము రానురాను అభివృద్ధి పొందు

చుండుట గమనించవలెను. దానినిబట్టి సర్వము మారుట అవసరము. అట్టి పరివర్తనాపేక్షలో జనించినదే ఈ నూత్నరచనాక్రమము.

అత్రేయి—ఏమైన చెప్పుడు. ఆమ్నాయముల ప్రత్యేకత నశింపగలదు. (చెవులు మూసికొనుచు) అబ్బ! ఆ కవిత్వములో అంతు పంతు లేని లౌకికభావనలు. అయినా ప్రాత పద్ధతులను రూపుమాపుకున్న దీ నూతన విధానము.

వాల్మీకి—అత్రేయీ! నీకు ప్రాతపై నున్న అభిమానము క్రొత్తదానిపై అసక్తిని పుట్టింపకున్నది. ఇది ప్రపంచసహజము. ఆదిమమానవుడు మాటలు నేర్చి నేర్వకముందే ఆమ్నాయములను చూచి అసహ్యించుకొన్నాడు. క్రొత్త దేదైనను ప్రారంభదశలో ప్రజాదరణ పాత్రము కాజాలదు. రానురాను వారి దైనందిన జీవితములో లీనమై మన్నన పొందును. అట్లే నీకు కూడ రామాయణరచనము నేడు అనాదరపాత్రం కావచ్చును. కొంతకాలం జరిగిన పిమ్మట నీకు ప్రియము కావచ్చునేమో!

అత్రేయి—గురూ! క్రొత్తగ నుండుట వల్లనే నేను ఈసడించుకొనుట లేదు. అందలి స్త్రీవర్ణనలు, కష్టసుఖానుభూతులు, సాంసారికవ్యామోహములు, హింస, మోసము, యుద్ధాదివర్ణనలు నన్ను గాభరా పెట్టినవి. ఈ సామాజికవ్యవస్థ బ్రహ్మవిద్యావికాసమునకు గొడ్డలిపెట్టుగా నున్నది. అందుల కేమందురు?

వాల్మీకి—వినుము. సమాజముయొక్క పరిధి అనంతము. సంఘము అభివృద్ధి పొందుకొలది పాదుకొని వున్న పూర్వభావముల మార్పు సహజము. వాటితో బాటు సారస్వతము కూడ మారుచుండును. అట్టి క్రమానుగతిపరిణామసూత్రాన్ని అనుసరించియే ఆమ్నాయములను ఆధారముగ చేసికొని వచ్చినవి ఆరణ్యకములు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు మొదలైనవి. వాటి తర్వాత వచ్చిన నూత్నరచనావిధానమే రామాయణము.

అత్రేయి—మీరు చెప్పినట్లే ఒప్పుకొన్నను పై నుదహరించిన వన్ని బ్రహ్మజిజ్ఞాసనే ప్రధానధ్యేయముగా పెట్టుకొన్నవి. ఇది అట్టిది కాకపోవటమే కాక మానవుని ఆధ్యాత్మికవికాసమునే పెడదారిలో పెట్టుచున్నది.

వాల్మీకి—ఇది సంధియుగము. దాని ప్రభావమే ఇట్టి పరిణామమున రూపొందినది. నేటి సంఘము బ్రహ్మవిద్యను అవగాహన చేసికొనజాలక— క్రమబద్ధమైన క్రొత్త పద్ధతుల్ని అవలంబింపజాలక ఉన్నది. ఇట్టి వ్యవస్థనే సంధియుగ మనవచ్చును. సంధియుగమందు ఏ క్రొత్త వచ్చినను ప్రజ నిరసించును. నీవును అట్టి సంప్రదాయమునకు లోనై ఇట్లు పలుకుచున్నావు. అన్నిటి గమ్యస్థానము ఒకటే అయినను— మార్గములు మాత్రము భేదముగ నగుపించును. నీలో రేకెత్తిన అలజడి స్వభావసిద్ధము. కాలము గడచుకొలది ఈమార్పు సర్వజనాంగీకారము కాగలదు.

అత్రేయి— తాము త్రికాలవేత్తలు. అయినను నా కీవాదముతో పని ఏమి? లవకుశులు ఆశ్రమమును ప్రవేశించినప్పటినుండి మీ ధోరణిలో విశేషమైన మార్పు కనిపిస్తున్నది. వాత్సల్యపాశములో బడినారు. ఎప్పుడు వారితోనే కాలము పుచ్చుచు ఆనందించుచున్నారు. నా బ్రహ్మవిద్యాభ్యాసమునకు అంతరాయము కలిగినది. అసలు నిజము చెప్పవలసివచ్చిన నా కీ ఆశ్రమవాతావరణమే సరిపడలే దనుచున్నందులకు క్షమించండి.

వాల్మీకి— నీలో కలిగిన సంధియుగప్రభావము నాకు దృగ్గోచర మగుచున్నది. కొంత ఓపిక పట్టుము. నీ బ్రహ్మవిద్యాభ్యాసము నిర్విఘ్నముగా కొనసాగగలదు.

అత్రేయి—గురూ! నన్ను అన్యథా భావించవద్దు. తామే ఇంతవరకు నూత్నయుగప్రభావమును గూర్చి సెల విచ్చితిరి. అట్టి దానికి లొంగిపోవుట నా అభిమతము కాదు. క్షమించి సెలవొసంగుడు.

వాల్మీకి—అత్రేయీ, నీవు ఎచ్చటికి పోదలచుకున్నావు?

అత్రేయి—అగస్త్యాశ్రమమునకు.

వాల్మీకి—(కనులు మూసికొని భవిష్యత్తును గుర్తించి) సరి, నీ ప్రయాణము దైవప్రేరితము. నీవలన రామాయణము లోకములో ప్రచారము కావలసియున్నది. ప్రవాహమునకు ఎదురీదినట్లు సంధియుగ ప్రభావమునకు ఎదురొగ్గుచున్నావు. నీ కృతనిశ్చయమును నేను అడ్డగింపనేల? క్షేమముగా వెళ్ళి రమ్మా. నీ వాంఛ నెరవేరుగాక!

ఆత్రేయి—కృతార్థురాలను.

(నమస్కరించును. ఇద్దరు నిష్క్రమింతురు)

౨

(ప్రస్రవణపర్వతప్రాంతములో ఒక వనప్రదేశము. ఆత్రేయి ప్రవేశించును.)

ఆత్రేయి—అబ్బా! దాహము, దాహము! గ్రీష్మభానుకిరణములు లోకము నుడుకెత్తించుచున్నవి. ఈ ఉష్ణప్రకోపము ప్రాణులకు తపనకారణమైనది. ఈ ఘోరారణ్యములో సువాసనాభరితపుష్పములతో విలసిల్లు వల్లీకుంజములతో స్నిగ్ధమై, సుశీతలతరుచ్ఛాయతో ఎండవేడిమిని దరిజేరనీయని ఈ వనప్రదేశము నాపాలి భాగ్యదేవతవలె ప్రత్యక్షమైనది. (అటునిటు చూచి) జలము ఎటు చూచినను కనుపించదు. నా దాహము తీర్చి నన్నుద్ధరింపగలవారెవరు? నాలుక పిడుచకట్టుకపోవుచున్నది. (గట్టిగా) దాహము, దాహము! (ఒక చెట్టు నానుకొని నిలువబడి యుండును.)

వాసంతి—(ఫలపుష్పాదులను ఒక చేత, ఒక చేతామరపాకులో నీటిని పట్టుకొని ప్రవేశించును.) అతిథినికి స్వాగతము! (ఆత్రేయి రూపసంపదను తదేక దృష్టితో పరిశీలించి) నా జన్మ తరించినది. తపస్వినీ మణీ! ఆతిథ్యమును స్వీకరింపుము. (తామరపాకుతో నీటి నందించుచు) ఈ జలమును త్రాగి దాహమును తీర్చుకొమ్మా.

ఆత్రేయి— నీవు మహాపుణ్యాత్మురాలవు. నా ప్రాణములు నిలువబెట్టితివి. (నీరు త్రాగును) నీ ఋణమును నే నెన్నటికిని తీర్చుకొనజాలను. నీ దర్శనభాగ్యమువలన కృతార్థురాలనైతిని.

వాసంతి—తపస్వినీ! నీ మధురమోహనమూర్తి తపఃక్లేశ మెట్లు భరింప గలిగినది?

ఆత్రేయి—నా రూపముపై నీకు మరిపెము కల్గుటయే విచిత్రముగా ఉన్నది.

వాసంతి—నాకే కాదు. ఎవరికైనను అంతే. నీవు ఏ ఆశ్రమమందు నివసించుచున్నావు? గ్రీష్మతపములో ప్రయాణభారమున కేల ఒడిగట్టితివి? నీనామధేయమును తెల్పి సంతోషమును చేకూర్చుము.

ఆత్రేయి—నేను వాల్మీకి ఆశ్రమములో నివసించుదానను. ప్రయాణము అగస్త్యాశ్రమమునకు. పేరు ఆత్రేయి. నీ ఆదరమునకు మిక్కిలి కృతజ్ఞురాలను.

వాసంతి—మీ వంటి సత్తపస్వినుల దర్శన భాగ్యము అపరూపము కదా? అగస్త్యాశ్రమప్రయాణ మేలకో తెలిసికొనవచ్చునా?

ఆత్రేయి—దాని కేమి? బ్రహ్మవిద్యాభ్యాసమునకై అగస్త్యాశ్రమప్రవేశమును అభిలషించుచున్నాను.

వాసంతి—ఆఁ, ఎంతటి విచిత్రము!

ఆత్రేయి—ఏమిటా విచిత్రము?

వాసంతి—ఎందరో తాపసికులు ప్రాచేతస మహర్షియైన వాల్మీకి చెంతకే బ్రహ్మవిద్యాభ్యాసమునకై వెళ్ళుచుండగా నీ వింత పోకడ విచిత్రము కదా?

ఆత్రేయి—నీ ఊహ పొరపాటు. వాల్మీకి మహర్షిలో ఇప్పుడు తెలియ చెప్పరానంతటి భేదము వచ్చినది. ఆయనలో వచ్చిన మార్పు ప్రపంచానికే అనర్థదాయకము.

వాసంతి—ఏమి టంతటి మార్పు? వినుటకు చాల ఆతురతగా నున్నాను—వినిపించుము. సహజముగా మహామహులలో వచ్చు మార్పు ప్రపంచశ్రేయస్సునకే కారణ మగు నందురు. ఇది ఆ సిద్ధాంతమునకు వ్యతిరేకముగా ఉన్నట్లున్నదే!

ఆత్రేయి—సిద్ధాంతాలు తల్లక్రిందు లగుటవల్లనే ఇట్టి విపరీతపు మార్పు. చెప్పెదను, శ్రద్ధగా వినుము. వాల్మీకిని లౌకికవాంఛలు ఆవరించినవి.

బ్రహ్మవిద్యాబోధనకు ఆయన ఇప్పుడు పూనుకొనుట లేదు.

వాసంతి—అగ్నిని దరిచేరిన తృణము లెట్లు దగ్ధమగునో, అట్లే నిష్కామకర్ములైన మునుల జేరిన లౌకికవాంఛలు సైతము దూరీకృతములు కావా?

ఆత్రేయి—నీ వనుకొన్న దమ్మా, సీతాదేవి కుమారులైన లవకుశుల ఆశ్రమవాసముతో సర్వము తారుమారైనది. ఎల్లకాలము వారితో మాట్లాడుచు వాత్సల్యబద్ధుడై, వారికి లౌకికవిద్యలను నేర్పుచు కాలము గడపుచుండెను. మరి రామాయణరచన ఒకటి. అది ఆమ్నాయముల కంటె వేరైన ఛందస్సు కలిగి, సామాన్య ప్రాపంచికవిషయజాలముతో కూడుకొని వుండును. నా కీ పద్ధతి ఏమాత్రమును సరిపోలేదు. అందులకే ఆశ్రమమును వదలి వచ్చుచున్నాను.

వాసంతి—ఏమి, బ్రహ్మర్షి ప్రాకృతికవాంఛాబద్ధు డైనాడా? వినుటకు సైతము ఆశ్చర్యకరముగా ఉన్నదే! సీతాదేవి ఆశ్రమప్రవేశము, లవకుశుల జననము విని ఉంటిమి. రామాయణరచనను గూర్చిన సమాచారమే తెలియదు, వివరింపుము—అందు ఎట్టి విషయములు వర్ణింపబడినవి?

ఆత్రేయి—ఎట్టి విషయము లని చెప్ప గలను? ఏమిటో శృంగారమట, దుఃఖరసమట, స్త్రీపురుషాదుల ప్రణయములు, హింస, యుద్ధము మొదలుగాగలవి ఎన్నెని కలవు. సంసారవాసనలు కుప్పతిప్పలు. వివరములన్నీ అడిగి నన్ను బాధ పెట్టకుము. తలచుకొన్న శరీరము ఝల్లు మనును.

వాసంతి—తెలిసినది. అది అట్లుండ నిమ్ము. ఈ ఫలములను తిని ఆకలి తీర్చుకొమ్ము. తర్వాత సావధానముగా మాట్లాడవచ్చును.

ఆత్రేయి—నీ అతిథివాత్సల్యమునకు ధన్యవాదాలు. నేను అగస్త్యాశ్రమము చేరువరకు ఏమియు తిన తలచుకోలేదు. క్షమించు. అన్యథా భావించవద్దు.

వాసంతి—నీ ఇష్టము. తపస్వినులు స్వేచ్ఛావర్తినులు. ఆమ్నాయములకంటె వేరైన ఛందస్సు రామాయణములో కల దంటివి. అట్టి నూతనసృష్టి ఎట్లు ఏర్పడినదో వివరింపుము.

ఆత్రేయి—అది ఒక గాథ. నాకు కాలాతీత మగును. నీ కంతటి శ్రద్ధ కలదేని ఆశ్రమమునకు వెళ్ళి రామాయణగానమును శ్రవణానందముగా వినుము.

వాసంతి—ఆ మాత్రమైన చెప్పజాలవా?

ఆత్రేయి—కాలాతీత మేల అనిమాత్రమే. ఒక నాడు మధ్యాహ్నసమయమున తమసానదిలో స్నానమాచరించి వాల్మీకి వచ్చుచుండగా ఒక చెట్టుపై క్రీడించుచున్న క్రౌంచమిథునములో నొకదానిని వేటకాడు బాణముతో కొట్టుటను చూచినాడు. అంతి నాకస్మికముగా కల్గిన హృదయశోకమును ఈ క్రింది విధముగా వెల్లడించినాడు.

"మా నిషాద! ప్రతిష్ఠాంత్వ మగమ శ్శాశ్వతీ స్సమాః,
యత్క్రౌంచమిథునా దేకమవధీః కామమోహితమ్."

ఇట్లు శబ్దబ్రహ్మనిర్గ్భవమును పొందిన వాల్మీకి మహర్షికి బ్రహ్మ ప్రత్యక్షమై "నీ విక కవితాప్రబుద్ధుడవైతివి. రామచరిత్రమును వర్ణింపుము. ఆదికవి వైతివి." అని చెప్పెను. నాటి నుండి రామాయణరచనకు ఉపక్రమించెను.

వాసంతి—ఎంతటి శుభవార్త! రాముని దివ్యచరిత్రము వాల్మీకికవితాప్రభావమున ప్రపంచమున శాశ్వతస్థాయిని అంద నుండుట ముదావహము.

ఆత్రేయి—నీ సంతోషమునకు అర్థము లేదు. అగస్త్యాశ్రమమునకు దారి చూపుము.

వాసంతి—నీ అమాయకత్వమును ఏమని చెప్పగలను? ప్రపంచాదర్శపురుషుడైన రాముని చరిత్రను రచించి వాల్మీకి మానవుల నుద్ధరింపనున్నాడు. నీ వాసత్యమును గమనింపజాలవైతివి.

ఆత్రేయి—నా కా గొడవతో అక్కర లేదు. నీకు ఇష్టమున్న వెళ్ళి రామాయణము వినుము.

వాసంతి—అంతకంటె మహాభాగ్యము నాకు వేరొకటి లేదు. వాల్మీకి ఆశ్రమమునకు వెళ్ళి శ్రవణ

చేయుముగ రామాయణము విని ప్రపంచమున ప్రచారము చేయ బూనుకొందును.

ఆత్రేయి — ఎవరి పిచ్చి వారి కానందము. నీవలన రామాయణము సుప్రచారితము అగును గాక! నాకు మార్గము చూపుము. (కొంచెము ఆలోచించి) ఆఁ, మరచితిని. నీ వెవరో తెలిసికొనవచ్చునా? మాటలసందట జ్ఞాపకమే రాలేదు.

వాసంతి — నే నీ జనస్థానదేవతనైన వాసంతిని. నీ మహోపకారమునకు మిక్కిలి కృతజ్ఞురాలను. రామ చరిత్రమును విను భాగ్యమును నాకు కల్గించితివి.

ఆత్రేయి — ఎవరి భాగ్యము వారిది. దయచేసి దారి చూపుము.

వాసంతి — (చేతితో చూపుచు) పంచవటి మీదుగా గోదావరీతీరమును అనుసరించి నడుపుము. అగస్త్యాశ్రమము చేరగలవు.

ఆత్రేయి — ఇక సెలవు. నేను పోయివచ్చెదను.

(మార్గమును బట్టి వెళ్ళును.)

వాసంతి — నాజన్మ సఫలమైనది. రామాయణమును విని ప్రపంచమున ప్రచారము చేయుదును. ఇందుకు కారణమైన ఆత్రేయి ప్రపంచచరిత్రలో అమరజీవి. వెంటనే వాల్మీకి ఆశ్రమమునకు ప్రయాణ సన్నాహము కావింతును.

(నిష్క్రమించును.)

---

# అరవింద దర్శనము

●

శ్రీ దేశిరాజు కృష్ణశర్మ

౧

అరవిందాత్ముని గంటి కంటిని అనిత్యానందలోకాంతర
స్థిర సంకల్పము స్థాయిగన్న పరమక్షేమంబు, చైతన్యమం
దిర విజ్ఞానమయాంతరాళవిలసత్తేజంబు, సర్వాంగసుం
దర విన్యాసము దివ్యజీవన చిదానందస్ఫురత్ప్రాజ్ఞునిన్.

౨

కంటిని గంటి నాకనులు కాంచగ లేని మనోహరత్వమున్
కంటి నెదో మహాపరమకాంతిని నాహృదయాన వెన్నెలల్
పంటగ నిండి నాతలపు బాటలు వీణలు మ్రోగినట్లు నా
వెంటనె గుర్తుపట్టి పరువెత్తిన ధన్యతతోడి సత్కృతిన్.

3

నీవాక సత్యచైత్యరమణీయతతో దిగివచ్చినట్లు, నా
లో వసియించినట్లు ఎటులో రిపుసత్వములన్ కృశించు బా
ధావివరంబు నాఎడద శల్పు లోకింతగ ఓరజేసి నీ
కై వెతుకాడినన్ దొరకవైతివి ఈయెడ దాగి దొంగవై.

౪

నా కనుచూపుమేరల కనంబడు జీవిత భూమికన్ జగు
ప్సాకలుషంబు నర్తనము సల్పు అపశ్రుతి తోడుగాగ, నీ
వీకడ నుండ ఈ జగతి కింత దరిద్రత ఏల—స్వామి! నీ
వే కరుణించి తేగదవె ఈ యెడ కింత ప్రయోజకత్వమున్.

౫

ఇది వ్యామోహనిబద్ధ మీ బ్రతుకు కింతేగాదు కోర్కెల్ తుదల్
విదళింతున్ కృతమోహనాత్మతను, భావింతున్ మహాభోగసం
పద రాజిల్లెడు శాశ్వతానుభవ సంప్రాప్తంబు నే నెవ్వడో?
ఇది నా కెందుకొ? ఎంతకాల మిట—ముందేరీతి సాగించుటో?

౬

ఒక యాదృచ్ఛికశక్తి నా బ్రతుకు నేదో లాలి పాడించి, వా
రక జోకొట్టును వాఙ్మనః క్రియల సర్వస్వంబు దీక్షాధృతిన్
సకలాశల్ పరువెత్తగా జనెడు వాంఛన్ శాశ్వతోన్మాదినై
ఒక ఖైదుంబడి జీవితాంతరము నిర్వాహించి లక్షించెదన్.

౭

ఈయసమర్థతాజడత ఎంతకు వీడియు వీడిపోని ఆ
ప్యాయతతో ఉషోంబరము పన్నిన లేతవెలుంగుచీకటై
పోయెను మానసాంబరపు ప్రొద్దులలో తొలిబాలసూర్య రే
ఖాయతనంబునన్ కనులు గానవు విన్పడ దేమి చెప్పినన్.

—

# భారతకేంద్రన్యాయస్థానము

శ్రీ పంద్రంగి రాజేశ్వరరావు

ఫెడరల్ సంప్రదాయానుసారముగ ప్రజా ప్రభుత్వమును సక్రమముగ నడుపుటకు చట్టబద్ధమగు నిర్వహణ మత్యవసరము. వివిధపరిపాలనాశాఖలతో గల పరస్పరసంబంధము రాజ్యాంగమందు కేంద్రన్యాయస్థానమునకు గల ప్రతిపత్తి, అధికారఅంతస్తులకు దోహద మిచ్చును. ధైర్యసాహసములతోను, వివేకవివేచనాదృష్టితోను కేంద్రన్యాయస్థానము తన పాత్రను నిర్వహింపవలయును. కార్యనిర్వాహకవర్గముయొక్క అధికార హోదాలకు గల హద్దులను చట్టరీత్యా నిర్వచించుట గురుతరమగు బాధ్యత. ఫ్రాంకుఫర్టరుపండితుడు (ఈయన ప్రస్తుతము అమెరికాసంయుక్త రాష్ట్రముల సుప్రీముకోర్టు జడ్జీ.) "రాజ్యాంగ మనగా ముద్రింపబడిన అంత్యనిర్ణయము కాక దినదిన ప్రవర్ధమానమగు దృశ్యము. పరిపాలనా యంత్రము నందుల కనుగుణముగ నడుపుట అప్రయత్నముగ చేయు పరిపాటైన పనికాక యుక్తాయుక్తవిచక్షణలతో కూడిన రాజనీతి" అని చెప్పియుండెను. సాంఘిక, ఆర్థిక, రాజకీయవాతావరణకు సమన్వయమగునట్లు రాజ్యాంగసూత్రములను వ్యాఖ్యానించవలయును. నూతన రాజ్యాంగము ననుసరించి ఏర్పడు భారతకేంద్రన్యాయస్థానమునకు ఇతర ప్రజాస్వామికములందు గల కేంద్రన్యాయస్థానములకంటె విస్తరమగు అధికారములు కలవని చెప్పవలసియున్నది.

ప్రతిసంస్థయొక్క పరిణామము దానిని నిర్వహించెడు వ్యక్తులశక్తిసామర్థ్యములపై ఆధారపడియుండును. మన సుప్రీముకోర్టు, ప్రధానన్యాయమూర్తిగాక మరి ఆర్గురు న్యాయమూర్తులతో ప్రారంభమగును. అవసరమగుచో పార్లమెంటు న్యాయమూర్తుల సంఖ్యను పెంచుటకు చట్టము చేయవచ్చును. రాష్ట్రహైకోర్టులలో అయిదుసంవత్సరములపాటు జడ్జీగా పనిచేసినట్టి లేక పదిసంవత్సరములపాటు న్యాయవాదిగా విశేషానుభవము సంపాదించినట్టి మరిన్ని న్యాయశాస్త్రకోవిదులు అయినట్టివారు సుప్రీముకోర్టుజడ్జీలుగా నియమింపబడుటకు అర్హులు. వీరికి హైకోర్టుజడ్జీలకు అంతస్తునందు జీతభత్యములందు గల తారతమ్యమువల్ల హైకోర్టుజడ్జీలు సుప్రీముకోర్టున కెగబాకుటకు అనుచితమగు ప్రయత్నములు చేయు సందర్భము లుండకపోవు. ఇంగ్లండునందిటువంటి ప్రమాదము లేదు. అచట హైకోర్టుజడ్జీలకు, అప్పీలుకోర్టుజడ్జీలకు జీతభత్యములు సమానము. అంతస్తునందు హోదాయందు తప్ప మరేవిషయమందు ఎట్టి తేడాలు లేవు.

సుప్రీముకోర్టుజడ్జీలను మంత్రుల సలహాపై అధ్యక్షుడు నియమించును. ప్రధానన్యాయమూర్తి సలహా కూడ గైకొనబడును. వీరినడుమ అభిప్రాయభేదము లేర్పడినపుడు దేమి జరుగునో చూడవలసియున్నది. కార్యనిర్వాహకవర్గమున కీవిషయమై సంపూర్ణమగు హక్కు ఉన్నప్పటికి ఆహక్కును సక్రమముగను, నిష్పేచిగను నిర్వర్తించుటకు తగు సంప్రదాయములు క్రమేపి బయలుదేరవలయును. స్వాతంత్ర్యము చాలవరకు మన సత్త్వమునకు సంబంధించినది. విజ్ఞానసంపత్తి, నీతి, సత్యము దీనిని పెంపొందించును. న్యాయశాస్త్రము యొక్క ఔన్నత్యము, అంతస్తు జడ్జీలయొక్క నిర్వచన పటిమ, అధికారాధిక్యతలపై ఆధారపడియుండును. సంస్కారము ముఖ్యమైనపుడు ఎన్నిరక్షణలు, ఎట్టి కట్టుదిట్టములు ఉన్నను నిరుపయోగమగును. వీరు ౬౫ సంవత్సరములు నిండువరకు పదవులయం దుండవచ్చును. ప్రస్తుతము శక్తిసామర్థ్యములు, అనుభవము గల వ్యక్తులు తక్కువగా ఉన్నారని చెప్పవలసియున్నది. అమెరికా సంయుక్త రాష్ట్రములందు ప్రఖ్యాతిగన్న న్యాయమూర్తి హోమ్సు ౯౨ సంవత్సరములు గడచువరకు పని చేసెను. అచట విశ్రాంతి తీసుకొనుటకు వయస్సు నియమము లేదు. ఇంగ్లండునందు పింఛను తీసుకొనుటకు ౭౦ సంవత్సరముల పరిమితి యున్నప్పటికి పూర్తిగా నెరసిన బారెడుగడ్డము మూరెడుమీసము గల శతవృద్ధులు ప్రీవీకౌన్సిలు బెంచిమీద తరుచు దర్శన మిచ్చుచుందురు. మన దేశమందుకూడ శీతోష్ణస్థితు లతికఠినముగ నున్నను ౬౦ సంవత్సరములకు పైబడినవారిలో చాలమంది మంచి ఆరోగ్యమును, మానసికపటుత్వమును కలిగియున్నారు. అవసరమగునపుడు విశ్రాంతిగైకొన్న జడ్జీలనుసైతము పిలువనంపు ఏర్పాటు

అమెరికా ఇంగ్లండులందు కలదు. ఆ సంప్రదాయము మన రాజ్యాంగమందు పొందుపరుపబడినది. అవసరమగునంతమంది జడ్జీలు సందర్భ్యము కానపుడు భారత ప్రధానన్యాయమూర్తి రాష్ట్రప్రధాన న్యాయమూర్తులను సంప్రతించి ఆయా హైకోర్టు జడ్జీలను పబ్బము గడచువరకు సుప్రీముకోర్టుజడ్జీలుగా నియమించవచ్చును. అచట నున్నంత కాలము వారలకుకూడ సుప్రీముకోర్టు జడ్జీల అంతస్తు, ప్రతిపత్తి, అధికారము, గౌరవము పరిపూర్ణముగా నుండును.

జడ్జీ తన ఉద్యోగమునకు రాజీనామా నీయవచ్చును. కాని అతనిని పదచ్యుతుని చేయవలెనన్న పార్లమెంటునందలి అధికసంఖ్యాకసభ్యులు, ఆనాడు హాజరైనవారిలో మూడింట రెండువంతులమంది తీర్మానించినపిమ్మటనే అధ్యక్షుడు అట్టి హుకుము జారీచేయవచ్చును. విశ్రాంతి గైకొన్న జడ్జీలు ఏకోర్టు, లేక అధికారియెదుట న్యాయవాదిగా పనిచేయుట నిషిద్ధము. కొంత నిర్ణీతకాలము పనిచేసినపిమ్మటనే ఉపకారవేతనమునకు అర్హులగుదురను నిర్బంధము ఒకవిధముగా అవరోధకరము. నిర్ణీతకాలము గడచులోపున జడ్జీ అనారోగ్యపడినను ఉపకారవేతనము పోవు నను భయముచే శక్తి లేనప్పటికి ఉద్యోగము నంటిపెట్టుకొనియుండుటకు ప్రాకులాడును. అనారోగ్యకారణముగా జడ్జీలు పనిచేయలేనపుడు ఎట్టి షరతు లేకుండ వారికి పూర్తిఉపకారవేతన మిచ్చి పంపుట మంచిది. ఇందువల్ల ఏర్పడు అదనపుఖర్చు స్వల్పము. అట్లు విశ్రాంతి గైకొను జడ్జీలసంఖ్య బహుతక్కువగా నుండును. అమెరికా సంయుక్తరాష్ట్రములందు జడ్జీల వేతనమునకు ఉపకారవేతనమునకు తేడాయే లేదు. బ్రిటనులో ఉపకారవేతనము అసలు వేతనములో నాల్గింట మూడు పాళ్లుండును. మన దేశమందుకూడ జడ్జీల ఉపకారవేతనమునకు సంబంధించిన నిబంధనలను సక్రమముగ సవరించుట ఉచితమని తోచుచున్నది.

సుప్రీముకోర్టుకు, ఒరిజినలు అప్పెలేటు, రివిజనలు, సలహానిచ్చు అధికారములు కలవు. (౧) భారత ప్రభుత్వ, రాష్ట్రప్రభుత్వములనడుమ (౨) భారత ప్రభుత్వముతోపాటు మరొక రాష్ట్రప్రభుత్వమునకు, ఇంకొక రాష్ట్రప్రభుత్వమునకు (౩) రాష్ట్రప్రభుత్వములనడుమ వివాదము కల్గినపుడు ఒరిజినల్ జ్యూరిస్డిక్షను ఏర్పడును. ఏ హైకోర్టుతీర్పయినను రాజ్యాంగచట్టమునకు, లేక ప్రధానన్యాయమూర్తి నిర్వచనమునకు సంబంధించినదై అట్టిదని రాష్ట్రహైకోర్టు సర్టిఫికెట్టు ఇచ్చినపుడు, లేక ఆ హైకోర్టు అట్టి సర్టిఫికెట్టు యివ్వకపోయినను సుప్రీముకోర్టు ప్రత్యేకముగా అనుమతినిచ్చినపుడు అప్పీలు చేయవచ్చును. ఈ క్రింది పరిస్థితులందు—

(౧) దావాలగాయిదా విలువ రు. ౨౦,౦౦౦ లు గాని, పార్లమెంటు నిర్ణయించే తదితర మొత్తము గాని అయినపుడు,

(౨) హైకోర్టుతీర్పు ప్రత్యక్షముగనో, లేక పరోక్షముగనో రు. ౨౦,౦౦౦ల మొత్తమునకు సంబంధించిన హక్కులకు నిర్ధారణచేయునపుడు,

(౩) సదరుకేసు సుప్రీముకోర్టుకు పంపబడు అర్హత కలదని

హైకోర్టు సర్టిఫికెట్టు యిచ్చినమీదట అప్పీలు చేయవచ్చును. సుప్రీముకోర్టుకు గల అప్పీలుఅధికారములను పార్లమెంటు సంకుచితము చేయలేనప్పటికి అప్పీళ్ళ స్వభావమును, సంఖ్యను తగ్గించు సావకాశము కలదు.

మరిన్ని సుప్రీముకోర్టుకు (౧) హైకోర్టుకు ముద్దాయి విడుదలపై అప్పీలుచేయబడగా మరణశిక్ష విధింపబడినపుడు (౨) క్రిందికోర్టులో విచారణ అగుచున్న కేసును హైకోర్టు తన ఫైలులోనికి తీసుకొని ముద్దాయికి మరణదండన విధించినపుడు (౩) హైకోర్టు తీర్పుయిచ్చినపిమ్మట సదరుకేసు సుప్రీముకోర్టుకు పంపదగినదని నిర్ణయించినపుడు అప్పీలు చేయవచ్చును. కాని ఏముద్దాయినైనను క్రిందికోర్టు ప్రమాదకరమైన దెబ్బకొట్టినట్లు నిర్ణయించి శిక్ష విధించినపుడు, అప్పీలులో హైకోర్టు ఖూనీ నేరమని నిర్ణయించి మరణదండన విధించినపుడు, అటుపైన సుప్రీముకోర్టుకు అప్పీలుచేయు అధికారము లేదు. ఏ క్రిమినలుకేసునందైనను అప్పీలుచేయుటకు ప్రత్యేకపు అనుమతినిచ్చుటకు సుప్రీముకోర్టుకు సంపూర్ణముగు అధికారమున్నప్పటికి పౌరుల ప్రాణరక్షణలకు సంబంధించినంతవరకు కేంద్రన్యాయస్థానమునకు అప్పీలుచేయు అధికారముండుట అత్యావశ్యకము. ఇందులకు మానవజీవితముయొక్క పవిత్రతయే గీటురాయి. సుప్రీముకోర్టు పరిశీలించినమీదటనే మరణదండన అమలుపరచుట ఉచితము. మరణదండనయే శిక్షాస్మృతినుండి తప్పించిన ఇట్టి సమస్యయుండదు. సుప్రీముకోర్టు తన తీర్పులను పునఃపరిశీలింపవచ్చును. ఈ తీర్పులు కేవ

పెట్టెడలను నిరాఘాటముగా చెల్లును. అందులకై అన్ని శాఖల అధికారులపైన తగు సహాయసౌకర్యములు చేకూర్చు బాధ్యత కలదు.

సుప్రీముకోర్టు కార్యకలాపములకు సంబంధించిన నిబంధనలు, నియమావళి అధ్యక్షుని అనుమతి పొందవలెను. ఇవి చాలసమస్యలకు సంబంధించినవగుటచే కార్యనిర్వాహకవర్గమునకు ఏదోవిధముగ సంబంధించినవై యుండకతప్పదు. కాని, కొన్ని ప్రత్యేకముగా న్యాయశాఖకు సంబంధించినవే. అటువంటి విషయములందు అధ్యక్షుని అనుమతి నామమాత్రముగ నుండవలయును. పరిపాలనకు సంబంధించినంతవరకు కార్యనిర్వాహకవర్గముతో సమన్వయము చేయుట సహజము. న్యాయశాఖ నిర్వహణమందుమాత్రము స్వపరిపాలన సంపూర్ణముగ నుండవలయును. ప్రధాన న్యాయమూర్తి తనకు కావలసిన సిబ్బందియొక్క జీతభత్యములను అధ్యక్షుని అనుమతితో నిర్ణయించవలెను. సుప్రీముకోర్టుకు సంబంధించిన ఖర్చు విమర్శనీయము కాదు.

సలహా నొసగువిషయమై ఒకింత భేదాభిప్రాయ మున్నది. స్వతంత్రదేశముల న్యాయశాఖ చరిత్రలో కార్యనిర్వాహకవర్గమునకు సలహా నిచ్చు విషయమై నిర్లక్ష్యము అపాయ కలదు. ఇందువలన ఉత్తరోత్తర చిక్కులు కలుగక మానవు. తదుపరి కోర్టుకు వచ్చు కక్షిదారులకుకూడ అసౌకర్యము, అన్యాయము జరుగవచ్చును. అమెరికా సంయుక్తరాష్ట్రముల సుప్రీముకోర్టు ఆదినుండియు సలహానివ్వ నిరాకరించెను. అట్టిపని న్యాయస్థానమునకుగల ఔన్నత్యమును న్యూనత చేకూర్చును. సలహాలు స్థిరమై పిశాచములవలె బాధించును. ఎట్టి పరిస్థితులందైనను కోర్టులు సలహా యిచ్చుటకు తగు సబబు కనిపించదు. జడ్జీలపని తీర్పు చెప్పుట కాని సలహా నిచ్చుట కాదు. కోర్టులు సలహా నిచ్చుట సంపూర్ణముగా అనుచితము.

పదవియందున్న లేక విశ్రాంతి తీసుకొన్న జడ్జీలను తదితర పదవులకు నియమించు విషయమై యిదమిత్థమని తేలలేదు. ఇంగ్లండునందు పింఛను తీసుకొన్న జడ్జీలు మరేయితరపదవులనైనను స్వీకరించుట సంప్రదాయరీత్యా నిషిద్ధము. మన దేశమందు విశ్రాంతితీసుకొన్న జడ్జీలకు ఉద్యోగములిచ్చు అలవాటు హెచ్చుపెరిగినది. సంస్థానములలో గల ప్రధాన న్యాయమూర్తులు చాలవరకు వీరే. ఈఏర్పాటు ప్రజాప్రభుత్వ తత్వమునకు విరుద్ధము. ఈ పరిస్థితులందు జడ్జీలుకూడ పదవుల ఆశతో ఉన్నతాధికారుల ఎదుట వినయవిధేయతలతో వారి కనుసన్నల ననుసరించి మసలుదు రనుటలో అతిశయోక్తి లేదు. అపుడు స్వాతంత్ర్యము, సమదర్శిత్వము మృగ్యమగును. అందుచేత జడ్జీల నెవ్వరిని తదితర పదవులకు నియమింపరాదను సూత్రము రాజ్యాంగమందు చేర్చుట అత్యవసరము. ప్రత్యేక పరిస్థితులందు తాత్కాలికముగ ఈ నియమమును సడలింపవచ్చును. ఇంగ్లండునందుకూడ టోమ్లిన్ ప్రభువు సివిలుసర్వీసు కమీషను అధ్యక్షుడుగాను, మేక్మిలను ప్రభువు బ్యాంకింగ్ అండ్ ఇండస్ట్రీస్ కమీషను అధ్యక్షుడుగాను అఖండమగు సేవ చేసిరి. యుద్ధసమయమందుకూడ ఇట్టి నియామకములు కావచ్చును. కొందరు జడ్జీలు మౌల్టను ప్రభువవలె వైజ్ఞానికవేత్త లయియుండవచ్చును. రీడింగు గ్రీనీ ప్రభువులవలెను, ఆస్ట్రేలియను ప్రధానన్యాయమూర్తి గ్రిఫ్ఫిత్సులవలెను అంబాసిడర్ రాయబారులుగ పేరు ప్రఖ్యాతులు సంపాదించువారుకూడ ఉందురు.

మన దేశమందుకూడ సర్ శ్రీనివాసవరదాచారిగారు ఫెడరల్ జడ్జీగా విశ్రాంతితీసుకొన్న పిదప సెంట్రల్ పే కమీషను, ఇక్ కమిటీ ఇక్ ఇన్వెస్టిగేషను కమిటీల అధ్యక్షులుగా గమనార్హమైన సేవ చేసిరి. సర్ బెనగల నరసింగరావుగారి సర్వతోముఖమగు సేవలు చరిత్రాత్మకమైనవి. పూర్వముకూడ పలువురు జడ్జీలు వివిధ విషయములం దద్వితీయు లనిపించుకొనిరి. మహాగోవిందరానడే మనదేశమందు సంఘసంస్కరణకు, అర్థశాస్త్రమునకు పునాదివేసెను. సర్ అశుతోషుముఖర్జీ విద్యావేత్తగా వికసిల్లెను. సర్ షా మహమ్మదు సులేమాను గణితశాస్త్రజ్ఞుడుగాను, విజ్ఞానవేత్తగాను పేర్గాంచెను. రైట్ ఆనరబుల్ డాక్టరు ముకుందరామారావు జయకరు (ప్రివీకౌన్సిలరు) పలువిధముల ప్రజాహిత జీవితముతో తనకుగల సంబంధమును ఎన్నడును విడనాడలేదు. ఈ ఉదాహరణలు మచ్చుకుమాత్రమే. అందువలన అత్యవసరమైనపుడు జడ్జీల ప్రత్యేక శక్తిసామర్థ్యములను ఉచితమగురీతిని ఉపయోగించుటయే సకలవిధముల శ్రేయస్కరము. ప్రతిప్రభుత్వమునకు దాని న్యాయనిర్వహణయంత్రమే గీటురాయి అని బ్రైసుపండితుడు చెప్పియున్నాడు. భారత కేంద్రన్యాయస్థానమేవిధముగను తదితర ప్రజాస్వామిక దేశములందలి కేంద్రన్యాయస్థానములకు తీసిపోదని ఆశించవచ్చును.

# ప్లేటో అనుకరణవాదము

## 2. ధర్మస్వరూపము

శ్రీ జి. వి. కృష్ణరావు

ఇంతవరకు జ్ఞానస్వరూపం, ఆత్మలక్షణం, సృష్టిక్రమం చూచాము. ఇక ధర్మాన్నిగూర్చి ప్లేటో ఏమి చెబుతున్నాడో చూదాము.

జ్ఞానస్వరూపవిచారసందర్భంలో భావజగత్తే ఒకటే యథార్థమనీ, యీ భౌతికజగత్తు ఆభాసమనీ తేల్చుకొన్నాము. ధర్మం కూడా ఆ భావజగత్తులోనిది. అంటే ధర్మం అనేది యథార్థం. అది మనః కల్పితం కాదు. భౌతికమూ కాదు. దృక్కునకంటె (*Subject*) భిన్నం. అంటే మానవుడు దానిని కల్పించలేదు. ధర్మం అతని యిష్టానిష్టాలమీద ఆధారపడలేదు. మానవుని కోరికలను అభిమతాలను ఆశ్రయించి ఉండటం లేదు. ధర్మస్వరూపం దేశకాలపాత్రలనుబట్టి, మానవుల ఊహలనుబట్టి ఏర్పడటం లేదు. అంటే ఒకటి అనాదినుంచి వస్తున్నంతమాత్రాన, ప్రజానీకం శిరసా వహిస్తున్నంతమాత్రాన, ఒక జాతిలో సంప్రదాయం అయినంతమాత్రాన ధర్మం కాదు. ఈ ధర్మం అనేది ఒక దేశంలో, ఒక జాతికి, ఒక వ్యక్తికి, ఒకప్పుడు ధర్మమై, మరొక దేశంలో, మరొక జాతికి, మరొక వ్యక్తికి, మరొకప్పుడు ధర్మం కాకపోదు. ధర్మమైనది మూడుకాలాలకు, సర్వదేశాలకు, సర్వ రాజ్యాలకు, సమస్తవ్యక్తులకు ధర్మమే. ఈ ధర్మాన్ని ఆచారవ్యవహారాలుకాని, సంప్రదాయాలుకాని, అభిప్రాయాలుకాని నిర్దేశించలేవు. వీటిమీద ధర్మం ఆధారపడి లేదు. ఈ ధర్మం పంచేంద్రియగోచరం కాదు. అంటే ప్రత్యక్షానుభవవేద్యం కాదు. ఊహాపోహాలకు అందేది కాదు. ఏకతానతాప్రాప్యం (*Intuitional*) అంతకన్న కాదు. కేవలం వివేకైకవేద్యం. అందువల్ల ధర్మస్వరూపనిర్ణయంలో ప్రజల అభిప్రాయంతో కాని, ప్రత్యక్షానుభవాలతో కాని, వృద్ధాచారాలతో కాని, సంప్రదాయాలతో కాని నిమిత్తం లేదు.

ఈ ధర్మం వ్యక్తికైనా, రాజ్యానికైనా, ప్రభుత్వానికైనా ఒకటే. ఇది వ్యక్తిధర్మం, ఇది ప్రభుత్వధర్మం, ఇది రాజకీయధర్మం, ఇది సామాజికం అన్న విభేదం లేదు. అందరు వ్యక్తులకూ, అన్ని ప్రభుత్వాలకూ ధర్మం ఒక్కటే. అంటే ధర్మం ఒకటే అయినా అటు వ్యక్తికమూ, ఇటు సామాజికమూ అవుతున్నది. పారమార్థికమూ, నిత్యమూ, యథార్థమూ, వివేకైకవేద్యమూ అయిన ఈ ధర్మభావం వ్యక్తిద్వారా సమాజంద్వారా అభివ్యక్త మౌతున్నది.

భావజగత్తులో ఈ పారమార్థికధర్మానికి ప్లేటో యిచ్చిన స్థానం అనన్యం. ఈ ధర్మభావంవల్లనే జ్ఞాతపదార్థానికి సత్యత్వము, జ్ఞాతకు జ్ఞానశక్తి లభిస్తున్నాయి. "ఈ ధర్మభావమే శాస్త్రానికీ, జ్ఞానానికీ విషయమౌతున్న సత్యానికి కారణం. సత్యము, జ్ఞానమూ రమణీయములే అయినా ధర్మభావం రమణీయతరం. భౌతిక జగత్తులో సూర్యుని కేలాంటి స్థాన మున్నదో భావప్రపంచంలో ధర్మానికి అలాంటి స్థానమే ఉంది. సూర్యుడు చూపునకు, వెలుగునకు, అర్థప్రకాశానికి, జగత్సృష్టిపోషణలకు కారణం. అయినా, సూర్యుడు చూపుకంటె, వెలుగుకంటె, అర్థప్రకాశంకంటె, సృష్టిపోషణలకంటె భిన్నుడు. అలాగే ధర్మం కూడా తతిమ్మాభావాలకు కారణం. చూపు వెలుగు సూర్యునివలె ఉన్నా ఎలా సూర్యునికంటె భిన్నమో, శాస్త్రము, సత్యము ధర్మమువంటివే అయినా, ధర్మం కావు. శాస్త్రంకంటె, సత్యంకంటె ధర్మం ఉత్తమం."

ప్లేటో ఇలా భావాలకు ధర్మం మూల మని రిపబ్లిక్ అనే గ్రంథంలో సూచించినా, ఇతర రచనలలో యీవిషయం స్పృశించలేదు. ఆ గ్రంథంలోనైనా లోతుకు పోయి ధర్మంనుంచి తతిమ్మాభావాలు ఎలా నిష్పన్నమౌతున్నవో విశదీకరించలేదు. ఏది

ఎలా ఉన్నా అతడు బహుత్వవాదే (*Pluralist*) కాని ఏకత్వవాది కాడు.

ఇంతకూ మానవజీవితలక్ష్య మేమిటి? అతడు జీవితంలో ఏమి సాధించాలి? వ్యక్తిగా, సామాజికుడుగా ఏమి చేయాలి? ఎలాంటి జీవితం సార్థకం? ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పబోయేముందు లోగడ చెప్పుకొన్న విషయాలు గుర్తుకు తెచ్చుకోవాలి. భౌతికపదార్థాలన్నీ నశ్వరాలు, అయథార్థాలు. అయితే యివి పారమార్థికభావాలను అభివ్యక్తం చేస్తున్నాయి. అంతకు తప్ప వీనివల్ల ప్రయోజనం లేదు. ఈ జగత్తులో ఆత్మ ఒక్కటే నిత్యం, సత్యం. దేహి అయిన ఆత్మకు భావాల జ్ఞానం పొందటం కర్తవ్యం. అయితే, యింద్రియజన్యజ్ఞానం యథార్థం కాదు. పంచేంద్రియాలవల్ల అభిప్రాయంమాత్రమే కలుగుతున్నది. అందువల్ల ఇంద్రియలోలుడైన మానవుడు జ్ఞానం పొందలేడు. జ్ఞానం పొందలేకపోగా దానికి దూరమౌతున్నాడు. జ్ఞానమే పుణ్యం. పుణ్యపురుషుడు ఇంద్రియలోభాలకు లోబడడు. ఇంద్రియాలను జయించి అంతర్ముఖుడై విచారం సాగిస్తాడు. అసలు శరీరం ఉండగా యథార్థజ్ఞానం దుర్లభం. ఎందుకంటే, శరీరంవల్ల కలిగే యాతనలు అన్నీ యిన్నీ కావు. దానికి తిండి కావాలి. తిండి ఉన్నా, వ్యాధి పీడిస్తూ మనస్సును చీకాకుపరచి సత్యాన్వేషణ సాగనీదు. తిండి ఉండి వ్యాధులు లేకపోయినా, శరీరం అరిషడ్వర్గమంత్రాంగానికి లోనై ముప్పతిప్పలు పెడుతుంది. విచారించే శక్తి కూడా లేకుండా చేస్తుంది. యుద్ధాలు, స్పర్ధలు, వైమనస్యాలు ఎందుకు వస్తున్నాయి? ఈ శరీర మనేది లేకపోతే ఇవన్నీ ఉంటాయా? ధనలోభంవల్ల యుద్ధాలు వస్తున్నాయి. శరీరపోషణకోసం, రక్షణకోసం ధనలోభం ఏర్పడుతున్నది. ఈ ప్రతిబంధకాలన్నిటివల్ల తత్త్వవిచారానికి వ్యవధి లభించటం లేదు. ఒకవేళ అవకాశం లభించినా శరీరం విచారానికి అడ్డుతగిలి, మనోమాలిన్యాలను రెచ్చగొట్టి, సంక్షోభం కలిగించి సత్యం తెలుసుకోనీకుండా చేస్తున్నది. అసలు నిజంగా దేనినిగూర్చి అయినా యథార్థజ్ఞానం కలగాలంటే ఈ దేహత్యాగం జరిగితేతప్ప వీలు లే దని అనుభవం రాయి గుద్ది చెబుతున్నది. పంచేంద్రియాలకు దూరమై, అంతర్ముఖమైనప్పుడు ఆత్మ వస్తువుల యథార్థస్వరూపం తెలుసుకొంటుంది. అప్పుడే వివేకం లభిస్తుంది. అయితే శరీరం ఉండగామాత్రం ఇది జరగదు. ఎందుకంటే, శరీరం ఉండగా ఆత్మ నిర్మలజ్ఞానం పొందలేదు. జ్ఞానం అనేదానిని అసలు పొందటం అనేది ఉంటే మరణానంతరం పొందవలసిందే.

అందువల్ల వివేకికి ఈ దేహం హేయం. దేహమే హేయ మైనప్పుడు వస్త్రాలంకారాలు, సిరిసంపత్తులు, భోగభాగ్యాలు, దాసీ దాసజనసంగతి ప్రత్యేకంగా చెప్ప నవసరం లేదు.

దేహము హేయమైనంతమాత్రాన దానిని విసర్జించివేయాలని, అంటే ఆత్మహత్య చేసుకోవాలని ప్లేటో అభిమతం కాదు. అలా ఆత్మహత్య చేసుకొనే అధికారం మానవునికి లేదు. తన పశువులు కొట్టంలోనుంచి పారిపోతే యజమానుడు సంతోషించనట్లుగా మానవుని బలవన్మరణానికి ఈశ్వరుడు సంతోషించడు. అందువల్ల ఈశ్వరునినుంచి పిలుపువచ్చేటంతవరకు మానవుడు సత్కర్మం చేస్తూ ఉండాలి. ఇంతమాత్రంచేత సర్వసంగపరిత్యాగం చేయాలనీ, సమస్తసుఖభోగాలు పూర్తిగా వదలివేయాలనీ అర్థం కాదు. వాటిని అనుభవించవచ్చును. కాని, ఆఅనుభవక్రియ నిర్లిప్తంగా జరగాలి. అంటే భోగాదులకు మానవుడు దాసుడు కాగూడదు. వివేకచోదిత మైన జీవితం గడపాలి. అంతేకాని ఇంద్రియాలు, రాగద్వేషాదిమనోమాలిన్యాలు నడిపినట్లు నడవగూడదు.

వివేకికి దేహం హేయమంటున్నామంటే మానవునిలో ప్రధానంగా రెండు భాగా లున్నవని వేరే చెప్ప నవసరంలేదు. ఒకటి పరిణామి, నశ్వరము, అయథార్థమైన శరీరం. రెండవది పరిణామరహితం, నిత్యం, యథార్థ మైన ఆత్మ. శరీరం వస్తుతః జడం. ఆత్మ చేతనం. ఈ ఆత్మఉనికివలననే శరీరం చేతనంవలె ఆభాసిస్తున్నది. ఈ ఆత్మవల్లనే దేహానికి ప్రవృత్తి ఏర్పడుతున్నది. ఈ ఆత్మలో వివేకం, సంకల్పం, కామం అనే మూడంశా లున్నవని లోగడ చెప్పు

కున్నాను. వివేకం స్వతంత్రంగా విచారం సాగించాలి. జ్ఞానం పొందాలి. దీనినే వివేచనం (*Wisdom*) అంటారు. వివేచనాచోదితమై వ్యవహరించే సంకల్ప వ్యాపారమే ధైర్యం. కామం అనేది గ్రుడ్డిది. ఇంద్రియచాపల్యానికి లోనై యిష్టంవచ్చినట్లు ఆడటానికి ప్రయత్నిస్తూ ఉంటుంది. అలాంటిదానిని సంకల్పం వివేకనిర్దిష్టమార్గంలో ఉంచాలి. ఇలా కామాన్ని అదుపుఆజ్ఞలలో ఉంచటమే దమనం. ఈవిధంగా ఆత్మలోని మూడంశాలు సామరస్యం పొంది పని చేయటమే న్యాయం. కాబట్టి విషయలౌల్యంవిడిచి శరీరధారణకు వలసినంతమాత్రంగా ఆహారవిహారాదులను అంగీకరిస్తూ, సంకల్పమంత్రిసహాయంతో వివేకప్రభువు కామప్రజలపై సామరస్యంతో పరిపాలన సాగించటం న్యాయం. ఇలాంటి వివేచనాధైర్యదమనన్యాయవిశిష్టమైన జీవితమే ఉత్తమం. మానవుని లక్ష్యం.

ఇంతవరకు వ్యక్తిగతధర్మం ఎలా ఉంటుందో చూచాము. ఇక సామాజికుని ధర్మం ఏమిటో చూదాము. అయితే ధర్మం ఒకటే ననీ అది వ్యక్తికమూ, సామాజికమూ అనీ చూచాము. ప్లేటోమతం ప్రకారం ఉత్తమమానవుడు ఉత్తమసామాజికుడు లేక పౌరుడు అయి ఉండాలి. ఉత్తమపౌరుడు ఉత్తమ రాజ్యంలో ఉంటాడుకాని, మరొకచోట ఉండటం కష్టసాధ్యం. రాజ్యానికి ఏది ధర్మమో విచారించకుండా వ్యక్తికి ఏది ధర్మమో నిర్ణయించటంలో అర్థం లేదు. అందువల్ల మానసిక, సామాజిక, ధార్మిక, రాజకీయసమస్యలను విడదీయక సమ్మిశ్రితంగా విచారించటం ప్లేటోకు అవసరమైంది.

వ్యక్తిధర్మం, సామాజికుని ధర్మం అతడు ఒకటే నంటాడు. "ఆత్మయొక్క బృహద్రూపమే రాజ్య" మని అతని అభిప్రాయం. ఆత్మలో వివేకం, సంకల్పం, కామం అన్న మూడు అంశాలు ఎలా ఉన్నాయో, రాజ్యంలోకూడ పాలకవర్గం, రక్షకవర్గం, వృత్తికారవర్గం అన్న మూడంశా లున్నాయి. వ్యక్తికి న్యాయం లక్ష్యమైనట్లుగా రాజ్యానికి కూడా న్యాయం లక్ష్యం. ఆత్మ అవిభాజ్యమైన అంశాలతో కూడి ఉన్నట్లుగానే రాజ్యంకూడా అవిభాజ్యమైన మూడు వర్గాలతో కూడిఉంది. ఆత్మతో వివేకసంకల్పకామాలకు వేరువేరుగా స్వతంత్రసత్తా లేక మూడూ కలసి ఉంటున్నాయి. ఈ మూడూ వివేచనాచోదితమై సామరస్యం పొందుతున్నవి. అలాగే రాజ్యంలోకూడ పాలకరక్షకవృత్తికారవర్గాలకు వేరువేరుగా స్వతంత్రసత్తా లేక మూడూ కలసిఉండాలి. ఆ మూడూ పాలకవర్గచోదితమై సామరస్యం కలిగి ఉండాలి. అంటే ఆత్మవలె రాజ్యంకూడా సచేతన అవయవముకాని జడమైన అవయవి కాదు. సప్రాణమైన శరీరంలో వివిధఅవయవాలు అవయవిని వీడి నిరర్థకము లౌతున్నట్లే రాజ్యంనుంచి వేరై వర్గాలు నిరర్థకము లౌతున్నవి.

ఈవిధంగా ఆత్మకు బృహద్రూపమే రాజ్యమనటంవల్ల (౧) వృత్తివిభాగం లేక సమాజం లేదనీ, (౨) శరీరంలో అవయవాలవలె రాజ్యంలో మూడు వర్గా లుండాలనీ, (౩) ఈ మూడువర్గాలలోను సామాజికజీవనానికి విరుద్ధమైన ప్రవృత్తి లేదనీ సిద్ధాంత మేర్పడుతున్నది. ఈ సిద్ధాంతాంశాలను విశదంగా తెల్పుకోవటం అవసరం.

### వృత్తివిభాగ ఆవశ్యకత.

సమాజ మంటే పరస్పరసహాయంకోసం చేరిన వ్యక్తుల సమూహం. ఈసమాజంలో ప్రతివ్యక్తీ ఉత్పత్తిచేసి సరకులను ఇస్తాడు, పుచ్చుకొంటాడు. వ్యక్తులు తమ సరకును పరస్పరం మార్చుకోవటం ప్రభుత్వానికి ముఖ్యం. మానవుల అవసరాలను అత్యంత సముచితంగా తీర్చటానికి ప్రభుత్వం ఏర్పాటు చేస్తుంది. జరుగవలసిన ఉత్పత్తిమారకం అత్యంత సమరసంగా జరగటానికి సదుపాయాలు కల్పిస్తుంది. ఇలాంటి విధానంలో వ్యక్తి నిర్వహించవలసిన పాత్ర ఏమిటి? అతడు సమాజానికి అవసరమైన పని చేయాలి. అతడు చేసే పని కున్న విలువ ననుసరించి సమాజంలో అతని కుండే ప్రాముఖ్యం నిర్దిష్టమౌతుంది. అందువల్ల వ్యక్తి తనకు నిర్దిష్టమైన వృత్తిని నిర్వహించటంలో స్వాతంత్ర్యం ఉన్నదికాని తన సంకల్పాను

సారంగా వృత్తిని నిర్ణయించుకోవటంలో స్వాతంత్ర్యం లేదు.

వ్యక్తి తన వృత్తిని తాను నిర్ణయించుకొనే స్వాతంత్ర్యాన్ని ప్రభుత్వం కాపాడాలన్న వాదం ప్లేటో ఏమాత్రం అంగీకరించడు. ఎందుకంటె ప్రత్యక్షానుభవభిన్నమై, శాస్త్రతర్కయోగజమైన వివేకము ననుసరించి సంకల్పం కామాన్ని అదుపాజ్ఞలలో ఉంచటమే న్యాయం. కేవలం వాంఛలను పురస్కరించుకొని బయలుదేరే సంకల్పంప్రకారం నడవటం న్యాయం కాదు.

వస్తువుల మారకంకోసం సమాజం ఏర్పడుతున్నదంటే వృత్తివిభాగం అవసర మనీ, వ్యక్తి తన వృత్తిని తప్ప మరొక వృత్తిని చేయరాదనీ సిద్ధిస్తున్నది. ఒక వ్యక్తి కొన్ని వస్తువులను మారకానికి పెడుతున్నాడంటే, ఆ వస్తువులు అతనికి కావలసిన వాటికంటె ఎక్కువ ఉండాలి. వాటిని పుచ్చుకొనేవానికి అవి తక్కువగా ఉండాలి. మారకానికి వస్తువు లుండాలంటే ఏదో ప్రత్యేకకృషి ఉండాలి. రైతు తనకు కావలసిన ధాన్యంకంటె ఎక్కువ పండిస్తాడు. వడ్రంగి ఎక్కువ నాగళ్లు చేస్తాడు. కాబట్టి ప్రతిఒక్కడూ రెండవవానికోసం ఉత్పత్తి చేయటం ఉభయులకూ లాభదాయకం. ఒకడే తనకు కావలసిన అన్ని వస్తువులూ తయారుచేసుకోవాలంటే వాటిని అంతవిరివిగా తయారు చేయలేడు. అలాకాక ఒక్కొక్కడు ఒక వృత్తినిమాత్రం చేస్తూ ఉంటే ఎక్కువ సరకు తయారవుతుంది. అందరికీ ఎక్కువ సరకులు లభిస్తాయి. కాబట్టి వృత్తివిభాగం అవసరం. ప్లేటోమతంప్రకారం ఈ వృత్తివిభాగానికి మూలం రెండంశా లున్నాయి. (౧) భిన్నభిన్న వ్యక్తులకు స్వభావముననుసరించి భిన్నభిన్న అభిరుచు లుంటాయి. అందువల్ల అభిరుచిఉన్న వాళ్లు తమ పనులను ఇతరులకంటె ఎంతో బాగా చేస్తారు. (౨) తమకు అభిరుచిఉన్న వృత్తిలోనే ఎప్పుడూ ఉంటే అందులో నైపుణి ఏర్పడుతుంది.

భిన్నభిన్నవ్యక్తులలో భిన్నభిన్న అభిరుచులు లేక, ఆ అభిరుచులననుసరించి వృత్తివిభాగం, లేక వృత్తివిభాగంననుసరించి ఎవరివృత్తులలో వారు నిష్ణాతులు కాక సమాజానికి అభ్యున్నతి లేదు; వ్యక్తికి అంతకన్నా లేదు. మానవుని స్వభావంలోఉన్న యీ శక్తుల మీద ఆధారపడే సమాజం రాజ్యం ఉంటున్నాయి. కాబట్టి వీటిని సద్వినియోగం చేయట మనేది ముఖ్యం. అభిరుచులనుబట్టి మనుష్యులను ఎలా విభజించాలి? ఎలాంటి శిక్షణ యిస్తే యీ అభిరుచులు వికసిస్తాయి? సహకారజీవనంద్వారా తీర్చుకోవలసిన అవసరాలు ఎలాంటివై ఉండాలి? అవి ఐహికాలా, లేక ఆముష్మికాలా? ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానం చెప్పేది ప్లేటోమతంప్రకారం ధర్మజ్ఞానమే. ధర్మం తెలుసుకోవట మంటే ఈ ప్రశ్నలన్నిటికీ ఎలా సమాధానం చెప్పాలో తెలుసుకోవట మన్నమాట. ఇదే తత్త్వవేత్త ప్రత్యేకవృత్తి. అలాంటి జ్ఞానం పొందటమే అతని కున్న అధికారం. ఆ జ్ఞాన మనుసరించి పాలించటం అతని విధి.

ప్లేటో రాజ్యాన్నిగూర్చి, సమాజాన్నిగూర్చి ఇలా చెబుతున్నాడంటే అందులో విశేష ముంది. సామాజికజీవనానికి వ్యతిరేకమైన శక్తులు వ్యక్తిలో లేవనీ, అనుపాను లెరిగి ప్రభుత్వం విద్యావిధానం ప్రవేశపెట్టి శిక్షణయిస్తే సమాజానికీ, వ్యక్తికీ ఎలాంటి వైరుధ్యం ఏర్పడదనీ అతని సిద్ధాంతం. ఈ సిద్ధాంతం ప్రకారం వ్యక్తివికాసస్వాతంత్ర్యాలకు సామాజికజీవితం తోడ్పడుతుందేతప్ప ప్రతిబంధకం కాదు. మానవుని స్వభావంలోనే సమాజానికి అనుగుణమైన యోగ్యత ఉన్నది. అటు వ్యక్తిలోను, ఇటు సమాజంలోను ఒకే తత్త్వం అంతర్వ్యాప్తమై ఉంది. అందువల్ల మానవునకు శ్రేయస్కరమైనది సమాజానికీ, సమాజానికి శ్రేయస్కరమైనది వ్యక్తికీ అరిష్టదాయకం కాదంటాడు ప్లేటో. అయితే యీమాత్రం వాచా అతడు ఎక్కడా చెప్పడు. అయినా యీమాత్రం లేకుండా అతని వాదం అర్థంచేసుకోటానికి వీలులేదు.

ఈసిద్ధాంతంవల్లనే వ్యక్తిశ్రేయస్సూ సమాజంశ్రేయస్సూ, వ్యక్తియొక్క అభిరుచికీ విధ్యుక్తధర్మానికీ స్పర్ధలేకుండా పోతున్నది. స్పర్ధలు ఒకవేళ వచ్చినా వాటిని సర్దుబాటు చేసుకోవచ్చునంటాడు. వాటిని పశుబల ముపయోగించి అణచి

చేయవలసిన అవసరం లేదు. సమాజమంటే గిట్టని వ్యక్తి తన స్వభావం అర్థం చేసికొని జ్ఞానం ప్రకారం తన శక్తులను అభివృద్ధి చేసికోవాలి. మానవుడు చేయవలెనని కోరేదానికీ, విధిగా చేయవలసినదానికీ తీర్చరాని వైరుధ్యం లేదు. ఎందుకంటే, అతడు తన శక్తులను పూర్ణంగా అభివృద్ధి చేసుకో గోరుతున్నాడు. అతనికి ఆ అధికారం ఉంది. అసంపూర్ణమైన రాజ్యంలో పౌరులు అభివృద్ధి పొందటానికి అవకాశాలు కల్పించాలి. ఉత్తమరాజ్యానికుండే సమస్య ఒకటి, ఉత్తమవ్యక్తికుండే సమస్య మరొకటీ కాదు. నీతి ధర్మం అనేవి అటు వ్యక్తికమూ, ఇటు సామాజికమూ కావాలి. అలాంటిది అమలులో లేకపోతే ఈ సామరస్యం ఏర్పడేటంతవరకూ రాజ్యమూ, వ్యక్తీ సంస్కరింపబడాలి.

## ఆదర్శ రాజ్యం

ఇక రాజ్యస్వరూపం పరిశీలింతాము. రాజ్యానికి ప్రధానంగా మూడు విధులున్నాయి. (౧) ఆహార పదార్థములు మొదలైన అవసరవస్తువులను సరఫరా చేయటం, (౨) రక్షణం, (౩) పరిపాలన. ఈ విధులను అనుసరించి మూడువర్గాలు ఏర్పడుతున్నాయి. (౧) వృత్తికారవర్గం, (౨) రక్షకవర్గం, (౩) పాలకవర్గం. వృత్తివిభాగం స్వభావాన్నిబట్టి జరుగుతున్నది కాబట్టి ఈ మూడు వర్గాలూ, మూడు రకాల మనుష్యులున్నారన్న సిద్ధాంతంమీద ఆధారపడుతున్నవి. అంటే స్వభావమునుబట్టి కొందరు పనిచేయటానికి మాత్రమే పనికివస్తారు. కొందరు సలహాలు పొంది, ఆజ్ఞలకు లోనై పరిపాలించటానికి పనికివస్తారు. కొందరు కేవలం మంచిచెడ్డలను విచారించి సాధనసాధ్యాలను నిర్ణయించటానికి పనికివస్తారు. ఈ మూడు తరగతులు ఆత్మలోని మూడంశాలకు సరిపోతాయి. అంటే కామసంకల్పవివేకాలకు సరిపోతాయి.

ఆదర్శరాజ్యంలో తత్త్వవేత్తలు పాలకులై మంచిచెడ్డలను తమకు తాముగా విచారించి శాసనాలు చేస్తారు. ఈ శాసనాలను రక్షకవర్గం అమలుపరుస్తుంది. వృత్తికారవర్గంవారు ఈ శాసనాలను శిరసావహించి, తమతమ వృత్తులను నిర్వహిస్తూ పైవారలకు తోడ్పడుతారు. ఇలా చేయటం పైవర్గం వారికే కాక తమకు కూడా శ్రేయోదాయకం. ఇలా ఏవర్గానికి ఆవర్గం తన వృత్తిలో నిమగ్నమై సామరస్యంతో ఉండటమే రాజ్యన్యాయం. ఇలాంటి న్యాయ్యమైన రాజ్యం అరిస్టోక్రటిక్ రాజ్యమే.

వివేచన, ధైర్యం, దమనం, న్యాయం అనే నాలుగు ప్రధానసద్గుణాలు ఒక్క అరిస్టోక్రసీ లోనే గోచరిస్తాయని ప్లేటో అంటాడు. తత్త్వవేత్తలు పరిపాలకులుగా ఉంటారు. వారి పరిపాలనమే మూర్తిమంతమైన జ్ఞానం. సైనికులు తత్త్వవేత్తలననుసరించి వ్యవహరిస్తారు. ఇదే ధైర్యం. సామాన్యప్రజానీకం తత్త్వవేత్తలకున్న వివేకం లేకపోవటంవల్ల అజ్ఞానులై కట్టు దప్పి వ్యవహరించటానికి ప్రయత్నిస్తారు. వీరిని అదుపు ఆజ్ఞలలో ఉంచటం అవసరం. సైనికుల సహాయంతో తత్త్వవేత్తలు ఈ కర్తవ్యం నిర్వహిస్తూ ఉంటారు. ఇదే దమనం. ఈవిధంగా ఆదర్శరాజ్యంలో వివేచన, ధైర్యం, దమనం నెలకొంటున్నాయి. ఇక న్యాయంవల్ల తీరవలసిన కొరత ఏమిటి? ఏవర్గానికి నిర్దిష్టమైన వృత్తిని ఆ వర్గం చక్కగా నిర్వహించటం ఈ వర్గాలమధ్య సామరస్యం ఏర్పడటం ముఖ్యం. ప్రతివర్గం తనకు నిర్దిష్టమైన వృత్తిని చేయాలికాని ఇతర వర్గాల పనులు చేయటానికి అర్రులు చాచ రాదు. తత్త్వవేత్తలు పాలకులై, శాసనాలుచేస్తూ, సైనికుల సహాయంతో వాటిని అమలుపరుస్తూ, సామాన్యప్రజానీకాన్ని అదుపు ఆజ్ఞలలో ఉంచాలి. కట్టుదిట్టాలకు లోనై వ్యవహరించటం తమకే శ్రేయస్కరం కాబట్టి తత్త్వవేత్తలు, సైనికులు చెప్పినట్లు సామాన్యప్రజానీకం నడుచుకోవాలి. ఈ సామరస్యమే న్యాయం.

ఆదర్శరాజ్యంలో ప్రభుత్వమే తత్త్వవేత్తలకు, సైనికులకు విద్య చెప్పిస్తుంది. వారిలో సమరసభావం పెంపొందటానికి గాంధర్వగానశిక్షణ (**Pure music**) ఇవ్వట మౌతుంది. తరువాత వ్యాయామశిక్షణ కూడా ఉంటుంది. దీనివల్ల శరీరంతో పాటు మనస్సుకూడా వికాసం పొందుతుంది.

ప్రభుత్వం ప్రవేశపెట్టే విద్యావిధానం గాంభీర్యం, ఉదాత్తత, ధైర్యం అన్ని సద్గుణాలనూ అలవరచేదిగా ఉండాలి. పిల్లలకు బోధించే సాహిత్యం విశిష్టమైనది కావాలి. తల్లులు, దాదులు ప్రభుత్వం ఆమోదించిన కథలనుమాత్రమే పిల్లలకు బోధించాలి. హోమర్, హెసియడ్ కవుల కావ్యాలను పెద్ద కారణాలవల్ల బోధించరాదు. దేవతలు కొన్ని సందర్భాలలో అసహ్యంగా ప్రవర్తించినట్లు ఆ కవులు చిత్రించారు. వీరు చిత్రించిన దేవతల కథలు కొన్ని అనుపదేశకంగా ఉన్నాయి. దేవతలవల్ల ఎన్నడూ అనర్థకం జరగదని పిల్లలకు బోధించాలి. సద్వస్తువులకే ఈశ్వరుడు కర్తగాని, దుష్టవస్తువులకు మాత్రం కాదు. హోమర్, హెసియడ్ వ్రాసిన కొన్ని కథలు పాత్రలను మృత్యువంటే భయపడేటట్లు చేస్తాయి. చెప్పే విద్య పిల్లలను వీరమరణ మభిలషించేటట్లు చేయాలి. బానిసతనం కంటె మరణం వేయిరెట్లు మేరు గని తెలిసివచ్చేటట్లు పిల్లలకు బోధించాలి. అందువల్ల ఉత్తమపురుషులు వాపోతున్నట్లుగాని, మిత్రమరణానికి దుఃఖిస్తున్నట్లు గాని చిత్రించే కథలను పూర్తిగా బహిష్కరించాలి. ఉదాత్తతకు పరిహాసవాదులు అనుచితం. దేవతలే ఇలాంటి అనుచిత కార్యాలు చేసినట్లు హోమరురచనలో ఉన్నాయి. దేవతల భోగలాలసతలు అందులో వర్ణింపబడ్డాయి. అలాంటి ఘట్టాలు పూర్తిగా నిషేధించాలి. మంచివారు కష్టాలపాలయ్యారని చెప్పే కథలు, దుష్టులు సుఖించారని చెప్పే కథలు బహిష్కరించాలి. అలాంటి కథలు పిల్లలకు చెబితే అన్యాయంగా వాళ్లు చెడిపోతారు.

వ్యాయామవిషయంలో కూడా ఏమాత్రం ప్రాలుమాలిక ఉండకూడదు. ఎవరూ చేపలు తినకూడదు. తాలింపులకూరలు, కేవలం జిహ్వాచాపల్యానికి పనికివచ్చేవంటకాలు దగ్గరకుకూడా రానీరాదు. ఇలాంటిది జరిగితే డాక్టర్ల అవసరం ఉండదు.

ఒక వయస్సు వచ్చేదాకా పిల్లలను వికారవస్తువులు, దుష్కృత్యాలు చూడనీరాదు. హృదయదార్ఢ్యం ఏర్పడినతరువాత మనస్సు కంపింపచేయని బీభత్సకృత్యాలు చూడనివ్వాలి. తగిన వయస్సు వచ్చినతరువాత యుద్ధాలు చూపించాలి.

పరిపాలకులకు చిన్న చిన్న కుటీరాలు, నిరాడంబరమైన తిండి ఉండాలి. ఈ పరిపాలకు లంతా ఒకచోట కుడిచి ఒకచోట పండుకోవాలి. వారికి కేవలం అవసరమాత్రంగాతప్ప ఎలాంటి సొంత ఆస్తిపాస్తులు ఉండకూడదు. వెండిబంగారాలు అసలు వారికి నిషిద్ధాలు. స్నేహితులైనవారికి స్త్రీబాలజనంతోసహా అన్ని వస్తువులు ఉమ్మడిగా ఉండాలి. ఇందులో కొన్ని యిబ్బందులున్నా, అవి దుస్తరాలు కావు. మగపిల్లలకు చెప్పే విద్యే ఆడపిల్లలకు చెప్పాలి. అంటే, మగపిల్లలతోపాటు ఆడపిల్లలు గానము, వ్యాయామము, యుద్ధవిద్య నేర్చుకోవాలి. స్త్రీలకు పురుషులవలెనే అన్ని రాజకీయవిషయాలలోను సమానత్వం ఉండాలి.

ఇప్పుడు మన కున్న వివాహపద్ధతి పూర్తిగా సంస్కరింపబడాలి. కొన్ని పర్వదినాలలో జనసంఖ్య తరుగుపెరుగులు పొందకుండేటట్లుగా జనశాస్త్రానుగుణంగా ప్రభుత్వం వధువులను వరులను సమావేశపరుస్తుంది. ఉత్తమవధూవరులకే ఎక్కువ సంతానప్రాప్తి అయ్యేటట్లు ప్రభుత్వం చూస్తుంది. పుట్టగానే పిల్లలను ప్రభుత్వం తలిదండ్రులదగ్గరనుంచి తీసికొనిపోయి ఎవరు ఎవరిపిల్లలో తెలియనీకుండా జాగ్రత్తగా పెంచుతుంది. పిల్లలకుకూడా తమ తలిదండ్రులెవరో తెలియనీయరు. అంగవికలులైన శిశువులను ఎవరికీ తెలియనిచోట దాచివేస్తారు. తల్లుల వయస్సు ౨౦-౪౦ సంవత్సరాలమధ్య ఉండాలి. తండ్రుల వయస్సు ౨౫-౫౫ సంవత్సరాలమధ్య ఉండాలి. ఈ వయస్సుకు వెలుపల జరిగే సంయోగం స్వేచ్ఛగా జరగవచ్చును. అయితే ఇలాంటి సంయోగసంజనిత గర్భాలు విధిగా నిష్ఫలాలు కావాలి. ప్రభుత్వం నిశ్చయించే వివాహాలలో వధూవరుల ఇష్టానిష్టలతో ప్రణయద్వేషాలతో నిమిత్తం లేదు. ప్రభుత్వం పట్ల తమ కున్న ధర్మాన్ని శిరసావహించి యీ వివాహాలను పాలించాలి.

ల్లలకు తమ తలిదండ్రు లెవరో తెలియదు కాబట్టి వాళ్లు తమకు తలిదండ్రులుగా ఉండటానికి వీలైన వయస్సున్న స్త్రీపురుషులను పితరులుగా భావించాలి. అలాగే అన్నదమ్ములను అక్కచెల్లెండ్రను తెలిసికోవాలి. తండ్రికీ కుమార్తెకూ, తల్లికీ కుమారునికీ, అన్నకూ చెల్లెలికీ వివాహం జరగరాదు.

ఈ విధంగా మమకారానికి తావు లేకుండా చేయటంవల్ల తత్త్వవేత్త శాసనాధికారం దుర్వినియోగం చేయటానికి వీలు లేదు. ధనం కూడబెట్టుకోటానికి కాని, దీనికోసం ఇతరులకు అన్యాయం చేయటానికికాని అవకాశం లేదు. పైగా జిజ్ఞాస పెంపొందటానికి తగిన విద్య వారికి నేర్పబడుతుంది. అంటేకాదు: సమ్యగ్దర్శనోపాసకులే (*lovers of the vision of truth*) తత్త్వవేత్తలుగా పరిగణింపబడతారు. అందువల్ల వారు సత్యంకోసం న్యాయవిహితంగా వర్తిస్తారుకాని, అన్యథా వ్యవహరించరు. అసలు సమ్యగ్దర్శనోపాసకులు కానివారు సైనికులుగనో, అందుకు అయోగ్యులైతే సామాన్య ప్రజలుగనో పరిగణింపబడుతారు. అసలు తత్వవేత్తలు యాథార్థ్యం, నిత్యత్వం ఆరాధిస్తారు. వారికి క్షణికాలు, పరిణాములు అయిన శరీరసుఖాలు భౌతికవిషయాలు; తుచ్ఛాలు. పైగా వారికి గణితశాస్త్రం, రేఖాగణితం, ఖగోళశాస్త్రం, తర్కం నేర్పుతారు. అందువల్ల వారు పెడత్రోవ పట్టడానికి ఆస్కారం లేదు.

పై సిద్ధాంతం ప్రకారం వివేకం అనేది పరిపాలకుల ఒక్కళ్లలోనే ఉంటుందనీ, సామాన్య ప్రజానీకం కేవలం పైవారు అనుశాసించినట్లు చేయవలసినదే తప్ప మరేమీ చేయకూడదనీ సిద్ధిస్తున్నది. దీనికి కారణం ప్లేటోకు వృత్తికారులు, అంటే రెక్కల కష్టం మీద బ్రతికే సామాన్యప్రజానీకంమీద ద్వేషం కాదు. దీనికి మూలకారణం "మంచి పరిపాలన అనేది విగళిత ప్రత్యక్షజ్ఞానమైన వివేకానికే విషయం కాని అభిప్రాయానికి విషయం కాదు. ఈ వివేకం జ్ఞానివర్గం సొత్తు" అనటంలో ఉంది. ప్లేటోమతం ప్రకారం రోగికీ వైద్యునికీ ఉన్న సంబంధమే సామాన్య ప్రజానీకానికీ పాలకులకూ ఉన్నది.

పైవిషయాలనుబట్టి న్యాయమంటే ప్లేటో అభిమత మేమిటో తేలికగా ఊహించుకోవచ్చును. న్యాయమనేది సమాజం విచ్ఛిన్నం కాకుండా కలిపి ఉంచే సూత్రం. ఇది వ్యక్తుల అభిరుచులనుబట్టి, పొందిన శిక్షణనుబట్టి సమరసభావంతో వ్యవహరింప జేస్తుంది. ఈ న్యాయం ఇటు వ్యక్తిత్వము, అటు సామాజికము. ఈ న్యాయమువల్లనే రాజ్యానికీ, వ్యక్తులకూ శ్రేయస్సు కలుగుతుంది. మానవులకు తగిన వృత్తి లభించటంకంటె దానికి తగిన యోగ్యత సంపాదించటంకంటె ఉత్తమమైనది మరొకటి లేదు. ప్రతివ్యక్తి తనకు యోగ్యమైన వృత్తిలో ప్రవేశించటంకంటె శ్రేయస్కరమైనది అటు వ్యక్తులకు కాని, సమాజానికిగాని వేరే లేదు.

న్యాయమంటే ప్లేటోమతం ప్రకారం ఏ వ్యక్తికి రావలసినది ఆ వ్యక్తి కివ్వటమే. ఏ వ్యక్తికి కావలసినది ఆవ్యక్తి కివ్వటమంటే అతని కున్న శక్తిసామర్థ్యాలనుబట్టి సత్కరించాలి. ఇలా చూచినందుకుగాను ఆ వ్యక్తి తనకు లబ్ధమైన పదవిని త్రికరణశుద్ధిగా నిర్వహించాలి.

ఇలా నిర్వచింపబడిన న్యాయాన్ని గూర్చి శబైన్ ఇలా వ్రాస్తున్నాడు: *

*"This definition of justice lacks the notion, connoted by the Latin word ins and the English word right, of powers of voluntary action in the exercise of which a man will be protected by law and supported by the authority of the state. Lacking this conception Plato does not mean by justice, except remotely the maintainance of public peace and order; at least external order is but a small part of the harmony which makes the state. What the state provides its citizens is not so much freedom and protection as a life-all the opportunitie s*

---

* *History of Political Thought.*

*for social interchanges which make up the necessaries (amenities) of a civilised existance. It is true that in such a social life there are rights, just there are duties, but they can hardly be said to belong in any peculiar sense to individuals. They are inherent rather in the services or functions that individuals perform.* Resting as it *does upon the principle that the state is created by mutual needs, the analysis runs necessarily in terms of services and not of powers. Even the ruler is no exception, for he has merely the special function to which his wisdom entitles him. The notion of authority or soveriegn power such as the Roman attached to hismagistracies has practically no part in* Plato's theory nor *indeed in that of any Greek philosopher."*

ఆదర్శప్రాయమైన రాజ్యం ఏయే పరిస్థితులలో హ్రాసం పొందుతుందో, ఏయే హ్రాసదశలలో ఎలా ఉంటుందో కూడ ప్లేటో సూచించాడు. ఉత్తమమైన రాజ్యం అరిస్టోక్రటిక్ రాజ్యమనీ, అంతకన్న హీనమైనది మిలిటరీవర్గ రాజ్యమనీ, అంతకన్న హీనమైనది ధనికవర్గ రాజ్యమనీ (*Oligarchic State*), అంతకన్న హీనమైనది ప్రజాస్వామికమనీ, అన్నిటికన్న హీనాతి హీనమైనది నియంతృక రాజ్యమనీ అన్నాడు.

ఇంతకూ ఉత్తమోత్తమమైన అరిస్టోక్రటిక్ రాజ్యం ఎలా హ్రాసం పొందుతుంది? అరిస్టోక్రసీ ఉండగా రాజ్యం యుద్ధనిమగ్నమౌతుంది. అలాంటి సమయంలో విజయకారకులైన సైన్యాధిపతులను బ్రహ్మాండంగా పొగడటం జరుగుతుంది. దానితో ప్రజలకు వారిమీద ఎక్కడలేని గౌరవప్రతిపత్తులు ఏర్పడుతాయి. యుద్ధం ముగియగానే ఆ నాయకులను వారి అనుచరులు క్రింద పడవకుండా భుజాలమీద ఎక్కించుకొని వస్తారు. ప్రజలు సంతోషవివశులై ఆ నాయకులను గవర్నర్లుగానో, లేక పరిపాలకులుగానో ఎన్నుకొంటారు. ఇలాంటి అనుభవం మనకు కొత్త కాదు. చరిత్రలో ప్రాచీనకాలంనుంచి నేటివరకూ అనుభవానికి తగులుతూనే వుంది. అయితే యీ మిలిటరీ నాయకులకు తత్త్వవేత్తల కున్నంత వివేకం ఉండదు. కాబట్టి వీరు విపరీత వ్యయానికి లోనవుతారు. ఈవిధంగా రాజ్యంలోని ధనికవర్గానికి వీరు బాకీపడతారు. ఋణగ్రస్తుడు ఋణదాత చేతిలుబొమ్మగా తయారవుతాడు. దానితో పూర్వమున్న గౌరవప్రతిపత్తులను కోల్పోతాడు. ఇలా మిలిటరీ నాయకుల అధికారమంతా ఋణదాతలకు సంక్రమిస్తుంది. తుదికి ఋణదాతలు గవర్నర్లో, లేక పరిపాలకులో అవుతారు. దీనితో ధనికవర్గ ప్రభుత్వం ఏర్పడుతుంది.

మిలిటరీనాయకులకంటె ధనికవర్గం వివేకహీనం. ఈవర్గందృష్టి ఎంతసేపటికీ స్వలాభంమీద ఉంటుంది. శాసనాధికారాలను స్వార్థంకోసం, సొంత సొత్తుల పెంపుకోసం వినియోగిస్తుంది. తన బొక్కసాలు నింపుకొనేందుకు పేదలమీద రకరకాల పన్నులు విధిస్తుంది. ఈవిధంగా చివరికి రాజ్యమంతా రెండుభాగాలైపోతుంది. కొలదిమంది కోటీశ్వరులు ఒక ప్రక్కన, దారిద్ర్య పీడితమైన ప్రజాసామాన్యం మరొక ప్రక్కన ఏర్పడుతుంది. తుట్టతుదకు అత్యధిక సంఖ్యాకమైన సామాన్యప్రజానీకం విప్లవం తెచ్చి తన్ను దోచుకొనే ధనికవర్గఅధికారం స్వాయత్తం చేసుకొంటుంది. ఇదే ప్రజాస్వామికం.

ఈ ప్రజాస్వామ్యం కూడా ఎంతోకాలం నిలవదు. ఈ ప్రభుత్వం ఏర్పడీ ఏర్పడకముందే, తనవల్ల ప్రజానీకానికి విమోచనం కలిగింది కాబట్టి పరిపాలనలో తనకు సముచితస్థానం ఉండాలని విప్లవనాయకుడు అంటాడు. పరిపాలనబాధ్యత తనకు అప్పగించి ప్రజలు తన్ను నమ్మా లంటాడు. నమ్మితే సర్వకష్టాలూ తొలగుతా యని ప్రజలకు వాగ్దానం చేస్తాడు. భూలోకస్వర్గ మేర్పడుతుందని ప్రలోభపెడతాడు. తన్నుతానే రాజుగానో, గవర్నరుగానో ఎన్నుకుంటాడు. ఈ విధంగా నియంతృకపరిపాలన వస్తుంది. అన్ని ప్రభుత్వాలకంటే యీ నియంతృకప్రభుత్వం హీనాతి

హీనం. దీనికంటె అన్యాయమైనది మరొకటి ఉండదు. ఈ ప్రభుత్వంలో సామరస్యం కుహూశార్వరిలోని చంద్రరేఖ. నియంత కేవలం స్వార్థ మపేక్షించి పరిపాలన సాగిస్తాడు.

ఈ ప్రభుత్వాలకు అనుగుణంగా అయిదురకాల వ్యక్తులుంటారు. వీరిలో తత్త్వవేత్త ఉత్తమోత్తముడు. తరువాతి వ్యక్తి సైనికుడు. తరువాతివాడు ధనికుడు. ఆపిమ్మట పరిగణ్యుడు సామాన్యజనుడు. కట్టకడపటివాడు నిరంకుశుడు. వ్యక్తులలో కూడా క్రమం పైన పేర్కొన్నట్లుగానే జరుగుతుంది. తత్త్వవేత్త మొట్టమొదటివాడు. అతని కొడుకు సైన్యాధిపతులకు లభించే ఆదరగౌరవాలు, కీర్తి, అధికారం చూస్తాడు. తన తండ్రిమార్గం అవలంబిస్తే ఆస్తిపాస్తు లుండవనీ, భోగభాగ్యాలు లభించవనీ, కేవలం నిరర్థకంగా క్లిష్ట తాత్త్వికసమస్యాపరిష్కారంకోసం తల బద్దలు చేసుకోవలసి వస్తుం దనీ భావిస్తాడు. అతనికి సైన్యాధిపతి జీవితమే అభిలషణీయ మౌతుంది. ఆ వృత్తినే అవలంబిస్తాడు. అతని కొడుకు తండ్రి మిలిటరీజీవితాన్ని చూస్తూ ఉంటాడు. తండ్రి నిరంతరం యుద్ధనిమగ్నుడై ఉండటంవల్ల ఏ నిమిషాన ఎలాంటి విపత్తు వస్తుందో అన్న ఆందోళన అతనికి కలుగుతుంటుంది. అప్పుడప్పుడు క్షతగాత్రుడై తండ్రి యింటికి చేరుకొంటూఉంటే అతని మనస్సు ఎలా ఉంటుందో వేరే చెప్ప నవసరం లేదు. అందువల్ల అతడు తండ్రి అడుగుజాడలలో నడవటానికి ఏమాత్రం సమ్మతించడు. నిరపాయజీవితం అభిలషిస్తాడు. అందువల్ల వణిగ్వృత్తికి దిగుతాడు. ధనికు డౌతాడు. అతని కొడుకు తలకుమించిన ఖర్చు పెడతాడు. ఏమాత్రం ప్రతిబంధక మేర్పడినా చిరాకు పడతాడు. నీతి నియమం లేకుండా వివేకహీనజీవితం గడుపుతాడు. అతడే ప్రజాస్వామ్యవాది. అతడు కేవలం అరిషడ్వర్గం ఆడించినట్లు ఆడుతాడు. అతని కొడుకుకు అణుమాత్రసహనం కూడా ఉండదు. తనకు అసలు ఎలాంటి అవరోధం కూడా ఉండగూడ దనుకొంటాడు. ఇదే నిరంకుశుని లక్షణం.

ఈ పైని చెప్పుకొన్న విషయాలనుబట్టి ప్లేటో మతంప్రకారం ఎవని వృత్తి వాడు త్రికరణశుద్ధిగా చేయటమే న్యాయం. ఇతర వృత్తి పొంత పోవటం అన్యాయం. ఈ సిద్ధాంతంలో బెట్రాండ్ రస్సెల్ పేర్కొన్నట్లు *కర్మసిద్ధాంతం అంతర్భూతమై ఉంది. వ్యక్తి అ:తరణకుముందే సమాజంలో అతని స్థానం నిర్దిష్టమై ఉంది. కాని జీవులు ఆ ధర్మం ఉల్లంఘించటానికి ప్రయత్నిస్తాయి. అయితే ఈశ్వరశాసనం అలా ఉల్లంఘించేవారిని శిక్షించి నిత్యవ్యవస్థను తిరిగి నెలకొల్పుతుంది. ఈ భావమే "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః" "యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత" ఇత్యాది గీతాశ్లోకాలలో రణిస్తున్నది.

ప్లేటో ప్రతిపాదిత మైన న్యాయస్వరూపంలో ప్రజాస్వామ్య మాకాంక్షించే సమానత్వానికి ఎక్కడా ఆస్కారం లేదు. అతడు చెప్పే న్యాయంప్రకారం కొందరికి ఎక్కువ అధికారం, మరి కొందరికి తక్కువ అధికారం ఉండవచ్చును. ఉదాహరణకు అతని ఆదర్శరాజ్యంలోని పాలకులను తీసుకుంటే, సర్వాధికారాలూ వారివే. అలా ఉండటం అతడు న్యాయమే నంటాడు. ఎందుకంటే వివేకవంతులు వారే. అతని మతంప్రకారం అన్యాయ మనేది పాలకులకంటె వివేకవంతులైనవారు ప్రజాసామాన్యంలో ఉన్నప్పుడు జరుగుతుంది; లేదా పాలకులలో మూర్ఖు లున్నప్పుడు అన్యాయమౌతుంది. ఇలాంటి అన్యాయం తొలగించటానికి అతడు మార్గంసూచించాడు. అయితే, అతని మతం ప్రకారం సామాన్యప్రజానీకానికి రాజకీయవ్యవహారాలలో ఎలాంటి జోక్యం లేకపోవటమే న్యాయం.

ప్లేటో న్యాయనిర్వచనం పరిణామరహితమై, సర్వకాలసర్వావస్థలందు ఒకే విధంగా ఉండే సమాజ మపేక్షిస్తూ, వృత్తులను ప్రభుత్వమే నిర్ణయించా లని అనుశాసిస్తున్నది. తన వృత్తిని తాను నిర్ణయించుకోటానికిగాని, తనకు సత్య మని తోచిన పరమార్థ మనుసరించి జీవితం దిద్ది తీర్చుకోటానికిగాని వ్యక్తికి స్వాతంత్ర్యం లేకుండా చేస్తున్నది. "ప్రత్యక్షానుభవం కూడా

---

* *History of European philosophy.*

యథార్థం. సమాజమనేది సచేతనమైన అవయవి కాదు. వ్యక్తి, సమాజం లేకపోయినా, ఒంటరిగానో, జంటగానో నివసించిన రోజులున్నవి. ప్రత్యక్షానుభవం నిరసించని వివేకచోదితమైన జీవితమే పరమార్థం కాని, దాని వెలుపల మరొక పరమార్థం లేదని భావించి తదనుగుణంగా త్రికరణశుద్ధిగా వ్యవహరించేవారికి చోటు లేకుండా పోతున్నది. అలాంటి వారంతా పాపులు, అన్యాయపరులు, దండ్యులు అవుతున్నారు.

రిపబ్లిక్‌లో ప్లేటో కమ్యూనిజం ప్రతిపాదించాడని బీర్ * మొదలైనవారు భావిస్తున్నారు. వారు ప్లేటో సిద్ధాంతానికీ, కమ్యూనిజానికీ ఉన్న యీ క్రింది సామ్యాలను సూచిస్తున్నారు.

౧. సొంత ఆస్తి ఉండకూడదు.

౨. కుటుంబజీవనం పనికిరాదు.

3. పిల్లలను ప్రభుత్వమే పెంచాలి.

౪. విద్యావిధానం ప్రభుత్వమే స్వయంగా నడపాలి.

౫. శరీరానికి అంగాలకు ఉన్న సంబంధమే సమాజానికీ వ్యక్తికీ ఉన్నది.

౬. నియంతృత్వం అవసరం.

కమ్యూనిజానికీ, ప్లేటోసిద్ధాంతానికీ పై విషయాలలో సామ్యమున్నమాట నిజమే. కాని అంత మాత్రం చేతనే ప్లేటో కమ్యూనిజం ప్రతిపాదించాడనటంలో అర్థంలేదు. అసలు అలా అంటున్నారంటే ఇటు ప్లేటోమతం కానీ, అటు కమ్యూనిస్టుసిద్ధాంతం కాని అర్థం కాలేదన్నమాట. ఎందుకంటే ప్లేటో ప్రతిపాదించేది-౧. ఆధ్యాత్మికవాదం. ఈ వాదం ప్రకారం భావాలు, ఆత్మ ఈశ్వరుడు ఉన్నారు. మన వ్యావహారికజగత్తు అయథార్థం. కమ్యూనిజంలో అంతర్వ్యాప్తమై ఉంది భౌతికంవాదం. ఇది ఆత్మ-ఈశ్వరుల ఉనికి అంగీకరించదు. ఈ జగత్తు యథార్థమంటుంది. ఈ జగత్తువెనుక స్వర్గనరకాదు లున్నట్లు అంగీకరించదు. ౨. ప్లేటోమతం ప్రకారం ఈ జగత్తు హేయం. కమ్యూనిజంప్రకార మిది ధ్యేయం. ప్లేటోమతం భావానికి ప్రాధాన్య మిస్తే కమ్యూనిజం ఆర్థిక స్థితిగతులకు ప్రాధాన్య మిస్తున్నది. 3. ప్లేటో రిపబ్లిక్‌లో కార్మికుల ఆర్థిక సముద్ధరణసంగతి ఎత్తనే లేదు. ౪. ఉత్పత్తిసాధనాలు సరకుపంపకం వ్యక్తుల పరంగా జరగా లంటున్నాడు. ౫. ప్లేటో సూచించే ఆదర్శరాజ్యానికి ప్రాతిపదిక వ్యవసాయమే కాని యంత్రపరిశ్రమలు కావు. ౬. రిపబ్లిక్‌లోని ఆర్థిక వ్యవస్థీకరణం వ్యష్టికమే కాని సమష్టికం కాదు. ౭. పాలకులకుమాత్రమే సొంత ఆస్తులు రిపబ్లిక్‌లో నిషేధింపబడ్డాయి. ఇది ఆర్థికదృష్టితో జరిగింది కాదు. బోశాంకో పేర్కొన్నట్లు రాజకీయాలను ఆర్థికదుష్టసంపర్కంనుంచి తొలగించటానికి జరిగింది. ౮. ప్లేటో వర్గరాహిత్యం ప్రతిపాదించలేదు. పరిపాలకవర్గం, రక్షకవర్గం, కార్మికవర్గం స్థిరంగా అలాగే ఉంటాయి. క్రింది వర్గాలు పైవర్గంవారి శాసనాలను శిరసావహించాలి. ప్లేటో ప్రతిపాదించే విద్యావిధానం, స్త్రీపురుష సమానత్వం, వివాహసంస్కరణలు మొదలైనవి పాలక రక్షకవర్గాలకేగాని సామాన్యప్రజానీకానికి కాదు. అందువల్ల రిపబ్లిక్ పేరుకు ఒకటే రాజ్యమైనా అరిస్టోటల్ "రాజకీయాలు"† అనే గ్రంథంలో విమర్శించినట్లు రెండు రాజ్యా లేర్పడుతున్నాయి. పాలకవర్గ రాజ్యం ఒకటి. సామాన్యప్రజల రాజ్యం మరొకటి. ౯. ప్లేటో ప్రతిపాదించేది ప్రపంచవైముఖ్యం, సుఖనిరాసం బోధించే కమ్యూనిస్టిక్ సన్న్యాసం ‡

* *Beer : 'Social struggles in Antiquity.*

† *Politics, Book* 11, *Chap. 5. "The necessary consegence is that there will be two states in one and those states mutually hostile."*

‡ *"In summary it is a communism of monastic asceticism and renunciation, a communism of withdrawal from the world and the cares of the world." The socialist tradition- Alexander Grass. A. E. Taylor* కూడ *platonism* అనే పుస్తకంలో ఈ మాటే అంటాడు.

కాబట్టి ప్లేటో ప్రతిపాదించినది కమ్యూనిజం కాదు. ఆపక్షంలో ఈరెంటికీ పైని పేర్కొన్న సామ్యాలు ఎలా ఏర్పడ్డాయి? అవి యాదృచ్ఛికాలా? యాదృచ్ఛికాలు కావనే చెప్పాలి. ఎందుకంటే అటు ప్లేటో, ఇటు కమ్యూనిజాన్ని శాస్త్రీయపద్ధతిని వివరించిన మార్క్సు ఈ క్రింది విషయాలలో ఏకీభవిస్తున్నారు:— ౧. సమాజం ఒక శరీరం. వ్యక్తి అయిన మానవుడు దానినుంచి విడివడి బ్రతకలేని అవయవం. ౨. మానవజీవితం మరొకదానికి సాధనమేకాని తనకు తాను పరమార్థం కాదు. ప్లేటో ఈజీవితం భావజ్ఞానసిద్ధికి సాధనమంటే, మార్క్సు కమ్యూనిస్టు ఆదర్శసిద్ధికి సాధన మంటాడు. కాబట్టి ఇరువురి మతం ప్రకారం లక్ష్యసిద్ధికి చేసేదంతా ధర్మమే. అలాంటిది అధర్మం కాదు. ఈశ్వరుడు పరిపాలకులను బంగారంతో చేశాడనీ, రక్షకులను వెండితో చేశాడనీ, వృత్తికారులను ఇనుముతో చేశాడనీ ప్రభుత్వం అసత్యప్రచారం చేయాలని ప్లేటో రిపబ్లిక్‌లో సూచించాడు. సూచించటమే కాదు. అసత్యం పాలకుల ప్రత్యేకాధికార మన్నాడు. కార్యస్థాపకమైతేసరి ఎలాంటి మార్గమైనా అవలంబించవచ్చు నని రష్యన్ కమ్యూనిజం తన చరిత్రతో లోకానికి చాటుతున్నది. ౩. ప్లేటోసిద్ధాంతంలో కర్మసిద్ధాంత మంతర్భూతమై ఉంది. ఈ కర్మసిద్ధాంతమే చారిత్రావశ్యకత పేరుతో కమ్యూనిస్టుసిద్ధాంతంలో అంతర్భూతమై ఉంది. ౪. ప్లేటో ప్రతిపాదించే వివేకం సామాన్యప్రజానీకం ఇష్టానిష్టాలతో నిమిత్తం లేని పారమార్థికసత్యం. అలాగే మార్క్సు ప్రతిపాదించే గతితార్కిక భౌతికవాదం కూడ సామాన్యప్రజానీకం ఇష్టానిష్టాలతో సంబంధం లేని పారమార్థికసత్యం. అందువల్ల ఇద్దరూ నియంతృక పరిపాలన అంగీకరిస్తున్నారు. విద్యావిధానం, శిశుశిక్షణ, వివాహాలు, సామాజికజీవనం ప్రభుత్వమే బాధ్యత వహించి నడపాలనీ, ప్రజలు ఆ అనుశాసనాలను శిరసావహించి నడుచుకోవాలనీ అంగీకరిస్తారు. అయితే యిరువురి పరమార్థాలూ వేరుకా బట్టి ప్రభుత్వ లక్ష్యాలుకూడా భిన్నంగా ఉన్నాయి. ౫. యుద్ధాలకు కారణం ధనమే నని అటు ప్లేటో అంగీకరిస్తున్నాడు. ఇటు మార్క్సు అంగీకరిస్తున్నాడు. అందువల్ల సొంత ఆస్తులను ఇద్దరూ నిషేధిస్తున్నారు.

ఇక మీదట ధర్మవిషయం వదలి మనకు ముఖ్యమైన రామణీయకాన్నిగూర్చి ప్లేటో ఏమి చెబుతున్నాడో చూదాము. (సశేషము)





కీ॥ శే॥ దేశభక్త, కొండా వెంకటప్పయ్యపంతులుగారు

జననము : 17-2-1866 మరణము : 15-8-1949

# "దేశభక్త" స్మృతి

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

●

చరితముచేత సర్వజనసంస్తుతిఁ గాంచిన పుణ్యుఁడున్ మహా
భరణము నాంధ్రజాతి కతివత్సలుఁ డారయ భారతాంబకున్
నిరుపమసాధువర్తనుఁ డనింద్యుఁడు త్యాగధనుండు వృద్ధుఁడై
పరమపదంబుఁ గాంచెఁ గట! భవ్యదినంబున "దేశభక్తుఁడున్."

పదవులు కోరలేదు; పరిపాలనకున్ దగులంబుఁ జూపలే;
దెద యతినిర్మలంబు; త్యజియించెను సర్వము దేశసేవకై;
ముదమున గాంధిబోధ కడముట్టఁగ నాచరణంబునందుఁ బెం
పొదవఁగఁ జూపె "ధన్యుఁడ వహో!" యని దిక్కులఁ బిక్కటిల్లఁగన్.

తనకును దేశమే పరమదైవత మంచును, దేశ సేవయే
తన కగు నీశసేవ యని తథ్యపు భక్తిని నిర్మముండునై
యొనరిచె దేశసేవను; మహోన్నతిఁ గాంచెను "దేశభక్త" యన్
వినుతిని; గాంధి దేవునకు వెన్నెము కయ్యెను; జేరె నాతనిన్.

స్వాతంత్ర్యోత్సవ మెల్లదేశమున విస్తారప్రకాశంబునై
ప్రీతిం గూర్చెడి వేళ దేశమునకున్ విఖ్యాతసందేశ మే
యాతంకంబును లే కొసంగి పరమాత్మానూనసంభావనా
చేతస్కుండయి చన్న దేశహితుఁ డర్చింపంబడుం గావుతన్!

"సులభముగా లభించినది; సుస్థితి నందనె లే దొకింతయున్
లలితస్వతంత్ర బాల; సుగుణంబులఁ బెంపుఁడు దానిఁ, గాని ఛీ!
కలుషితఁ జేయకే సకలకల్మషముల్ విడుఁ" డంచుఁ గాంగ్రెసీ
యుల కిడు బోధముల్ ఫలము నొందుత! మాతఁడు శాంతిఁ గాంచుతన్!

—

# పెంపకపు మమకారం

శ్రీ కాళీపట్నపు రామారావు

ఫాక్టరీపనివాళ్ల ప్రవాహం క్రమంగా క్షీణించింది—అనేసరికి క్రొత్తవెల్లువలా కళాశాలలకూ, ఉన్నతపాఠశాలలకూ పోయే విద్యార్థులూ, విద్యార్థినులూ మెయిన్‌రోడ్డు దఖలుపరిచేసుకున్నారు. ఏ కూరలమార్కెట్‌నుంచో వస్తూ ఏమాత్రం పరధ్యాసంగా వున్నా, క్వీన్‌మేరీస్‌హైస్కూలువిద్యార్థినుల పెట్టెబండ్లో, కాలేజీవిద్యార్థిసైకిలో, యూనివర్సిటీ విద్యార్థుల సిటీబస్సో నిర్దాక్షిణ్యంగా శిక్షించి తీరుతాయి. చివరకు సందులూగొందులలో కూడా మున్సిపాలిటీవారి చెత్తబళ్లనూ, లారీలనూ, నీళ్లకావిళ్లవారినీ చూసుకుంటూ నడవ్వలసిందే!

సుదర్శనం సురక్షితంగానే చేతిలో కూరల సంచీతో యిల్లు చేరుకున్నాడు. తొందరగా మెట్లెక్కి మూసి వున్న తలుపును తట్టే ఉద్దేశంతో తలుపుమీద చేయి వేయబోయాడు. ఇంతలోనే లోన తలుపు తీస్తున్న శబ్దం వినబడింది. కొంతసేపు ఆగి సకాలానికి తలుపు తెరవబడకపోగా తనే తలుపు తోశాడు!

లోపలి దృశ్యం చూడగానే అడుగు ముందుకు వేయబోయినవాడల్లా అలాగే నిలబడిపోయాడు!

ద్వారానికి రెండుమూడుగజాల దూరాన తల్లి పార్వతమ్మ తెల్లగా తోమిన ఇత్తడిబిందెను ఆవలి అంచుపట్టుకొని కూతురు చేతిలోంచి ఒడుచుకుంటోంది. చెల్లెలు సరస్వతి ఈవలి అంచు పట్టుకొని లాగులాడుతోంది. ఇద్దరి ముఖాలలోనూ మానవలక్షణాలు చాలా సేపయి దూరమైనట్టున్నాయి. తలుపు చప్పుడుకాగానే ఆ ముఖాలను స్వస్థితికి తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ ఇద్దరూ ఒకేసారి చూశారు ద్వారంవంక. ఎదురుగా పాలిపోయిన ముఖంతో, విభ్రాంతదృక్కులతో సుదర్శనం అగపడ్డాడు. క్షణకాలం ముగ్గురూ అలానే ఉండిపోయారు. సరస్వతి సిగ్గుతో ముఖం త్రిప్పేసుకుంది. సుదర్శనం కూడా తెలివి తెచ్చుకొని, లోనికి వచ్చి వెనుతిరిగి తలుపు వేస్తూ తల్లివంక చూశాడు. పార్వతమ్మగారు గట్టిగా పలకబోయే స్వరాన్ని మునిపళ్లమధ్య అదిమిపడుతూ అన్నారు.

"నువ్వు వద్దంటే వద్దు—నువ్వే నీళ్లు తేవడానికి వల్లకాదు!"

—ఇలా అంటూనే ఆమె ఒక్క గుంజుతో సరస్వతిచేతిలో బిందె ఊడబెరుక్కొని పటాటోపంగా లోపలికి వెళ్లిపోయారు. సరస్వతి నల్లగా మాడిన ముఖాన్ని గోడవంక తిప్పేసుకుంది. ప్రక్కనుంచి పోతూ ఏమో అనాలని ఆగిన సుదర్శనం చెల్లెలిముఖంలోకి చూడగానే ఏమీ అనకుండానే నడవ దాటి లోపలికి వెళ్లిపోయాడు. ద్వారందగ్గర నిలబడి ఈ దృశ్యాన్నంతా చూస్తున్న సుబ్బులు అన్న చేతిలో కూరల సంచీ అందుకుంది. సుబ్బులు వెనుక నిలుచున్న పెదతల్లికూడా సుదర్శనానికి దారి యిస్తూ ప్రక్కకు తప్పుకుంది.

సుదర్శనం తన గదిలోకి పోయి, పుస్తకాలు సర్దుకుంటుండగా సుబ్బులును పిలిచి జరిగిన సంగతిగూర్చి బోగట్టా చేయాలనే ఉద్దేశం కలిగింది. కాని టేబిల్‌మీది వాచీ 'పదినిముషాలే యింక వ్యవధి!' అని చెప్తుండటంచేత అతను ఏవిషయమూ తెలుసుకోకుండానే కాలేజీకి వెళ్లిపోయాడు.

౨

సాయంత్రం అయిదుగంట లవుతుంది. సుదర్శనం అప్పుడే వచ్చాడు. సుబ్బులు ఇల్లు ఊడుస్తోంది. పెత్తల్లి నట్టింట కూర్చుని, కళ్ళద్దాల్లోంచి నిదానంగా చూస్తూ 'గోవిందనామాలు' పాడుకుంటోంది. పెరటి వాకిట్లో ఏమూలనుంచో శ్రీపతిగాడి కాళింగడరాగాలాపన మందరంగా వినవస్తోంది.

సుదర్శనం బట్టలు మార్చి ముఖం కడుక్కోవడానికి నూతివద్దకు వెళ్లాడు. ఆచారవిరుద్ధంగా తల్లి మడి కట్టుక బియ్యం కడుగుతోంది. సుదర్శనం ఈ ఒక్క విషయంతోనే పరిస్థితి అంతా గ్రహించాడు. ముఖప్రక్షాళనానంతరం గదిలోకి పోయి సాయంకాలపు వేషం వేయసాగాడు.

సరిగ్గా ఇదే సమయంలో తుఫాను విరుచుకు పడింది.

నట్టింటిలోంచి 'ఛెళ్లు—ఛెళ్లు'మని రెండు చరుపులూ, తారకస్థాయిలో శ్రీపతిగాడి ఆర్తనాదాలూ ఒకదానివెంబడే ఒకటి ఏమాత్రం ఎడం లేకుండానే వినవచ్చాయి. తరవాత సరస్వతి మధ్యమస్వరంలో అరవసాగింది—

"—వెధవా! అంత పంతమా! కాదు—అంత పంతమా—అంటాను!! నన్ను కాల్చుకు తింటావా!? తిను వెధవా..." 'తిను!' 'తిను!'అంటూనే సరస్వతి నాలుగు ఒబ్బట్లు వేసింది.

అయితే శ్రీపతిగాడైనా సామాన్యుడు కాదు. ఉన్నవాడు వేలెడైనా ఉపద్రుడు. వయసు మూడో ఏడే అయినా ఈ పిడుగులవాననుండి వాడిని రక్షించగలవారెవరో, ఎలా రక్షించుకోవడమో వాడికి బహు స్పష్టంగా తెలుసు. అందుచేతే అమ్మమ్మ నుద్దేశిస్తూ నిజంగా ప్రాణాలు పోతున్నవాడిలా అరవసాగాడు.

"అమ్మమ్మోయ్! అమ్మమ్మా!! చంపేసిందేవ్!!! చంపేసిందేవ్!!!"

—వాడు రక్షణకోసరం అరిచేకొద్దీ శిక్ష హెచ్చసాగింది.

"చవ్వు! చవ్వరా! చవ్వరా!!" అంటూ బాదసాగింది.

చివరకు అమ్మమ్మ ఉచ్చస్వరంలో అరుస్తూ బయట పడ్డది.

"ఒసేవ్! ఒసేవ్!! వాణ్ణి కొడితే యేముందే! నన్ను కొట్టే. నా మీది కోపం వాడిమీద తీర్చుకుంటే ఏమి లాభమే! వేలెడి వెధవ! చచ్చిపూరుకుంటాడు!! దుక్కలా వున్నాను-నన్ను కొట్టు. విన్నావా-నన్ను కొడితే నీ కసి తీరుతుంది!!"

ఆమె ఆగింది. నిచ్చరబోయినట్టు చూస్తున్న సరస్వతి దిగాలుస్వరంతో అంది—

"విను దొడ్డమ్మా!"

పార్వతమ్మగారు జీనుకటంత స్వరంతోనే అందుకున్నారు—

"—దొడ్డమ్మ వింటూనేవుంది! లేకపోతే వేలెడు వెధవ నీతో పంతగిస్తున్నాడా! నిన్ను కాల్చుకు తింటున్నాడా!..." చప్పున గొంతు మారుస్తూ,... "...ఎవరు నీతో పంతగిస్తున్నా రని నువ్వనుకుంటున్నావో, ఎవరు నిన్ను కాల్చుకు తింటున్నారని నువ్వనుకుంటున్నావో— ఈ తిట్లూ, ఈ శాపనార్థాలూ ఎవళ్లని ఉద్దేశించో అందరికీ తెలుసు!!!"

సరస్వతి ఈసా రెందుచేతో జవాబు చెప్పలేదు. పార్వతమ్మగారే పై వ్యాఖ్యానాన్ని సమర్థించుకుంటూ చెప్పసాగారు.

"—లేకపోతే అర్థణా అనగా ఎంత? నీ దగ్గర లేకపోతే నన్నడగకూడదూ? ఇంతకుముందు ఎప్పుడూ ఇవ్వలేదా? లేకపోతే వాళ్ల మామయ్య వచ్చాక వాణ్ణడక్కూడదూ? లేకపోతే ఆ సుబ్బులును అడక్కూడదా! నాతో మాట్లాడటానికి నీ కంత నని పాపైతే వాళ్లతో మాట్లాడటాని కేం? లేదు—ఒకవేళ నీ హోదాకు అది చిన్నతనమే అయితే—అంత రాజసమే అయితే— కుర్ర వెధవ!— వాణ్ణే పోయి అడగమనకూడదూ!—"

క్షణ మాగి—

"—అర్థణా కోసరం వాణ్ణి పట్టుక చావగొడతావా? చిన్న పిల్లడికి మారాం—అది ఒక పంతమా? పసివాడు!—వాడి గోలకొద్దీ ఏడుస్తే అది నిన్ను కాల్చుకు తినడమా!—"

స్వరం మారుస్తూ—

"సరే ఒప్పుకున్నామయ్యా! ఇంతకుముందు వా డెంత అల్లరి చేసినా ఇంతలా పట్టుకు బాదావా? ఇవాళే ఇలా పట్టుక బాదావంటే అది ఎవరిమీద కోపం అనడం? ఆ దెబ్బలు ఎవరిని ఉద్దేశించి అనడం?"

ఈ సవాలుకుకూడా జవాబు రాకపోయే సరికి స్వరం మళ్లా మారుస్తూ—

"—కుర్ర వెధవ! అమ్మమ్మోయ్ అమ్మమ్మోయ్ అని అరుస్తావుంటే అదే బాదడమా? అదే వాడి అమ్మ బ్రతికే వుంటే వాడి ఒంటిమీద దెబ్బ పడనిస్తుందా?......దిక్కుమాలిన అమ్మమ్మ! బ్రతికినా చచ్చినలో జమైన అమ్మమ్మ—ఈ పెద్ద మ్మమ్మ కాబట్టి వాడంతలా అరుస్తున్నా అడ్డుపడలేక పోయింది"

పార్వతమ్మగారు అలసిపోతూ ఆపేశారు. అంత వరకూ మౌనంగా గదిలోంచి వింటూవున్న సుదర్శనం బయటకు వచ్చి అన్నాడు. అది-తనేమీ అనకపోతే బాగోదనే అన్నాడో, లేక తల్లిని మందలించే ఉద్దేశంతోనే అన్నాడో, లేక సరస్వతిపక్షాన వకాల్తా పుచ్చుకుంటూనే అన్నాడో—ఎవరికీ తెలియదు. అసలు అతడికే తెలియదేమో?

"అది దాని కొడుకును కొట్టుకుంటే మధ్య నీ కెందుకూ?"

దానికి పార్వతమ్మగా రిచ్చిన జవా బిదీ—

"అవును—అవున్నాయినా అందుచేతే ఊరు కున్నాను. నాకు దానిని పెంచడానికీ, పెద్దదానిని చెయ్యడానికీ, పెళ్లి చేసి ఒకయింటిదానిని చెయ్యటానికీ అయితే స్వతంత్రం ఉంది గానీ—అది స్వయానా మోసి కని పెంచుతున్న కొడుకును సొంతచేతులతో కొట్టుకొంటూ ఉంటే—అడ్డడాని కేం స్వతంత్రం ఉంది? అందుచేతే నోరు మూసు కూరుకున్నాను!"

సుదర్శనం వెంటనే జవా బిచ్చాడు: "అయితే ఆ మాట అనుకోవడ మెందుకూ?"

ఈ నాటిప్రశ్న పార్వతమ్మగారిని న్యాయంగా బహుక్లిష్టపరిస్థితిలో పడేసివుండవలసింది. కాని ఆమె తన అమ్ములపొదిలోని దివ్యాస్త్రాన్ని ప్రయోగించి తప్పుకున్నారు.

"ఎందుకా? నీచేతా నీచేతా చెప్పుదెబ్బలు తిన డానికి!"

ఇలా అంటూనే ఆమె వంటింటిలోకి వెళ్లి పోయారు.

అంతతో తుపాను శాంతించింది. ఆ నిశ్శబ్ద వాతావరణంలో కొంతవరకూ మౌనంగా ఊరుకొని పిదప ఒక మూలుగు మూలుగుతూ బయటకు పోయి చెప్పులు తొడుక్కోసాగాడు. వట్టింట్లోంచి దొడ్డమ్మ మందలింపుస్వరం రహస్యంగా వినవచ్చింది.

"అదేమిటే! పెద్దవా ళ్లమున్నా అంటే యేడు స్తారా? ఊరుకో! దీపాలవేళ వట్టింట ఆడపిల్ల యేడవ రాదు."

సుదర్శనం జోళ్లు తొడుక్కొని వీథిలోకి బయలుదేరాడు. వరండాలో సుబ్బులు శ్రీపతిగా నెత్తుకొని 'ఐస్ లడ్డూవాలా'నిచూపిస్తూ ఏమి టేమిటో చెపుతోంది. ఆ టక్కరివెధవ కూడా నత్తినత్తిగా మాట్లాడుతూ మధ్యమధ్య నవ్వుతున్నాడు.

సుదర్శనం జోళ్లు చప్పుడు చేసుకుంటూ మెట్లు దిగిపోయాడు.

## 3

సుదర్శనం తిరిగి ఇంటికి వచ్చేసరికి ఏడుగంటలు దాటింది.

తలుపు త్రోయగానే అతడు గమనించింది నడవ వరండాలో లైటు లేకపోవడం. అరగంటపైని విద్యుద్దీపాల కలవాటుపడ్డ కళ్లను చీకట్లలో చూచేటట్లు బల వంతంచేస్తూ నడవ దాటి వరండాలోకి వచ్చాడు. వరండాఅంతరాళంలో కణకణమెరసే నిప్పుముద్ద అక్కడ బావగారున్నారనీ, బహుశః మడతకుర్చీలో కూర్చున్నారనీ చెప్పింది. ఇంతలో సుబ్బులు హరికెన్ లాంతరు తీసుకవచ్చి దూలాన్నుండి వ్రేలాడే తీగకు తగిలించింది. నిప్పుముద్దసూచనలో పొరపా టేమీ లేదు. బట్టలు మార్చుకోకపోవడంబట్టి చూస్తే అప్పుడే వచ్చిన ట్టుంది.

సుదర్శనం కాళ్లూ చేతులూ కడుక్కొని వచ్చి బట్టలు మార్చాక పెట్టెలోంచి పుస్తకాలూ, తీ

నుంచి లైటూ తీసుకొని ముందు వేసుక కూర్చున్నాడు.

అలవాటుప్రకారం భగవద్ధ్యానం చేశాడుకాని పుస్తకం తెరిస్తే ఏకాగ్రతమాత్రం సాధ్యం కాలేదు. ధ్యానశ్లోకాలు మౌనంగా పఠించుకుంటుంటే జరిగిన నిరాడంబరసంఘటన అతని ఏకాగ్రతను చెరిచింది.

సరస్వతి తుండుగుడ్డా, గూడకట్టువాణీ భుజాన వేసుకొని యింకోచేతిలో గావంచాతో బావగారిని సమీపిస్తూ గావంచా అందివ్వబోయింది. చాలా సెకండ్ల వరకూ సరస్వతిచేయీ, చేతిలో గావంచా అలా నిరీక్షిస్తూనే వున్నాయి. తర్వాత సరస్వతి అచ్చు భర్తలో మాట్లాడే స్వరంతోనే అంది:

"లేవండి మరి!"

ఆ తర్వాతకూడా కొన్ని సెకండ్లు గడిచాక అతను బహు సాఫీఅయిన స్వరంలో జవా బిచ్చాడు:

"అప్పుడేనా! ఇంకా రాత్రి పదైనా కాందీ తెమిలిరాలే దనుకున్నాను."

దీనికి సరస్వతి ఏమీ జవా బివ్వలేదు. నిలువబడి యీమే, కుర్చీలోంచి అతడూ కొన్ని సెకండ్లవరకూ విడివకుండా ఒకరివంక ఒకరు చూసుకున్నారు. తర్వాత ఆయన తాపీగా లేచి సరస్వతిచేతిలో గావంచా అందుకుంటూ పెరట్లోకి నడిచారు.

ఈసంఘటనే సుదర్శనానికి ఏకాగ్రత సాధ్యం కాకుండా చేసింది. ఇలా ఈవాళే కాదు—కొన్ని నెలలైంది ఒకటే వరుస. ఎప్పుడు ఏ దుష్టగడియల మార నారంభించిందో తెలియదు—ఏ అగోచరప్రమేయపు మహిమవల్లో తెలియదు—అంతవరకూ గృహముగా ఉంటూవచ్చిన ఆ యిల్లు సాగరంగా మార నారంభించింది. కొద్ది దినాలై కల్లోలినిగా రూపందుతోంది.

ఇంట్లో వచ్చిన, వస్తున్న మార్పును అందరూ గుర్తిస్తున్నారు. దాని ఫలితాన్ని కూడా అందరూ అనుభవిస్తున్నారు.

ఒకప్పుడు ఆ యిల్లు ఆనందానికి నిలయం. ఎవరు ఎవరినిగురించి ఎంతలేని మాటలు, ఎటువంటి పరిహాసాలు ఆడదలచుకొన్నా నిర్భయంగా నిశ్చింతగా ఆడుకొగలిగేవారు. అప్పుడు వాళ్లు మాట్లాడే భాషకు నానార్థాలూ శ్లేషార్థాలూ వుండేవేకావో, లేక ఏళ్లు పైబడ్డ కొలదీ జ్ఞానం పెరిగిపోయి వాడే భాషలో శ్లేషలనూ నానార్థాలనూ స్ఫురించే శక్తి క్రొత్తగా వాళ్లలో కలిగిందో తెలియదు. ఏమైనా-ఈవిధమైన విజ్ఞానపురోగమనంవల్ల వాళ్లు సుఖపడిందిమాత్రం ఏమీ లేదు. ఆ యింట్లో ఒక్కరుకూడా కులాసాగా యాదమరచి మాట్లాడుతున్నారనికాని, కనీసం గట్టిగా ఊపిరి పీలుస్తున్నారనికాని చెప్పడానికి వీలు కాదు. కుటుంబ యజమాని తండ్రిదగ్గరనుంచి చంటివాడు, శ్రీపతివరకూ అందరూ ఈ కలితకల్లోలినీతరంగముల సుడులకు పడమద మాతున్నారు. కాని దీనికి పరిష్కారాన్నిమాత్రం ఒక్కరూ యోచించినట్టు లేదు. ఆ ప్రయత్నంలోనైనా ఉన్నట్టు లేదు. కనీసం, ప్రయత్నించాలనే జ్ఞానమైనా ఒకరికీ ఉన్నట్టు లేదు—ఒకవేళ ఉన్నా అది వ్యక్తం కావటం లేదు.

ఒకొక్కఅప్పుడు సుదర్శనంమాత్రం కొన్ని అనవసరపు ప్రశ్నలకు జవాబులు ఆలోచిస్తూ వుంటాడు. 'అసలు ఈ గొడవకు మూలకారణా లేమిటి? తప్పు ఎవరిది?' కనీసం వీటికైనా అతడు జవాబు చెప్పుకోలేడు.

ఆరాత్రికూడా ఈ ప్రశ్నలకే జవాబులు వెతుకుతూ కూర్చున్నాడు. కొంతసేపయాక డాబామీద సంధ్యావందనం పూర్తిచేసుకవచ్చిన తండ్రి భోజనానికి లెమ్మని హెచ్చరించగానే ఎలా తెరిచిన పుస్తకం అలానే మూసేసి లేచిపోయాడు.

౪

సుదర్శనానికి మర్నాటు శెలవు. మధ్యాహ్న భోజన మయ్యాక అలా ఓ చిన్నషికారు వెళ్లి 'అగ్ని కార్యం' నెరవేర్చుకొని వచ్చాడు.

నట్టింట తల్లీ, పెత్తల్లీ దగ్గరగా ఒకళ్లకొక ళ్లెదురుగా కాళ్లు చాపుకుని కూర్చున్నారు. తన అలికిడి వినగానే ఇద్దరూ వీథివాకిలివంక చూశారు. సుదర్శనం తిన్నగా గదిలోకి వెళ్లిపోయాక రహస్యంచెప్పే ధోరణిలో పార్వతమ్మగారు కథనం ఆరంభించారు.

"ఆఁ...తర్వాత—అదీ—శ్రాద్ధమూ అవీ అయిపోయాయి. అప్పుడు ప్రశ్న వచ్చింది—'పిల్లను ఎవరు పెంచటం?' అని. అతడికేమో ఇరస్తాపరస్తా ఎవ్వరూ లేరు. ఒక అప్పజెల్లెలు ఉందన్నమాటేగాని చివరకు

దీని పెళ్ళిలో కూడా వచ్చి 'అయ్యో! తల్లిలేనిపిల్ల! పురిట్లోనే తల్లి పోయింది! ఇప్పుడు తండ్రికూడా లేడు.' అని ఆలోచించి ఒక చీరగుడ్డా, ఇంత పసుపూ కుంకం పెట్టిన పాపాన పోలేదు. అటువంటి అభిమానం కలవిడి పన్నెండ్రోజుల పసిగుడ్డును భుజాన వేసుకొని పెంచడానికి ముందుకు వస్తుందా? అందుచేత టక్కు పెట్టేసి పూరుకొంది. ఇంక 'వీరా వారా? ఎవరు పుచ్చుకుంటా రీ పిల్లను' అంటూ చివరకు తీసుకవచ్చి నామీద పడేశా రీపిల్లను. అప్పటికి నాపరిస్థితి కూడా అనుకూలంగానే ఉంది. జ్ఞాపకం ఉందా? మీరు ఖరగ్ పూరులో అఁ హాఁ ...కాదు కలత్తాలో ఉండేవారు. ఇలా మగపిల్లడు పుట్టిపోయాడని మేంఉత్తరం వ్రాస్తే బావగారి కప్పుడు జబ్బుగా ఉండటం, అందుచేత అప్పుడు మీరెవరూ రాలేకపోవటం, చివరకు ఉత్తరానికి జవాబు కూడా రాకపోయేసరికి మే మేదో అనుకోవడం—అ గొడవలన్నీ అయాయి. సరీగ్గా శ్రావణశుద్ధతదియ నాడు నాకు కానుపు కలిగింది. పిల్లడు పుట్టి ఆరాత్రే పోయాడు. మళ్లా ఆషాఢశుద్ధ తదియనాడు మా చెల్లెలికి పురుడు వచ్చింది. అంటే రోజులతోసహా సరీగ్గా సెల్లాళ్లన్నమాట.

మా మరిది వచ్చి అన్నాడు—

'అమ్మా'—అత నెప్పుడూ నన్ను అమ్మ అనే అనేవాడు. 'అమ్మా! దేవుడు ఎందుకు ఎప్పుడు ఏపనిచేస్తాడో తెలియదు. మీకు పుట్టిన పిల్లణ్ణి దక్కనీకుండా చేశాడు. ఈ పిల్లకు కనుక్కున్న తల్లి లేకుండా చేశాడు. దీనినిపట్టి చూస్తే మీ యిద్దరికీ ఘటన వ్రాసివుందన్నమాట. అందుచేత మీ కింక పిల్లను పెంచక తప్పదు. ఇంక కాదూ కూడదూ అంటే దాని పీక నులిపి నూతిలో పడేస్తాను. ఆవెంటనే నేనుకూడా దూకేస్తాను' అన్నాడు......"

ఇలా అంటూ పార్వతమ్మగారు తోడికోడలు ముఖంలోకి చూస్తూ ఆగారు. కాని ఎంతకూ ఆమె నుండి ఏవిధమైన ఆశ్చర్యార్థకం బయటకు రాకపోయ్యేసరికి ఆ చివరివాక్యాన్నే మళ్లా వ్యాఖ్యానిస్తూ కథనంలో బిగువు చెడకుండా ఆరంభించారు.

"—'యింక మీరు కాదంటే నుయ్యో గొయ్యో చూసుకోవాలంటాడూ!' అప్పుడు నాకు చాలా జాలి వేసింది. 'అయ్యో నాయనా, యీమాత్రం మహాభాగ్యానికి యింతగా అడగాలా! నాకుమాత్రం ఏ పదిమంది ఉన్నారూ—'అప్పటి కింకా సుబ్బులు పుట్టలేదు అందుచేత 'తప్పకుండా అలానే పెంచుతాను' అన్నాను.

అదిలగాయితూ—అంటే పిల్లను మేము యిక్కడకు తీసుకవచ్చేశాక ఆరుమాసాలదాకా—తిరిగి చూడలేదు. ఆతర్వాతైనా ఇంక బాగుండదనీ, నలుగురూ అనిపోతారనీ, ఆరేసిమాసాల కొకసారి చూడ్డానికి వచ్చేవాడు. ఆ ముచ్చట కూడా ఎన్నాళ్లో సాగలేదు. అది చచ్చిన రెండేళ్లకే యీయనకూడా హరీమనే డు.

...అఁ. చెప్పవచ్చే దేమంటే—అటువంటి పసికందును తీసుకవచ్చాను. తీసుకవచ్చాక పెంచి పెద్దదాన్ని చేశాను. పెంచడంలోనూ నాపిల్లలకన్నా ఎక్కువగా చూస్తూ పెంచాను. అయితే అలా పెంచినందుకు అదికూడా కొంత విశ్వాసం చూపించింది. ఏ మాటకు ఆ మాటే అనుకోవాలి. దానికి ఎనిమిదేళ్లు వచ్చి కాస్త జ్ఞానం తెలిశాక ఆనోటా ఆనోటా కథంతా తెలుసుకుంది. అఁహోఁ—అలాగా అని అక్కణ్ణుంచి ప్రవర్తన మార్చేసుకుంది. నేను తొమ్మిదేళ్ల క్రిందట జబ్బుపడ్డాను-జ్ఞాపకం వుందా? ఆయన టెలిగ్రాం ఇస్తే బావగారు రావడానికి వీల్లేక పోతే నువ్వు పెద్దవాణ్ణి తోడుచేసుకొని వచ్చేవు. అప్పుడు జబ్బు నయమయ్యాక మీరు వెళ్లిపోయారు. ఆ తర్వాత దగ్గరదగ్గర సంవత్సరందాకా ఇటున్న చీపురుపుల్ల అటు పెట్టలేదు—అటు పెట్టనివ్వలేదది. అప్పటికి దాని కన్నేళ్లూ—పదే ళ్లుంటాయేమో! అయినా అలానే చేసింది పాపం. అందుచేతే ప్రేమలోంచి వచ్చింది కాకపోయినా అదే నా కూతురనుకున్నాను. సొంత కూతురుకు కూడా జరుపని ముద్దూ ముచ్చటా జరిపాను. పెళ్లికి బంగారమంటే, కట్నాలంటే, తర్వాత తర్వాత లాంఛనాలంటే ఏం తక్కువయ్యాయా అక్కయ్యా! నీకు తెలియం దేముందీ!

అయితే—మాటే దక్కింది కాదు. మే మిప్పుడు చే దయిపోయ్యాం. పెళ్లయింది—పెళ్లే కాదు—

ఆయనగారికి ఈ ఊళ్లో ఉద్యోగం వేయించి ఇంట్లో తెచ్చిపెట్టుకున్నాం: ఆరంభమయింది రగడ. ఎందుకూ అంటే ఏమీ లేదు..."

పార్వతమ్మగారు ఆరంభమైన రగడనురించి ఆరంభించకముందే సుబ్బులు వచ్చి అంతరాయం కలిగించింది.

సుబ్బులు వాణీచెరగుతో చేతులు తుడుచుకుంటూ అడిగింది—

"ఆ కథ మీ అక్కగారికి తర్వాత చెపుదువుగాని, ముందు నా కిది చెప్పు. నన్నిప్పు డేం చెయ్యమన్నావ్?"

కథనంలో లీనమైపోయిన బుద్ధిని ప్రస్తుతస్థితికి తెచ్చుకోవటానికి పార్వతమ్మగారికి పూర్తిగా ఒక నిమిషం తీసుకుందికాబోలు!

అంతవరకూ విమూఢవలె కూతురువంక చూస్తూ అప్పుడు అకస్మాత్తుగా అన్నారు.

"ఆఁ...ఎంగిళ్లు పూర్తయ్యాయా?"

సుబ్బులు నవ్వుతూ అంది—

"అభ్భ! తెలివి వచ్చింది! అయ్యాయి"

"అయితే! గిన్నెల్లో అన్నం కూరా అవీ పళ్లెంలో పెట్టేసి మూత పెట్టి వుంచు. గిన్నెలు అవతల పడెయ్యి"

"అన్నం చల్లారిపోదూ!"

"చల్లారిపోతే పోతుంది. ఆ మహారాణీగారు ఎప్పుడో వస్తారని అంతవరకూ ఎవరు కాచు కూర్చో గలరు? పోనీ అదే పడేస్తుందేమో అంటే ఈలోగా పనిమనిషి వస్తే నువు మళ్లా మడిగట్టుకొని అంట్లు వెయ్యాలి. లేదా ఆ అంట్లగిన్నెల్లోనే రాత్రికి వండుకోవాలి"

సుబ్బులు ఎందుచేతో క్షణ మాలోచించి 'సరే!' అంటూ వెళ్లిపోయింది.

తర్వాత పార్వతమ్మగారు తోడికోడలివంక తిరిగి కథ ఆరంభించబోయింది.

కాని రెండునిమిషాలు గడిచినా సుబ్బులు వచ్చి తెంచిపోయిన భావజాలం చివరను వెదికి పట్టుకోలేకపోయింది. చివరకు మరొక క్రొత్తమొనతో ఆరంభించింది.

"—పెళ్లయింది, దాని తత్వం మారిపోయిందక్కయ్యా!

ఎంతసేపూ తన మొగుడూ తన పిల్లడూ తనే గాని—తక్కినవాళ్లు ఉన్నారా చచ్చారా అనేనా చూడదు.

ఒక నీళ్లందివ్వవలసివస్తే తన మొగుడుకు ముందు. ఒక పాలు అందివ్వవలసివస్తే అతడికే ముందు. ఎందులో నయినా చూడు—ముందు అతని సంగతి చూస్తుంది. ఆ తర్వాత ఒకవేళ చూస్తే తక్కినవాళ్ల సంగతి కూడా చూస్తుంది.

మొదటల్లా అల్లుడు చుట్టరికానికి వచ్చిపోతుండటంచేత మర్యాదకు చేస్తోంది అనుకుంటూ వచ్చాను. తర్వాత అతడికి ఈ ఊళ్లోనే ఉద్యోగం వేయించి—పోనీ ఆ వచ్చే నాలుగురాళ్లతో జీవితం గడుపుకోవటం కష్టంకదా అని ఇంట్లో కూడా పెట్టుకోవడం...... కూడా జరిగింది."

అంతవరకూ ధారాళంగా సాగుతూవచ్చిన పార్వతమ్మగారి వాగ్ధోరణి ఎందుచేతో తెక్కడం ఆరంభించింది. ఎదురుగా ఉన్న ఆమెకు గుర్తించేశక్తి లేదు కాని ఆమె మనోనేత్రాల్లో ప్రతిఫలించే తబ్బిబ్బు చిహ్నాలు బాహ్యనేత్రాల్లో కూడా లీలగా గోచరిస్తూనే ఉండాలి.

ఆమె ఎలా నిలవదొక్కుకుందో చివరకు మళ్లా యథాస్థితికి వస్తూ చెప్పుకపో నారంభించింది.

"పోనీ నువ్వు చెప్పు! వలుగుర్ని పంక్తిలో కూర్చోబెట్టి ఒకరికి అట్టూ ఒకరికి ముక్కా పెట్టడం ధర్మమేనా? ఒకవేళ నీకు ధర్మమనే తోచినా చూసేవాళ్లకైనా జడియవద్దా!

ఇవన్నీ ఎప్పటి కప్పుడే గుర్తిస్తున్నా లెక్క చెయ్యనే లేదు. వాళ్ల నాన్నగారికీ వాళ్లన్నయ్యకూ ఏం కావలసినా ఆ సుబ్బులే చూసుకుంటుంది. అనైన నే నున్నాను. దగ్గర దగ్గర వలభైఏళ్లు వంటికి వచ్చినా నీధర్మమా అని పని లక్ష్యం లేదు. ఇంతకాలమై ఏళ్లే చేస్తూ నాలేదుకదా!"

పాపం! పార్వతమ్మగారి భావనాజాలం మళ్లా తునియలైపోయింది. వెంటనే ఆమె సంభ్రమంతో నలుదిక్కులా వెదుక్కుని ఎదురుగా అగపడ్డ చివరితో మళ్లా బయలుదేరారు.

"ఇంక ఆ మొగుడంటే లోకంలో ఎక్కడా లేని చావు చచ్చిపోతుంది. అతడు అడింది అబద్ధమే కానీ సుబద్ధమేకానీ—తప్పే చెయ్యనీ ఒప్పే చెయ్యనీ అతణ్ణే వెనకవేసుక వస్తుంది. మొగుడియందు అటువంటి అభిమానం ఉండడం మంచిదే. మనవంటి పెద్దవాళ్లు కోరేది కూడా అదే. కాని అందులోనైనా న్యాయం అన్యాయం వద్దా అంటాను. ధర్మందగ్గరా, న్యాయందగ్గరా పక్షపాతం తగునా అంటాను. 'పుట్టుగ్రుడ్డు'గా ఉన్నప్పుడు నిన్ను తీసుకవచ్చాను. పెంచాను. పెద్దదానిని చేశాను. పెళ్లిచేసి ఒకయింటిదాన్ని చేశాను—ఇన్నీ చాలక నీ బ్రతుకు ఏం బండలు అవుతుందో అని ఇంట్లో పెట్టుకున్నాను. నిన్నగాక మొన్న వచ్చిన మొగుడే దేవుడైనప్పుడు యిన్ని విధాలా నీకు చేసిన మేమేమై ఉండాలి! అ దాలోచించవేల? అంటాను."

పార్వతమ్మగారు తమకు తెలియకుండానే బాగా ఉద్రేకపూరితులైపోయారు. ఆ విషయం గుర్తించారేమో అకస్మాత్తుగా ఆగిపోయారు. తర్వాత ఆమె గొంతు తగ్గించి మాట్లాడటాన్ని బట్టి చూస్తే అదే కారణమనిపిస్తుంది. కాస్త కాలంతీసుకొని ఆమె సాధికశాంతయుయి చెప్పసాగారు.

"నేను అందుకూ ఏమీ అనలేదు. అసలు దీని అభిమానం ఎవరికి కావాలి? నాకు నా పిల్లలు ఇద్దరు ఉన్నారు. ఇంతకూ వీళ్లేదో ఒరగపెడతారని నే నేనాడూ వీళ్లకు చెయ్యలేదు. ఎంత చేసినా పరాయి పేగు పరాయి పేగే అని నాకు మొదట్నించీ తెలుసు. అయితే ఒక మాట. ఇదీ—ఇది నన్ను మోసం చేసింది. పెళ్లికానంతకాలం—దాని కొక ఆధారం దొరకనంత కాలం దొడ్డమ్మే సర్వస్వం అన్నట్టు అభిమానం చూపించింది. ఎంతో విశ్వాసం కలదానిలా ప్రవర్తించింది. తీరా పెళ్లయాక, యింక నా అండ మరి అవసరం లేదని తోచాక 'పోన్ నీలత్యం నాకేమిటి?' అంటోంది."

పార్వతమ్మగారి స్వరం, ముఖం కళలు మార్చుకొంటూవచ్చి చివరికో వికృతరూపం ధరించాయి. ఆమె ఆగిపోయారు.

కొన్ని నిమిషాలవరకూ అలా మౌనంగా ఊరుకున్నారు. ఈలోగా వింటున్న ఆమె ఒక దీర్ఘనిశ్వాసం, ఆతర్వాత కొద్దిసేపట్లో చెపుతున్న ఆమె ఒక సుదీర్ఘనిశ్వాసం విడిచారు. తర్వాత వంటింటి చక్కబాటు పూర్తిచేసుకొని వచ్చిన సుబ్బులు కూడా మడివిడిచి వచ్చి కూర్చుంది. ఎవరూ మాటాడలేదు.

చివరకు స్నేహితురాలి ఇంటినుండి సరస్వతీ కొడుకూ రాకతో ఆ సంభాషణ పూర్తిగా ఆగిపోయింది.

౫

సరిగ్గా వారంరోజులు గడిచాయి. ఆవాళ సరస్వతి స్నేహితురాలిని చూడటానికి వెళ్లటంలోని ఆంతర్యం తెలిసింది. అదీ సుదర్శనానికిమాత్రమే.

సరస్వతి బండీ ఎక్కుతుంటే బండీఅతను అడిగాడు. బావగారికి చెప్పడమే చేతనయిందికాదో, బండీవాడికి గ్రహణశక్తి తక్కువో తెలియదు. అతను ఎంత వర్ణించినా, ఎన్ని గుర్తులు చెప్పినా సారథికి గమ్యస్థానం తెలిసింది కాదు. చివరకు సరస్వతిని చూడగానే అతడికి అర్థమయిందికాబోలు. ఆమెను ఉద్దేశిస్తూ అడిగాడు:

"వారంరోజులకిందట ఆయాళ మనం వెళ్లిన యింటికిటమ్మా!"

సరస్వతి ముఖం ఎత్తి బండివాడివంక చూడబోయింది. కాని వెంటనే ముఖం దించేసుకుంది. సరస్వతిగొంతులోంచి వచ్చిన స్పష్టాస్పష్టపు అంగీకారసూచకస్వరం విని బావగారు 'అవును ఆ యిల్లే' అంటూ బండివాడికి జవా బిచ్చారు.

దీనినిబట్టే సుదర్శనం ఆనాటి సంఘటన అంతవరకూ తను అనుకుంటున్నట్టు అకస్మాత్సంఘటన కాదనీ, దానివెనుక చాలా కుట్ర ఉందనీ గ్రహించాడు. వెంటనే ఒకసారి అతని ఒళ్లంతా వేడెక్కిపోయింది. కాని కొద్దిసేపట్లోనే అతడు శాంతు డయ్యాడు.

అవాళ జరిగిన సంఘటన ఇదీ. ఉదయం ఏడు గంటలవేళ సుదర్శనం స్నానం చేసి నట్టింట అద్దం ముందర తల దువ్వుకుంటున్నాడు. సుబ్బులుగొంతు వినవచ్చింది.

"ఇది పనికివస్తుందా?"

"అ దేమాత్రం ఉడుకుతుంది?"

అది తండ్రిగొంతు. సుదర్శనం వింతతో వెను తిరిగి చూశాడు. సుబ్బులుచేతిలో ఓగిన్నె ఉంది.

"రెండుతవ్వలు ఉడుకుతుం దనుకుంటాను"

"సరే, అది అక్కడ పెట్టి మన చిన్న పళ్ళగిన్నె పట్రా......"

సుదర్శనానికి అప్పటికి ఇంకా అంతు చిక్కలేదు. కాని కొద్దిసేపట్లోనే అర్థ మయింది.

తొమ్మిదిగంటలకు అంతా సిద్ధమయ్యింది. అంత వరకూ పార్వతమ్మగారు అలా వంటియింటిలోనే కూర్చున్నారు. పెదతల్లి కొంతసేపు నట్టింటా, కొంత సేపు నడవలోనూ కాలం గడుపుతూ వచ్చారు. బావ గారు నడవవరండాలో కుర్చీలో చారబడి సిగరెట్ మీద సిగరెట్ తగలవేస్తున్నారు. శ్రీపతి అజ్ఞానపు ప్రశ్నలతో అందరి గుండెలూ కలుస్తూ యిల్లల్లా కలయ దిరుగుతున్నాడు. కుమార్తె లిద్దరూ తండ్రిఆదేశాలను నిర్వహిస్తూన్నారు. అంతవరకూ ఎట్టి కంటప్రయత్నాలూ జరుగ లేదు. చివరకు తొమ్మిదిన్నర గంటలకు సర్వమూ సిద్ధమయాక సుదర్శనాన్ని పంపి ఒకసామాను బండీ ఒకపెట్టిబండీ తెప్పించారు.

సకల సామానులు బండిలో సర్దుతుంటే తండ్రి సరస్వతిని హెచ్చరించారు.

"ఇంకేమిటమ్మా ఆలస్యం?"

సరస్వతి ఈ హెచ్చరికతో ఓవిధంగా త్రుళ్లిపడి ఎదురుగా ఉన్న చెల్లెలిముఖంలోకి చూసింది. సుబ్బులుచూపులు అక్కచూపులను ఎదుర్కొన్నాయి. ఇద్దరిచూపులూ సిగ్గుతో ప్రక్కలకు తప్పుకున్నాయి. కాని మరుక్షణంలోనే వారి సిగ్గులు యింకో వెల్లువ ఆగమనంతో చెదిరిపోయాయి. ఆనకట్ట కట్టలేని దుర్బలురాలు రంగంలోంచి తొందరగా నిష్క్రమించింది. సరస్వతిమాత్రం రెండుసార్లు కంఠాన్ని మెదిపి అక్కడే అలానే నిలిచిపోయింది. కళ్లలో పొడసూపిన నీటి బిందువులు కళ్లలోనే యింకి పోయాయి.

పెత్తండ్రి హృదయాన్ని పదిలపరచుకుంటూ అన్నాడు: "పదమ్మా!"

సరస్వతి మళ్లా చైతన్యం తెచ్చుకొని మెల్లిగా వంటింటివైపు నడిచింది. కాని ఆమె ద్వారందగ్గరకు వచ్చాక ఎంత ప్రయత్నించినా అడుగు ముందుకు పడిందికాదు. అతిప్రయత్నంమీద అక్కణ్ణుంచే లోపలకు తొంగైనా చూడకుండా గొణిగింది.

"వెళ్లివస్తానమ్మా."

అమ్మకు వినపడిందో లేదో గాని ఆమెదగ్గర నుంచి తిరిగి జవాబుమాత్రం రాలేదు. ఆమె కోరేది కూడా అదే. తర్వాత ఆమె చేతులు రెండూ జోడించి శిరస్సు వంచి నమస్కారం చేసింది. అది ఎవరిని ఉద్దేశించి అయినా సంపూర్ణమైన భక్తితోనే అనేదిమాత్రం నిర్వివాదాంశం.

సరస్వతి తిరిగివస్తూ నట్టింట ఎదురుపడ్డ పెత్తల్లికికూడా పాదాభివందనం చేస్తూ అంది—

"వెళ్లివస్తాను దొడ్డమ్మా"

దొడ్డమ్మమాత్రం ఏమీ జవా బివ్వలేదు. మనసులోనైనా ఆశీర్వదించిందో లేదో తెలియదు. కాని నమస్కరిస్తున్నప్పుడుమాత్రం ముభావంగా ఉండకుండా చప్పున వంగి భుజాలు రెండూ పట్టుకొని లేవనెత్తింది.

సరస్వతి బండి ఎక్కాక భర్త శ్రీపతిని అందిచ్చాడు. బండి కదులుతుంటే శ్రీపతి తొందరగా అన్నాడు—

"అమ్మా! అమ్మా!! అమ్మమ్మ రాలేదే?"

తల్లి దీని కేమీ జవా బివ్వలేదు. కళ్లలో నీళ్లు తిరుగుతుండగా కొడుకుతలను గుండెల కదుముకుంది.

ముందు సామానుబండీ, మధ్య పెట్టిబండీ నడుస్తుంటే అల్లుడు మామ లిద్దరూ వెనక నడుస్తున్నారు.

వాళ్లు సందుమలుపు తిరగ్గానే సుదర్శనం కూడా లోనికి వెళ్లి పుస్తకాలు తీసుకొని కాలేజీకి వెళ్లి పోయాడు. (సశేషము)

# కలగూరగంప

## పిల్లల ఆటవస్తువులు

పిల్లలు ఆడుకొను బొమ్మలను పరిశీలించి, ఆయా దేశముల సౌభాగ్యమును, సంస్కృతిని చెప్పుటకు వీలున్నది. అన్ని దేశములలోను, ఒకేఒకరకమైన ఆటవస్తువులు కన్పించుటలేదు. పల్లెపదములు, జానపదగీతములు ఏరీతిగా జాతిభేదముచే మారుచున్నవో, అట్లే బొమ్మలుకూడా. ఇవన్నీ సంఘములోని మధ్యతరగతివారియొక్క, కార్మికకర్షకులయొక్క ప్రవృత్తులను అభివ్యక్తము చేయుచున్నవి. కాగా సంఘములోని ఆచారవ్యవహారములను, సంప్రదాయములను, ఆర్థికపరిస్థితులను ఇవి సూచించునవి అనకతప్పదు. ఆటవస్తువులు నిత్యకృత్యమునకు తగినపదార్థములు కావు. వీనిద్వారా పిల్లలకు పెద్దలకు ఒకవిధమైన క్రొత్తఉత్సాహము కలుగుట సహజమే. అనగా నివి జాతిలోని యౌవనదశకు సూచీపత్రములుగా తీసికొనబడవలెను. ఆయా కాలములందలి జీవితమార్గము నాశ్రయించుకొని ఆటవస్తువులు బయలుదేరుచున్నవి. వీటిలో చాలాబొమ్మలు పిల్లలచర్యను, ఆకాంక్షస్వభావములను తెలియజేయునవి. పిల్లలు లేనివారు, పిల్లలు కలవారు, వ్యాధిగ్రస్తులు మొదలగువారందరకు బొమ్మలమీద ఏదోఒక విశ్వాసము కన్పించుచున్నది.

మట్టితో తయారగు బొమ్మలే ఎక్కువగా ఉన్నవి. వీటి అన్నిటికి వెనుకభాగము సమప్రదేశముగా నున్నది. చాలావరకు ఇవి నగ్నములు. శరీరావయవములను నిర్మించుటలో ఎవరికి తోచినట్లు వారు నిర్మించుటకూడా వీటిలో కలదు. వీటిని సజీవముగా చూపుటకు రంగులను వేయుచున్నారు. చాలావరకు ఇవి నవ్వుపుట్టించునవిగా తయారుచేయబడుచున్నవి.

పెద్దల ఆటవస్తువులే పిల్లల చేతిలోనికి వచ్చినవని కొన్నిబొమ్మలు తెలియజేయుచున్నవి. పెద్దల పూజాపదార్థములు కొన్ని పిల్లల ప్రపంచములోనికి దిగినట్లుకూడా కన్పించుచున్నవి. దక్షిణదేశములో శరన్నవరాత్రములందు తెలుగుదేశములో సంక్రాంతి కాలమున బొమ్మలపూజను గమనించితే బొమ్మల ఆటకు, విగ్రహారాధనకు గల సన్నిహితసంబంధము బోధపడగలదు. ఇట్లే విఘ్నేశ్వరప్రతిమకు పిల్లల ఆటవస్తువులలో కొన్నిటికి గల పోలికను పరిశీలించితే హాస్యభావము, పూజాభావము ఎట్లు ఈ బొమ్మలలో కలసిపోవుచున్నవో తెలియగలదు. చాలాబొమ్మలు మాతాపుత్రులను చిత్రించినవి. వీటిలో మాతృప్రతిమ సమగ్రమైన జీవితముతో తొలంకాడుచు, కాంతమూర్తిగా, ఆనందమయముగా నుండి, శిశువును లాలించునట్లు, స్వార్థరహితమైనట్లు కన్పించును. అతి ప్రాచీనకాలపు సస్యదేవతలు దేవాలయములమీద, పిల్లలచేతులలోను నగ్నప్రతిమలుగా మారినవి. బౌద్ధ వైదికమతములలో నీ సస్యదేవతలే శక్తిగా మారినవి. పశుపక్ష్యాదుల బొమ్మలు గ్రామదేవతలనుంచి వచ్చినవని చెప్పవీలున్నది.

పిల్లలు బొమ్మలతో ఆటలాడుకొను వేళలలో బొమ్మలను సజీవములుగా భావించుచు, పెద్దల దైనందినజగమును లెక్కచేయక వ్యవహరించుట గలదు. అనగా పిల్లలొకరకమైన సమాధిలోనికి ప్రవేశించుచు, బొమ్మలతో సంభాషించుచు, అవి వారలను పలుకరించినట్లు భావించుచు మెలగుచున్నారు. ఇచటనే ఆధ్యాత్మికభావన, క్రీడాభావన రెండును కలియుచున్నవి. అందుచే పిల్లలను బొమ్మలాటలనుంచి మరలింపజూచుట మన అవివేకమేమోనని తోచుచున్నది.

పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి.

# బొమ్మ రైళ్లు

బాలబాలికల వినోదనిమిత్తం నిర్మింపబడిన చిన్న రైళ్లు. స్కాట్లండ్‌లో వేసవి సెలవుల్లో వీనిని నడుపుతారు. వీనిలో ప్రయాణం చెయ్యడానికి పెద్దవారికి ఒకషిల్లింగు, బాలబాలికలకు ఆరు పెన్నీల చొ॥ టిక్కట్లు.



ఈ రైలు ఇంజన్లను తిరుగుప్రయాణంకోసం చేత్తో గెంటి పట్టాలమీద వెనక్కు తిప్పవచ్చును. తేలిగ్గా ఉంటాయి.




గార్డు ఈలవేసి జెండా చూపుతున్నాడు. రైలు గుప్ గుప్‌మని బయలుదేరుతోంది.

భారతప్రభుత్వమువారు మొన్నటి స్వాతంత్ర్యోత్సవ దినసందర్భంలో భారత ప్రాచీనచరిత్రను స్మృతిపథానికి తెచ్చేందుకై విడుదలచేసిన తపాలాబిళ్లలు.





# విమర్శనము



### ప్రత్యక్షరాఘవము

నాలుగాశ్వాసముల పద్యకావ్యము. కవి: కీ. శే. భోగరాజు నారాయణమూర్తిగారు. ప్రకాశకులు: భోగరాజు నారాయణమూర్తి అండు సన్సు, విజయనగరము. వెల రూ. ౧-౮-౦.

పరమరామభక్తుడై తన్ను తానుగూడ మరచి 'రామదాసు' అను సార్థకనామముతో సుప్రసిద్ధుడైన కంచర్ల గోపనమంత్రియొక్క జీవితచరిత్ర యిందలి యితివృత్తము. ఆ మహనీయునిగురించిన అనేకవిషయములు, ఆయన రాఘవాపరనామధేయుడైన శ్రీరామచంద్రమూర్తిని ప్రత్యక్షము చేసుకొన్న వైనమును ఇందులో నిర్దిష్టములై యున్నవి. ఇతివృత్తవిశిష్టతతో పాటు కవితావిశిష్టతకూడ గల ఈ కావ్యమును ఆంధ్ర మహాశయులు తప్పక యథోచితముగా ఆదరింతురనియే విశ్వసింపవచ్చును.

### ప్రార్థన

రచయిత్రి: పొనాపతి రుక్మిణమ్మగారు, మెయినురోడ్డు, విశాఖపట్టణము.

క్రౌను ౧/౧౬ సైజున సుమారు ౩౦ పుటలు గల యీ లఘుగ్రంథములో రుక్మిణమ్మగారు వేదములలోనుండియు, ఉపనిషత్తులలోనుండియు ప్రార్థనా రూపములైన కొన్ని ఋక్కులను ఏరి, వానికి వీలైనంతవరకు మూలము నతిక్రమించక తెలుగులో వచన రూపమున సరళమైన తాత్పర్యమునుగూడ వ్రాసి దీనిని కూర్చియున్నారు. (భగవంతుని) ప్రార్థనయొక్క ఆవశ్యకతను, అందునుగురించి మనవారు కనబరచుచు వచ్చుచున్న వైఖరిని తెలుపు చిన్న భూమికకూడ దీనికి జోడించియున్నారు. ప్రార్థనాపరులకు వైదికసూక్తుల లోని విశేషములను తెలుసుకొని, అర్థపురస్సరముగా వానిని మననము చేయుటకు ఇది తోడుపడగలదై యున్నది.

## గ్రంథస్వీకారము

### దేవరహస్యాలు

వేదపురాణములలోని దేవతేతిహాసములను, తదితరచారిత్రకవిశేషములనుగురించిన విమర్శ గ్రంథము. గ్రంథకర్త: కొత్త భావయ్యచౌదరిగారు, సంగం జాగర్లమూడి, తెనాలి తాలూకా, గుంటూరుజిల్లా. వెల ౨ రూ.

### రాజ్యకాంక్ష

రాజస్థానకథావళిలోని ఒక ముఖ్యగాథ ఈ అయిదంకముల నాటకములోని ఇతివృత్తము. యిత: అంకరాజు శంకరరావుగారు. ప్రకాశకులు: డాక్టరు గురుమూర్తిఆశయనిర్వాహకసంఘము, రాజమహేంద్రవరము. వెల రూ. ౧.

### కామకళాశాస్త్రము

పెద్దపేరుతో అతిసాధారణరూపమున, అప్రబుద్ధదృష్టితో వెలసిన ఒక 'వామకార్థ' శాస్త్ర గ్రంథ మిది. రచయిత యెవరో ఇందులో కానరాదు. ప్రకాశకులు: బి. వి. జగన్నాథ్ అండ్ కో., సౌకారుపేట, మద్రాసు. వెల రూ. ౧.

### నవభారతం

[1948-1949]

రచయిత: సీతంరాజు సుబ్రహ్మణ్యశర్మగారు. ప్రకాశకులు: సుదర్శన పబ్లిషర్సు, 10/8 తంబుచెట్టి వీథి, మద్రాసు. వెల రూపాయిన్నర.

### త్వమేవాహం

కవితాసంపుటి. కవి: శ్రీ ఆరుద్ర. వెల ఒక రూపాయి. ప్రకాశకులు: కళాకేళి ప్రచురణలు, సామర్లకోట.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor— S. Sambhu Prasad.



హార్షుని ఊరేగింపు

ఇటీవల మద్రాసు చిత్ర-శిల్పకళాశాలలో జరిగిన చిత్రకళాప్రదర్శనమునందు ప్రత్యేకప్రశంసలకు పాత్రమైన కె. శ్రీనివాసులుగారి త్రివర్ణ చిత్రమునకు నకలు.